

# కమ్యూనిజం

అగస్టు 1985

* సి.పి.ఐ. - సి.పి.యం. ల మధ్య సిద్ధాంత విభేదాలు
* కమ్యూనిస్టులు : సోషల్ డెమాక్రాట్లు
* నూతన విద్యా విధానం
* రచయిత - ప్రపంచ దృక్పథం - ప్రతిభ - సృజనశీలత
* క్యూబా, వియత్నాం, సూడాన్ కమ్యూనిస్టులు

KRSA101M139

# కమ్యూనిజం

సంపుటి : 11 ★ ఆగస్టు 1985 ★ సంచిక : 4

ఈ సంచికలో....

# COMMUNISM (Telugu Monthly)

Volume : II AUGUST 1985 No. 4

*Contents :*

విడి ప్రతి —రూ. 1-50 పై.

సంవత్సర చందా —రూ. 15/-

---

# కమ్యూనిజం

*సంపాదకవర్గం :*

వై. విజయకుమార్

తమ్మారెడ్డి సత్యనారాయణ

ఈడ్పుగంటి నాగేశ్వరరావు

# వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ

అరబిక్, బెంగాలీ, బల్గేరియా, జక్, డానిష్, ఇంగ్లీష్, ఫినిష్, ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, గుజరాత్, హిబ్రూ, హిందీ, హంగేరియన్, ఇండోనీషియన్, ఇటాలియన్, జపనీస్, మళయాళం, మంగోలియన్, నార్వేజియన్, ఒరియా, పర్షియన్, పోలిష్, పోర్చుగీసు, పంజాబ్, రుమేనియన్, రష్యన్, సింగళీష్, స్పానిష్, స్వీడిష్, టాగాలోగ్, తమిళం, టర్కిష్, వియత్నామీస్ భాషలలో కూడ వెలువడుతున్నది.

# రచయిత - ప్రపంచ దృక్పథం, ప్రతిభ, సృజనశీలత

—ఫెలిక్స్ కుజ్నెత్సోవ్

*సోవియట్ యూనియన్ రచయితల యూనియన్ బోర్డు కార్యదర్శి*

1935 మధ్యలో అంటే సరిగ్గా అర్థ శతాబ్ది క్రితం పారిస్‌లో సంస్కృతీ రక్షణకై అంతర్జాతీయ మహాసభ జరిగింది. రెండో ప్రపంచ యుద్ధ నివారణకోసం సమిష్టి కృషి జరిపేందుకుగాను సాంస్కృతిక కార్యకర్తలు నిర్వహించిన ప్రప్రథమ సమావేశం అది. వివిధ దేశాలకు చెందినవారు, విభిన్న రాజకీయ దృక్పథాలు గల వారు ఆ సమావేశంలో పాల్గొన్నారు జర్మనీలో నాజీలు అధికారంలోకి వచ్చాక రెండో ప్రపంచ యుద్ధం ఉగ్గరపడుతున్నట్లు స్పష్టమైన సూచనలు కనిపించాయి. అయితే రెండవ ప్రపంచ యుద్ధ నివారణకు అవరోధం సృష్టించలేకపోయారు. అప్పటికి ఆ ముప్పు విస్తృతిని పలువురు స్పష్టంగా చూడలేకపోయారు. కానీ రష్యన్ మహా రచయిత, సోవియట్ సాహితీవేత్త అయిన మాగ్జిం గోర్కీ లాటి పురోగామి పౌర నాయకులు మాత్రం దగ్గరలో సంభవించనున్న ప్రమాదాన్ని విస్పష్టంగా చూడగలిగారు.

ఆ మహాసభ ముగియగానే కొత్తగా ఏర్పాటయిన సోవియట్ రచయిత యూనియన్ వ్యవస్థాపక సభ్యులైన గోర్కీ "సంస్కృతుల గురించి" శీర్షికతో ఒక వ్యాసం ప్రచురించారు. అందులో ఆయన ప్రథమ ప్రపంచ సంగ్రామం గురించి ప్రజలకు యిలా గుర్తు చేశారు :"1914 లో యూరప్ బూర్జువావర్గం వేలాది మంది మేధావులను సైనికులుగా కాల్పుల రణరంగంలోకి పంపింది, పరస్పరం సంహరించుకునేలా వత్తిడి చేసింది. ఆ 'సాంస్కృతిక కార్యకర్తలు' కాళ్ళు చేతులు కోల్పోడానికిముందు గ్యాస్ ఛేంబర్లలో మరణించడానికి ముందు లేదా కాల్పుల్లో చావడానికి ముందు సారవంతమైన భూముల్ని బంజర్లగా వుంచడానికీ సంస్కృతిని ధ్వంసం చేయడానికి శక్త్యానుసారం సాయపడ్డారు."

మానవ మారణకాండకు రంగం సిద్ధమవుతున్నదని గోర్కీ హెచ్చరించాడు; "అసంఖ్యాక నగరాలు, కర్మాగారాలు బూడిదకుప్పగా మిగిలిపోతాయి. బ్రహ్మాండంగా తయారైన నౌకలు నిటనిలువునా మునిగిపోతాయి; నేల ధ్వంసమైపోతుంది; పెద్ద సంఖ్యలో పిల్లలు మరణిస్తారు; దీర్ఘకాలంగా బలపడిన అధికార వర్గ నేరపూరిత వున్మాదం మరగి మరగి ఆఖరుకు శ్రమ ఫలితాలను నాశనం చేసేలా పరస్పర హననోద్యోగంలో[1] పాల్గొనేలా కార్మికులంపై రైతాంగంపై, మేధావులపై వత్తిడి చేస్తుంది.

మాక్సింగోర్కీ వూహించిందే జరిగింది. అది విచారకరం. అంతకంటె విచారకరమైన విషయం యేమిటంటే, మానవజాతి చరిత్ర పాఠాలను మరచిపోవడం. మానవజాతికి యీనాడు మరో యుద్ధ ప్రమాదం యెదురవుతున్నది. ఈ యుద్ధం మూలంగా సమస్త మానవజాతి అణ్వస్త్ర అగ్నిగుండంలో భస్మీపటలమైపోతుంది. ఈనాడు మళ్ళీ యుద్ధ జ్వాలల్ని మండిస్తున్నది. ఎవరంటే అదే సామ్రాజ్యవాద శిబిరానికిచెందిన మితవాద సైనిక విభాగాల సభ్యులే. మరెవరూకాదు వారే. ఈనాడు శాంతి శక్తులు అర్ధ శతాబ్ది నాటికంటె నిస్సందేహంగా ఎక్కువ బలోపేతంగా వున్నాయి. నేటి శాంతి శక్తుల్లో సోషలిస్టు సమాజం శక్తికూడా మిళితమయ్యే వుంది. అయితే పశ్చిమ దేశాల్లోని కొంతమంది కళాకారులైన మేధావులు యుద్ధమైతే కోరుకోవడంలేదు కానీ నిష్క్రియాపర వైఖరి అవలంబిస్తున్నారు. ఈ భూమండలంపైశాంతినీ, ప్రాణాలను కాపాడే విషయంలో అయినా సరే, రాజకీయాలన్నవి సాహిత్యానికీ, కళలకు సంబంధించినవికావు. అనే ధోరణిని వారు వ్యక్తం చేస్తున్నారు.

సోవియట్ యూనియన్ రచయితల యూనియన్ బోర్డు రజతోత్సవ సభలో ఇలాటి మేధావుల నుద్దేశించే మా పార్టీ ఇలా స్పష్టం చేసింది : "సంస్కృతీ కార్యకర్తలారా మీరే పక్షం అనే గోర్కీ సుప్రసిద్ధమైన విజ్ఞప్తికి యీనాడు ప్రత్యేక ప్రాముఖ్యం వుంది. కమ్యూనిస్టు వ్యతిరేకులు తరుచుగా చెప్తున్నట్లు నిజానికి సోవియట్ యూనియన్‌నా ? అమెరికానా ? దేశాన్ని ఎంపిక చెసుకోవాలన్నదికాదు అసలు సమస్య. అసలు సమస్య అంత తేలికైందికాదు. అసలు విషయం యేమిటంటే, ప్రాణమా ? నాగరికతా సంహారమా ? దేన్ని ఎంపిక చేసుకోవాలన్నదే. ఇక్కడ మధ్యేమార్గంఅంటూ లేదు. నువ్వు అటు యుద్ధ సన్నాహాలు చేస్తున్నవారి పక్షమైనా కావాలి, లేదా సామ్రాజ్యవాదుల దుస్సాహసిక విధానాలను తిరస్కరించేవారి పక్షమైనా కావాలి. ఇలా తిరస్కరించేవారు శాంతియుత సహజీవనంకోసం, నిరాయుధీకరణకోసం పోరాడుతున్నారు."[2]

1. మాక్సింగోర్కీ, 'సాహిత్యంమీద' మాస్కో 1955, పుటలు 333 - 334
2. ప్రావ్దా, సెప్టెంబరు 26, 1984.

శాంతి సంరక్షణకు తమ వంతు దోహదాన్ని ఎలా పెంపొందించడమా అన్న విషయమై, యుద్ధాన్ని సర్వశక్తితో వ్యతిరేకించడానికి ప్రజలను సన్నద్ధం చేయడానికి కళ ఎలా తోడ్పడుతుందా అన్న విషయమై సోవియట్ రచయితలు నిరంతరం ఆలోచిస్తున్నారు. దీనికి సమాధాన మివ్వడానికిగాను నేను మూల సూత్రాలనుంచే ప్రారంభించాలి. అనగా కళా సృజనాత్మకత స్వభావం పునాదుల గురించీ. కళా సృజనకు భావజాలంతోనూ, రాజకీయాలతోనూగల అవిభాజ్యమైన సంబంధం గురించీ మాకుగల భావాలను వివరించడంతో ప్రారంభించాలి.

ఈ వ్యాస శీర్షికలో సృజనశీలత అన్న పదానికి ముందు ప్రపంచ దృక్పథం ప్రతిభ అన్న రెండు పదాలున్నాయి. ఎందుచేతనంటే ఈ రెండు అంశాలే కళా సృజనాత్మకతను నిర్ణయిస్తాయి. మొత్తం మూడు అంశాల సంయోగ ఫలితమే రచన. ఈ సంయోగం ప్రతి రచయిత విషయంలోనూ సంక్లిష్టంగానూ, పూర్తిగా వైయక్తికంగానూ వుంటుంది. అందువల్ల ఫలితాలు కూడా స్పష్టంగానే భిన్నంగా వుంటాయి.

కళాత్మక సృజనశీలత పట్ల సరైన వైఖరిని రూపొందించడంలో మార్క్సిస్టు తాత్త్విక సాహితీ భావన గందరగోళంతో కూడిన సైద్ధాంతిక కలగూర గంపనూ, అపభ్రంశపు సామాజిక వాదాన్ని రెంటినీ పరిహరిస్తుంది. గందర గోళంలో కూడిన సైద్ధాంతిక కలగూరగంప దృక్పథం కళకు సంబంధించిన రెండు పరస్పర విరుద్ధ భావాలను అతకడానికి ప్రయత్నిస్తుంది. భౌతికవాద దృక్పథాన్ని, భావవాద దృక్పథాన్ని అతకడానికి యత్నిస్తుంది. మార్క్సిస్టు తత్వశాస్త్రంలో ఒక భాగంగా వున్నటువంటి భౌతికవాదం, కళ ఒక ప్రత్యేక సామాజిక సృజన కార్య కలాపం అని వాస్తవ జీవితమూ, జీవితానికి ఆధారభూతమైన మానవ సంబంధాలు, సృజనాత్మక కార్యకలాపానికి ప్రాతిపదిక వంటివని భావిస్తుంది. కాగా "శాశ్వత మైన ఆత్మ"తో గల సంబంధమే కళ అనీ, అఖండమైన ఆదిమ ప్రపంచంతో గల భ్రమాత్మక సంయోగమే కళ అని భావవాదం చెబుతుంది. కళకు సంబంధించిన భావవాద భావనలకు అంతులేదు. ఈ రెండు విభిన్న దృక్పథాలను కలిపే కృషిలో కలగూరగంప దృక్పథం నానా రకాల అసత్యాలకు, అస్పష్టతలకు అలంకార యుత వాక్యాలకు దిగుతూంటుంది. వాస్తవానికి యీ కృషి కేవలం నిరర్ధకమైంది.

ఇక అపభ్రంశపు సామాజికవాదం గురించి. ఇది తాను చెప్పేది మార్క్సిస్టు సిద్ధాంతమే అంటుంది; కళ పూర్తిగా సామాజిక వాతావరణంపైనా, వర్గ ప్రయో జనాలపైనా ఆధారపడి వుంటుందని మొండిగా, బండగా వాదిస్తుంది. అలెగ్జాండర్ పుష్కిన్ మహా వైభవ పతన యుగపు సిద్ధాంతవేత్త అనీ, ఉన్నత కుటుంబాల లక్ష్యానికి వంతపాడిన మధ్య తరగతి జనాలకు లియో టాల్‌స్టాయ్ ప్రతినిధి అని

ఈ అపభ్రంశపు సామాజికవాద సిద్ధాంతకారులు వాదిస్తారు. భూతకాలపు సాంస్కృతిక వారసత్వం మన సమాజానికి విరుద్ధమైంది అనే విషయాన్ని వీరు నిరాకరిస్తారు. కళలోనూ, సాహిత్యంలోనూ జీవితం గురించిన ఆదిమ తరహా వర్ణనలను, పడికట్టు వర్ణనలను సమర్థిస్తారు. వాస్తవానికి యిది నాగరికతా ప్రయోజనాలకు, అవసరాలకు వ్యతిరేకమైంది.

కళాత్మక సృజనశీలత పట్ల సరైన మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరి నిజానికి ఈ రెండు రకాల భావాలనూ తిరస్కరిస్తుంది. కళాత్మక సృజన పట్ల మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరి ప్రధాన సూత్రాలను శాస్త్రీయ సోషలిజం వ్యవస్థాపకులు రూపొందించారు. కళ అనే ప్రత్యేకమైనటువంటి-అవును మళ్ళీ చెబుతున్నాను- ప్రత్యేకమైనటువంటి చైతన్య రంగం అనే అవగాహన. ఈ చైతన్యం తన సొంత అంతరిక నియమాల ప్రకారం అభివృద్ధి చెందుతుందనే అవగాహన, ఆర్థిక. సామాజిక రంగాల్లో పనిచేసే నియమాలకు యీ నియమాలకు పొంతన లేనేలేదన్న అవగాహన- ఈ అవగాహనా సముదాయమే కళపట్ల మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరికి ప్రాతిపదిక. ఈ నియమాలను ఆ నియమాలతో జమకట్టడమంటే కళను అపభ్రంశం చేయడమే; కళాకారులందరినీ ఒకే కొలబద్దతో కొలవడమే. సి. పి. యస్. యు. ఆచరణలోనూ, ఇతర సోదరపార్టీల ఆచరణలోనూ ఒకవైఖరి మూర్తీభవించి వుంది. కళాకారులైన మేధావులపట్ల, వారి అన్వేషణల పట్ల కళాకారుల బహుముఖ సృజన కార్యకలాపాల పట్ల, కళా సౌందర్యాల పట్ల గౌరవనీయ వైఖరిని రూపొందించడంలో మా పార్టీ ఒక సూత్రాన్ని గమనిస్తున్నది. లెనిన్ ప్రవచించిన ఈ క్రింది సూక్తి మనకు మార్గదర్శకత్వం వహిస్తున్నది. "సాహిత్య రంగంలో యాంత్రికమైన సరుబాటు కానీ, ఒకే స్థాయికి కుదించడం కానీ కుదరదు. మైనారిటీపై మెజారిటీ నిర్ణయం చెల్లుబాటు కూడా కుదరదు. ఈ రంగంలో వ్యక్తిగతమైన చొరవకు, వ్యక్తిగత యిష్టాయిష్టాలకు యోచనకు, కల్పనకు, రూపానికీ, ఇతివృత్తానికీ అధికాధిక అవకాశాన్ని నిచ్చందేహంగా కల్పించాలి."[1]

నూతన సమాజ విజయాలను శృతిమించి కీర్తించడం పట్ల సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ విచారం వ్యక్తం చేస్తుంది; ఉత్కృష్టమైన భావాలు, ఉన్నతమైన ఇతివృత్తాలు లుప్తమైన మొరటు రచనలకు మా పార్టీ వ్యతిరేకం; కళల్లోని విసుగుపుట్టించే ఏకరూపతను, సున్నితమైన భావ తీవ్రత రాహిత్యాన్ని మా పార్టీ అభిశంసిస్తుంది.

నూతన సమాజ నిర్మాణానికి సంబంధించిన బృహత్ కర్తవ్యాల పరిపూర్తికి ఫలప్రదంగా తోడ్పడే సాహిత్యం, కళలకు గొప్ప ప్రాముఖ్యం యిస్తామని మా

1. వి. ఐ. లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, సంపుటి 10, పుట 46.

పార్టీ 27 వ మహాసభ సన్నాహ పత్రాల్లో స్పష్టంగా పునరుద్ఘాటించింది. 1985 ఏప్రిల్‌లో జరిగిన విస్తృత సమావేశంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ యిలా స్పష్టీకరించింది : "సోవియట్ సాహిత్యం, కళలకు చెందిన ఉత్కృష్టమైన కృతులను పార్టీయొక్క, ప్రజల యొక్క ప్రధాన కార్యకలాపాల ప్రయోజనాలనుంచి విడదీయజాలము. ఈనాడు మనం నిర్వర్తిస్తున్న నూతన కర్తవ్యాలు మన కళాత్మక సృజనశీలతలో ప్రతిబింబిస్తాయనడం నిస్సందేహం; మన కళాత్మక సృజన పోషిస్తు జీవిత సత్యాన్ని నొక్కిచెబుతుంది." 1

కళను కానీ సాహిత్యాన్ని కానీ పరీజు వేయడానికి ఉపకరించే ఒకానొక ప్రధాన గీటురాయి ఆ కళలో లేదా ఆ సాహిత్యంలో జీవిత సత్యం చిత్రించబడిందా లేదా అన్నదే అని మేము భావిస్తాం. వాస్తవానికి కళాకారుని ప్రపంచ దృక్పథం మధ్య అతని కృషి మధ్య గల సంబంధం చాలా సంక్లిష్టమైంది; ఇది కేవలం దర్పణ ప్రతిఫలం కంటె చాలా సంక్లిష్టమైనదీ, జటిలమైనదీ.

ఈ సంబంధం స్వభావాన్ని మార్క్స్, ఏంగెల్స్‌లు స్పష్టంగా అవగాహన చేసుకున్నారు. ఫ్రెంచి రచయిత బాల్జాక్ రాచరికవాది అని, చరిత్ర నుంచి అదృశ్యం కానున్న వర్గం పట్ల ఆయన సానుభూతి చూపాడని చెబుతూ ఏంగెల్స్ ఇలా రాశాడు :

"తాను గాఢంగా సానుభూతి చూపే స్త్రీ పురుషులను అనగా ఉన్నత కుటుంబీకులను చిత్రిస్తున్న సందర్భంగా ఆయన వ్యంగ్యం పదును దేరినంతగా మరెప్పుడూ పదును దేరదు; ఆయన వక్రోక్తి కటుకుదేరినంతగా మరెప్పుడూ కటుకు దేరదు. తనకు అత్యంత రాజకీయ ప్రత్యర్థులైన రిపబ్లికన్ వీరుల విషయం ప్రస్తావించినప్పుడు ఆయన వ్యక్తం చేసినంత ప్రశంసా భావం మరెవరి విషయంలోనూ వ్యక్తం చేయడు. బాల్జాక్ యీ విధంగా తన సొంత వర్గ సానుభూతికీ, రాజకీయ అపోహలకూ వ్యతిరేకంగా తన్నుతాను వ్యక్తం చేసుకోవలసి వచ్చింది; తనకు యిష్టులైన ఉన్నత కుటుంబీకుల (రాజవంశీయుల) పతనం ఆవశ్యకతని ఆయన గమనించాడు; అంతకంటె మంచి భవితవ్యం వారికి తగదు అన్నట్లుగా వారిని చిత్రించాడు; భవిష్యత్తుకు చెందిన నిజమైన మనుషులను ఆయన చూశాడు. దీనిని నేను ఒకానొక మహత్తర వాస్తవికవాదం విజయంగా, బాల్జాక్‌లోని ఒకానొక గొప్ప లక్షణంగా పరిగణిస్తాను." 2

---

1. ప్రావ్దా, ఏప్రిల్ 24, 1985.

2. లండన్‌లోని మార్గరెట్ హార్క్‌నెస్‌కు ఎంగెల్స్ లేఖ 1888 ఏప్రిల్ ప్రారంభంలో. కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగెల్స్‌ల "సెలెక్టెడ్ కరెస్పాండెన్స్" మాస్కో 1965 పుట 402-403.

గత కాలపు మహా రచయితలకు కళాత్మక సత్యం అనే భావం మార్గదర్శకత్వం వహించిందనీ, అలాటి కళాత్మక సత్యం నిజమైన ప్రతిభలో అనుల్లంఘనీయమైన అంతర్భాగమని మార్క్సిజం ప్రామాణిక గ్రంథాలు శక్తివంతంగా స్పష్టం చేశాయి. గత కాలపు ఉత్తమ కళాకారుల రచనలను మానవ విజ్ఞాన భాండాగారంలో అమూల్యమైనవి చేసేది ఇదే. ఇట్టి మానవ విజ్ఞాన భాండాగారానికి స్వేచ్ఛా శ్రామిక జనుల సమాజం సంక్రమించుకుంటుంది. అలా సంక్రమించుకోవడం ఆ సమాజం హక్కు. అది ఆ భాండాగారంలోని సంపదను జీర్ణం చేసుకుని దానిని మరింత వృద్ధి చేస్తుంది.

వాస్తవానికి గత కాలపు వారసత్వాన్ని జీర్ణం చేసుకోవడంలో సోషలిజం విచక్షణ పాటిస్తుంది. అలగా ప్రతిదానినీ జీర్ణం చేసుకోవాలనుకోదు. గత శకాలకు చెందిన మహా కళాకారుల రచనలోని కళాఖండాల్లోని కొన్ని అంశాలను మాత్రమే సోషలిజం భద్రంగా, ప్రాణప్రదంగా దాచుకుంటుంది. మానవత్వాన్ని ప్రశంసించడం, విజ్ఞానదాహం, ప్రజా సంక్షేమం కోసం కృషి చేయాల్సిందిగా యిచ్చే విజ్ఞప్తి, వీటిని దాచుకుంటాం. కాగా మతతత్వపు భావవాదాన్ని, కళలోని చదునుచేసే ధోరణిని వ్యక్తి వాదాన్ని కీర్తించడం వగైరా అంశాలను మనం విమర్శిస్తాం.

గతకాలపు వారసత్వానికి సంబంధించి, బెలిన్‌స్కీ, దోబ్రోల్యుబోవ్, చెర్నిషేవ్‌స్కీ యింకా 19 వ శతాబ్ది మధ్య కాలంనాటి ఇతర రష్యన్ విప్లవకర ప్రజాతంత్రవాదుల రచనలను సోవియట్ సాహితీ రంగంలోని రచయితలు, సిద్ధాంతవేత్తలు ఎంతో ప్రియమైనవిగా సంభావిస్తారు. 19 వ శతాబ్ది మధ్యకాలంనాటి విప్లవకర ప్రజాతంత్రవాదులు మార్క్సిస్టులు కాదు కానీ వారు శాస్త్రీయ సోషలిజంకు దగ్గరగా వచ్చారు; తత్వశాస్త్రంలో భౌతికవాదాన్ని ప్రశంసించారు; ప్రకృతి పరిణామంలో గతితర్కానికి దగ్గరగా వచ్చారు; శ్రామిక జనులను విముక్తి చేయడానికి విప్లవకర పద్ధతులను ప్రతిపాదించారు.

అంతకంటె ముఖ్యం- వారి తాత్విక, కళాసౌందర్య సిద్ధాంతంలోని కొన్ని కీలకమైన సూత్రాల అభివృద్ధిలో మేము విప్లవకర ప్రజాతంత్రవాదుల కొనసాగింపుదార్లమని భావిస్తాం. రష్యన్ మార్క్సిస్టులు అలాటి సూత్రాలను వారినుంచి స్వీకరించి వాటిని మరింత పరిపుష్టం చేశారు. ఇలా చేసిన వారిలో లెనిన్ ప్రథమ గణ్యుడు.

కళాకారుడు తన రంగంలో విజయవంతం కావాలంటే ప్రతిభకు గల విశేష ప్రాముఖ్యాన్ని స్పష్టంగా గుర్తించిన లెనిన్ యిలా రాశాడు : "మానవ వైఫల్యాలను తప్పుపట్టకండి ! ప్రతిభ అపుదైనది. దానిని క్రమబద్ధంగా,

జాగ్రత్తగా ప్రోదిచేయాలి"[1] కళలో భావజాలం వుండకూడదనే భావాన్నీ, కళాత్మక సృజనకు ప్రపంచ దృక్పథంతో పనిలేదనే కొంతమంది తత్వవేత్తల, కళాకారుల వాదననూ విప్లవకర ప్రజాతంత్ర వాదులు, మార్క్సిస్టు విమర్శకులు, లెనిన్ అందరూ నిరాకరించారు.

మాటలు, కళాత్మక పదచిత్రాలు ఇవి అన్ని విషయాల్లోనూ చాలా ముఖ్యమైనవి. అవి నిర్దిష్ట సందేశాన్ని పాఠకులకు బట్వాడా చేస్తాయి. పర్యవసానంగా వాటికి సైద్ధాంతిక, తాత్విక ప్రాముఖ్యం వుంటుంది. చెర్నిషెవ్‌స్కీ యిలా రాశాడు: రచయిత ఏదో ఒక వాదాన్ని సమర్థించేవాడుగా వుండాలి. ఇది అధికార ముద్ర లాంటిది. తొలగించుకోవాలనుకున్నా ఇది తొలగిపోదు."[2]

కృత్రిమ పొగడ్తలతో పద్యాలు రాయగూడదన్న విషయాన్ని నిరూపించాల్సిన అవసరం వున్నపుడు మాత్రమే "శుద్ధకళ", "కళ కళ కోసమే" అన్న నినాదాలు చెప్పుతాయని ఆయన ఉద్ఘాటించాడు. మరో విధంగా చెప్తే, అధికారవర్గాల అసత్యాల సేవకు కలాన్ని అంకితం చేసే ధోరణి నిరసించేపుడు మాత్రమే ఆ నినాదాలు పని కొస్తాయి. ఇతరత్రా ఈ నినాదాలు ప్రగతిశీల భావాలకు వ్యతిరేకంగా ఉపయోగ పడుతున్నాయి. కాగా తన స్వప్రయోజనాలకు తప్ప మిగతా ఎలాంటి ప్రయోజనాల కైనా పాటుపడరాదని విశ్వసించే కళాకారుడు, కళకు అవమానం తెస్తున్నాడు; కళకు ప్రమాదకారి. అతడు నిష్ప్రయోజకుడుగా మారి అర్థవంతమైన "అధికార ముద్ర"ను సొంతం కోల్పోతాడు."[3]

కళ సత్యమైనదిగా, మహత్తరమైనదిగా వుండాలంటే అది తన యుగం లోని పురోగామి ఆదర్శాల వ్యాప్తికి వుపకరించాలన్న బోధన ఎంత అన్వయింప తగిందో పై భావాలు కూడా నేటి వాస్తవికతకు అంతే అన్వయింపతగినవి. ఆ యుగపు తక్షణ ఆవశ్యకతలను సంతృప్తిపరచే ఆదర్శాలు, లక్ష్యాలు కళాకృతులకు గంభీరమైన సామాజిక మూలాన్ని ప్రసాదించడమేకాక, వాస్తవాన్ని నిజంగానూ, ప్రగాఢంగానూ అవగాహన చేసుకోవడంలో కళాకారులకు అవి తోడ్పడతాయి కూడా. ఇందుకు విరుద్ధంగా, జీవిత సత్యంలోకి చొరబడకుండా ప్రతిభను తత్వశాస్త్రంలోని ప్రగతి నిరోధక లక్షణాలు అడ్డుకుంటాయి; ప్రతిభ అభివృద్ధి చెందకుండా నిరోధిస్తాయి; అలాంటి ప్రగతి నిరోధక లక్షణాలను గనక పరమమైనవిగా చిత్రించే పక్షంలో ఆ కళాకారుడిక మరణించినట్లే; అతనికి పరిష్కార

---

1. వి. ఐ. లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, సంపుటి 35, పుట 99.

2. చెర్నిషెవ్‌స్కీ కలెక్టెడ్ వర్క్స్, సంపుటి 3, మాస్కో, 1947. పుట 30 (రష్యన్ భాషలో).

3. అదే గ్రంథం, రెండవ సంపుటి, పుటలు 271, 274

సాధ్యంకాని సృజనాత్మక సంక్షోభం ఎదురవుతుంది; జీవితంలో నిస్పృహ ఆవరించక తప్పదు. ఉదాహరణకు నికొలాయ్ గోగొల్ విషయంలో ఇదే జరిగింది. దోషపూరితమైన ప్రపంచ దృక్పథం, రచనల లేదా కళాకృతుల కళాత్మక స్థాయిని దెబ్బతీస్తుంది; కళా సౌందర్య ప్రభావాన్ని కుదిస్తుంది

## కళాత్మక సృజనశీలతలో ప్రపంచ దృక్పథం పాత్ర

నాగరికత యొక్క రాజకీయ, సామాజిక చరిత్రం సంక్లిష్టమయ్యే కొద్దీ, రెండు సామాజిక వ్యవస్థలైన సోషలిజం, పెట్టుబడిదారీ విధానం మధ్య వైరుధ్యాలు ప్రకోపించేకొద్దీ, కళాత్మక సృజనశీలతలో ప్రపంచ దృక్పథం పాత్ర క్రమేణా పెరుగుతుంది. మార్క్సిస్టు-లెనినిస్టు ప్రపంచ దృక్పథం చాలా బలీయమైన, స్థిరమైన భావాల వ్యవస్థ. వర్తమానకాలపు, పురోగామి దేశాల, యావత్ మానవ జాతియొక్క మౌలిక అవసరాలను యీ భావాలు శాస్త్రీయంగా వ్యక్తం చేస్తాయి. ఈ భావాల వ్యవస్థ, సాంస్కృతిక కార్యకర్తలకు (కళాకారులకు) స్పష్టమైన అవగాహన కలిగిస్తుంది; వారికి భవిష్యత్తుపై విశ్వాసాన్ని కల్పిస్తుంది; మానవాళి సృజనశీల శక్తులపై ఆశావహ విశ్వాసాన్ని సృష్టిస్తుంది. ఇక్కడొక విషయం స్పష్టం చేయాలి. కళల్లోనూ, సాహిత్యంలోనూ ప్రపంచ దృక్పథం ప్రధానంగా సృజనాత్మక లక్ష్యంలోనూ, కళాకారుని వైఖరిలోనూ వ్యక్తమవుతుంది. వ్లాదిమిర్ మయకోవ్‌స్కి రచనలలోలాగా అవి కళ తాలూకు అతి సున్నితమైన ఛాయా భేదాల్లో వ్యక్తమవుతాయి. సృజనాత్మక కళాకారులు తమ ప్రతిభలను సంపూర్ణంగా, పరిపుష్టంగా వెల్లడించడానికి సహాయపడడమే తమ తాత్విక, కళా సౌందర్య, విమర్శక, సాహితీకృషుల ప్రధాన ప్రయోజనం అని మార్క్సిస్టు-లెనినిస్టు మేధావులు భావిస్తారు; శ్రమజీవుల సంక్షేమం కోసం సహకరించడం కూడా తమ ప్రధాన ప్రయోజనమని వారు పరిగణిస్తారు. జానపద స్వభావానికీ, సృజనలో పాక్షికతకు సంబంధించిన సామరస్య పూర్వకమైన నికరమైన భావనద్వారా మా పార్టీ యీ సూత్రాలను, వైఖరిని ఆచరణలో అమలుపరుస్తుంది. తమ సమాజానికి, కమ్యూనిస్టు లక్ష్యాలకూ కళాకారులు చైతన్యవంతంగా సేవ చేయాలన్నది మా అభిమతం. ఇలాంటి సేవయొక్క మౌలికరూపం యేమిటంటే పురోగాములైన, చురుగ్గా వ్యవహరించే, ఆలోచనాత్మకశక్తిగల ప్రజలయొక్క స్పష్టాతిస్పష్టమైన రూపాలను సృష్టించడం. సమానత్వం, న్యాయం, మానవత్వం, అంతర్జాతీయత అనే సోషలిస్టు లక్ష్యాలను జీవితంలోకి పరివర్తింపచేసేందుకుగాను ఆ ప్రజలు సమాజాన్ని పునర్నిర్మించేవారు. అంతేకాదు, వారు ప్రజల ఆత్మిక అవసరాలను సైతం సంపూర్ణంగా ఉన్నతస్థాయికి తీసుకెళ్ళేవారు.

సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల్లోని సాహిత్యకారులు, కళాకారులు ఇంకా ప్రపంచ వ్యాపితంగా ఉన్న ప్రగతిశీలకాములు, మా అభిప్రాయాలతో ఏకీభవించే వీరు సోషలిస్టు వాస్తవికతను తమ కళాత్మక పద్ధతిగా ఎంపిక చేసుకున్నారు. 19వ శతాబ్దిలో ప్రధాన రచయితల్లో అత్యధికులు విమర్శనాత్మక వాస్తవికతను తమ సాహిత్యంలో పాటించారు. విమర్శనాత్మక వాస్తవికతయొక్క ఒకానొక విశిష్ట లక్షణం ఏమిటంటే అది బోర్జువా సమాజంలోని వైరుధ్యాలను వెల్లడించింది; పీడితుల నిజస్వరూపాన్ని ఎండగట్టి, దళిత జీవుల, శ్రమజీవుల లక్ష్యం కోసం నిలబడింది. నేటిమన కళాకారులు, రచయితలు విమర్శనాత్మక వాస్తవికతకు విలువ ఇవ్వడమేకాక ఆ పద్ధతి సాధించిన విజయాలను అభివృద్ధి పరచారు. జీవితంలో ప్రవేశించిన నూతన పరిణామాలను విమర్శనాత్మకంగా చిత్రించడంలోనూ, కళాత్మకంగా విశ్లేషించడంలోనూ సోషలిస్టు వాస్తవికతావాదులకు నూతన సమాజ లక్ష్యాలు, కళను సంబంధించిన పార్టీ భావనా మార్గదర్శకత్వం వహిస్తాయి.

సోషలిస్టు వాస్తవికత కళలో పురోగామి ప్రపంచ దృక్పథానికి గొప్ప విలువ ఇచ్చినప్పటికీ అది కళా పద్ధతుల్లో సంకేతనారాధనకు (Fetishism) దూరంగా ఉంటుంది. ఇది కళారంగంలో అన్వేషణా స్వేచ్ఛను ప్రోత్సహిస్తుంది. ప్రపంచ దృక్పథం, కళా సౌందర్యం మధ్యగల అంతర్ సంబంధంలాటి సమస్యల పట్ల వైవిధ్యాన్ని ప్రోత్సహిస్తుంది; రచనలోని ఇతివృత్తం, రూపం మధ్యగల అంతర్ సంబంధం పట్లనూ, కళాకారుని తాత్విక, కళా సౌందర్య వైఖరి, నైతిక సామాజిక వైఖరి మధ్యగల అంతర్ సంబంధం పట్లనూ కూడా ఇది వైవిధ్యాన్ని ప్రోత్సహిస్తుంది. ఈ విషయంలో ఇంకా అనేక చర్చనీయాంశా లున్నాయి. ఉదాహరణకు, ఏదైనా ఒక కళాకృతిలో "తాత్కాలిక" విలువకూ, "శాశ్వత"మైన తాత్విక విలువకూ మధ్యగల సరైన సమన్వయం ఏమిటి అన్న సమస్యపై చర్చ కొనసాగుతూనే ఉన్నది. సృజనశీలతా స్థాయిలో గనక తాత్కాలికతకు ఒక్క పిసరు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్లయితే ఆ రచనకు అవాంఛనీయమైన శాశ్వతత్వం లభిస్తుంది; అలాగే కళాకారుడు గనక "శాశ్వత" సమస్యలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్లయితే ఆ రచనలో వర్తమాన ప్రాముఖ్యం లుప్తమయిపోతుంది. ఫలితంగా పాఠకుని ఆసక్తి పోతుంది. ఈ దృక్కోణం నుండి ఏదైనా కళాకృషిని కళాకారుడు వివేకవంతంగా, విమర్శనాత్మకంగా విశ్లేషించినట్లయితే ఒట్టి విశ్లేషణా పద్ధతి అతడికి తోడ్పడుతుంది.

బహుశా యింతకంటె వివాదగ్రస్తమైన విషయం యేమిటంటే, సోషలిస్టు వాస్తవికతా కళా రంగంలో నిరంతరం కొనసాగుతున్న అన్వేషణలను, కొత్త

పుంతలను, అనుభవాలను మదింపుచేసే సమస్య. ఇందులో ఏ అన్వేషణలు సరైన అభిముఖంలో వున్నాయి? ఏవి కళాకారుని పక్కదారి పట్టిస్తాయి? ఏ విషయంలో సంప్రదాయంపట్ల విధేయత కొనసాగించాలి? వేటి విషయంలో అట్టి విధేయతకు స్వస్తిచెప్పాలి? ఈ ప్రశ్నలకు ఇంకా సమాధానం చెప్పవలసే వుంది.

అయితే ఇలాటి వివాదగ్రస్త విషయాలలో మొండిగా ఏవో నిర్వచనాలు సృష్టించి, వాటిని సాకుచేసుకుని సోషలిస్టు వాస్తవికత తాలూకు సృజనాత్మక పద్ధతులకు యిరుకు సరిహద్దులు గీయడానికి ప్రయత్నించడంవల్ల ప్రయోజనం శూన్యమని ఎక్కువమంది సోవియట్ తత్వవేత్తలు, సాహితీ విమర్శకులు భావిస్తారు. మా కళా పద్ధతికి అనుభవాలే ప్రాతిపదిక. ఈ పద్ధతి జీవితాన్ని వాస్తవికంగా చిత్రిస్తుంది; ప్రపంచంలో పలుచోట్ల అభివృద్ధి చెందిన కళాప్రక్రియ ధోరణులను యీ పద్ధతి తనలో సంలీనం చేసుకుంటుంది. ప్రజల జీవితానికి దూరంగా వుండే పద్ధతికీ, ప్రయోగం కోసమే ప్రయోగాల పద్ధతికీ, జీవితానికి దూరంగావుండే 'శుద్ధకళా' వాదానికీ, సోషలిస్టు వాస్తవికత దూరంగా వుంటుంది. పై పద్ధతులు కళ ఆత్మహత్యకు దారితీస్తాయి.

మార్క్సిస్టు-లెనినిస్టు భావనసుంచి వెలువడే కొన్ని మౌలికమైన సైద్ధాంతిక సమస్యలను మనం ఇక్కడ స్పృశించాం. అయితే కళాకారులు ఎదుర్కొంటున్న ఆచరణపూర్వక కర్తవ్యాలను చర్చించడం ద్వారా మనం ఇది ప్రారంభించాం. ముఖ్యంగా యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా సాగించే తమ పోరాటానికి సంబంధించిన కర్తవ్యాల చర్చతో యిది ప్రారంభించాం. సృజన శీలతలో ప్రపంచ దృక్పథానికిగల ప్రాముఖ్యతపై చర్చకు, యీ సమస్యపై ప్రత్యక్ష సంబంధం వుంది. శాంతి సంరక్షణలాటి భౌగోళిక పరిణామాల విషయంలో తనకు గల పాత్ర గురించి కళాకారుడు ఎంత లోతుగా అవగాహన చేసుకుంటే, జీవితం తాలూకు వైరుధ్యాలకు ఆ పరిణామాలతో గల పటిష్ట సంబంధం యేమిటో అంత విస్పష్టంగా అర్థమవుతుంది; కళాత్మక సృజనశీలత అంటే యేమిటో అంత స్పష్టంగా బోధపడుతుంది. కళయొక్క నిజమైన స్వభావంపట్ల విధేయంగా వుండాలనుకునేవారు సహజంగానే ప్రజల మనసుల్లో శాంతిపట్ల ఆకాంక్ష నిత్యం జ్వలించేలా చేయడానికీ, మానవ విలువలపట్ల ప్రజలకు గల నిబద్ధతను మరింత పెంచడానికీ మానవ వ్యతిరేక, సమాజ వ్యతిరేక ధోరణులకు వ్యతిరేకంగా పోరాడే తత్వాన్ని పెంచడానికి తమ శక్తికొద్దీ కృషి చేస్తారు.

నూతన పౌరునిపైనా, నూతన పౌరుని రూపుదిద్దడంపైనా, శ్రద్ధ కేంద్రీకరిస్తున్న సోవియట్ సాహిత్యానికి మూలం ఇలాటి అభిప్రాయాలు, భావాలే. వాస్తవానికి నూతన పౌరుని రూపుదిద్దడం అన్నది సంక్లిష్టమైన, వైవిధ్య భరితమైన

క్రమం. అది అంత తేలికైన క్రమమేమీకాదు. వాస్తవానికి నూతన రూపం కల్పించే సామాజిక లక్ష్యంతో ఆత్మిక - నైతిక పార్శ్వం అవిభాజ్యంగా ముడిపడి వున్న విషయాన్ని మీరు సోవియట్ సాహితీ రచనల్లో స్పష్టంగా చూడవచ్చు.

స్థలాభావం మూలంగా, యీ దిశలో సాధించిన ముఖ్యమైన విజయాలను వివరించలేక పోతున్నాము యూరీ బొందారెవ్, వాసిల్ బైకోవ్ లాటి రచయితలు తమ రచనల్లో చరిత్రపట్ల, మాతృభూమిపట్ల, తన సొంత అంతరాత్మపట్ల వ్యక్తికి గల బాధ్యతను చక్కగా చిత్రించాడు. యుద్ధ కాలంనాటి అనుభవాలకూ, నేటి మన కాలపు అనుభవాలకూ మధ్యగల వ్యత్యాసాన్ని వారు స్పష్టంగా చూపారు. మొత్తానికి మనిషికిగల వివిధ బాధ్యతల మధ్య అంతస్సంబంధాన్ని చక్కగా చిత్రించారు. మరో ఉదాహరణ. చింగిజ్ ఐత్మతోవ్ రచనల్లో చరిత్ర పూర్వ దశలో మానవ పరిణామానికీ, రోదసి యుగంలో అడుగిడుతున్న వర్తమాన మానవ పరిణామానికీ మధ్యగల సంబంధం చక్కగా చిత్రింపబడింది సైబీరియా గ్రామీణ సమాజాన్ని చిత్రించిన ఫైడర్ అబ్రమోవ్, వాసిలీ బెలోవ్, వాలెంటిన్ రసపుతిన్ రచనల్లోనూ, ఆధునిక నగర జీవితాన్ని వర్ణించిన యూరీ త్రిఫనోవ్ రచనల్లోనూ జీవిత వైవిధ్యం చిత్రింపబడింది; నేటి బహుళజాతి సోవియట్‌లోని వచన రచనా స్వరూపాన్ని వీటిలో గమనించవచ్చు.

నేటి సోవియట్ వచన సాహిత్యం రష్యన్ సాహిత్యపు ఉన్నతమైన గత సంప్రదాయాలను ఒకవైపు కొనసాగిస్తూనే నేటి నూతన చారిత్రకమలుపులో పాఠకుల హృదయాల్లో "సార్వకాలిక" ప్రశ్నలను లేవనెత్తుతున్నది. నిజానికి ఇవి కలవరం కలిగించే ప్రశ్నలు. నూతన చారిత్రక మలుపు అంటే ప్రవర్థిత సోషలిజం పరిపుష్టం అవుతున్న దశ యిది. అయితే కలవరం కలిగించే "సార్వకాలిక" మైన ఆ ప్రశ్నలేవి? ఆ ప్రశ్నలు యివి: నువ్వుసరైన మార్గంలోనే జీవిస్తున్నావా? నీ జీవితానికిగల అర్థం యేమిటి? సమాజం పట్ల, తోటిప్రజల పట్ల, మాతృభూమి పట్ల, మొత్తంగా మానవ జాతిపట్ల నీ వ్యక్తిగత, పౌర బాధ్యతను ఎలా ప్రదర్శిస్తావు?

జీవిత పరమార్థం అన్వేషణను ఉమ్మడి విలువల వ్యవస్థలో ప్రధాన మైనదిగా పరిగణిస్తున్నాం. కాగా తన అంతరాత్మ పట్ల బాధ్యత నైతిక విలువల వ్యవస్థలో మౌలికమైంది. మనిషి ఎందుకోసం జీవిస్తాడు? మనిషి ఎలా జీవిస్తాడు? అనే రెండు అంశాల మధ్యగల పరస్పర పరాధీనతను సాహిత్యం వెలుగులోకి తెస్తుంది. పదార్థిక అవసరాల సంతృప్తికీ, పౌర జీవితానికి హాని కలిగించే విజయానికీ గనుక మనిషి ప్రాధాన్యత యిచ్చినట్లయితే అది అహం భావానికీ, నైచ్యానికీ, పతనోన్ముఖ ప్రవర్తనకూ దారి తీస్తుందని సాహిత్యం చెబుతుంది. మనిషియొక్క సామాజిక సంబంధాల సముదాయం అతని ఆత్మిక

రూపంగా, నైతిక విలువలుగా, ప్రవర్తనగా "పరివర్తన చెందే పద్ధతిని" విశ్లే-
షించడానికి సామాజిక పద్ధతులు వినియోగింపబడతాయి.

కొద్దికాలంక్రితం కొంతమంది సోవియట్ విమర్శకులు, తత్వవేత్తలు, ఆఖరుకు రచయితలు కూడా భావవాదానికి వ్యతిరేకంగా పోరాడే సందర్భంగా వారు భావవాదం తాలూకు భావనలు నేటికి తగినవి కావన్నట్లుగా ధ్వనించేవారన్న విషయం మేము అంగీకరిస్తాం. మా సమాజమూ, సాహిత్యమూ, రెండూ కూడా ఈ రకం "అతిశయోక్తుల" నుంచి ఇప్పుడు బయటపడ్డాయి. కమ్యూనిస్టు నైతికత తాలూకు లెనినిస్టు భావన యొక్క పూర్తిలోతును గ్రహించిన ఫలితంగా అవి అలా వాటినుంచి బయటపడ్డాయి. లెనినిస్టు భావన తాలూకు ఆచరణాత్మక రూపం పట్ల సోవియట్ వచన రచయితలు నియమబద్ధంగా శ్రద్ధవహిస్తున్నారు.

శతాబ్దాల పాటు విభిన్న రూపాల్లో మతమూ, దాని ఆధారంగా తలెత్తిన భావవాద-తాత్విక వ్యవస్థలు, మనిషి మెదడు పైనా, ఆత్మిక, నైతిక సమస్యల, పరిష్కృతి పైనా, ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన విషయాన్ని మనం మరచిపోలేము. ఇక్కడొక విషయాన్ని వివరించాలి. 19 వ శతాబ్దపు రష్యన్ సాహిత్యం నిశ్చయంగా "సార్వకాలిక" మైన ఆత్మిక సమస్యలను లేవనెత్తింది. ఆ శతాబ్దపు మహా రచయితలైన గొగోల్, దాస్తవ్‌స్కీ, టాల్‌స్టాయ్‌లు కూడా ఆ ప్రశ్నలను అన్వేషించే సందర్భంగా మతపరమైన ప్రపంచ దృక్పథంపరిధి దాటి వెళ్ళలేకపోయారు.

అలాంటి ప్రశ్నలకు సోషలిజం సమాధానం ఇస్తుందేమో అని దాస్తవ్‌స్కీ సందేహం వెలిబుచ్చాడు. కాని చివరకు సోషలిస్టు సమాజం మనిషికి తిండి, పాదార్థిక సమానత్వం కల్పిస్తుంది కానీ మనిషి దేనికోసం జీవించాలని కానీ తన అంతరాత్మ ఆదేశాల ప్రకారం ఎలా జీవించాలని కానీ సోషలిజం నేర్పదన్న నిర్ణయానికి ఆయన వచ్చాడు. విజ్ఞాన శాస్త్రాల అన్వేషణ, సౌకర్యాల సంపాదన యేవీకూడా జీవిత ప్రయోజనం యేమిటి? అన్న ప్రశ్ననుంచి మనిషిని విముక్తి చేయలేవు అన్న అంశంగురించి ఆయన నవలల్లోని పాత్రలు వితర్కిస్తాయి.

దాస్తొవిస్కీని తీవ్రంగా కలవరపరచిన యీ ప్రశ్న వర్తమాన వాస్తవానికి కూడా ముఖ్యంగా బూర్జువా వినిమయ సమాజానికి కూడా అన్వయిస్తుంది. అలాగే మనందరకూ కూడా అన్వయిస్తుంది. సోషలిజమూ, దాస్తవ్‌స్కీ రచనలు యిలా సమాధానమిస్తాయి : మహోత్కృష్టమైన సోషలిస్టు ఆదర్శాలకు అనుగుణంగా సమాజాన్ని పునర్నిర్మిస్తేనే, సమాజంనుంచి మనిషియొక్క పరాంగ్ముఖతా క్రమాన్ని అధిగమించవచ్చు; ప్రవృద్ధమాన సంక్షేమం సరసన ఉన్నామనే ఉత్కృష్ట భావాన్ని సంతరించుకోవడం సాధ్యం. అప్పుడు సార్వకాలిక

తాత్విక సమస్యలు భ్రమపూర్వక జీవితానంతర ఆముష్మికంలో కాక ఇక్కడే యీ భూమండలంలోనే మనిషికి యోగ్యమైన స్థాయిలోనే అలాటి సమస్యలు పరిష్కారమవుతాయి. అయితే యివి దానిపాటికదే ప్రయత్నరహితంగా పరిష్కారమైపోవు. మొత్తం సమాజమూ, ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ సర్వతోముఖ శ్రమ చేయడం ద్వారానే సాధ్యావకాశం అన్నది వాస్తవంగా పరివర్తన చెందుతుంది. ప్రజలను ఉత్తేజపరచడానికీ, వారి శక్తి పై వారికి విశ్వాసం కలిగించడానికీ యీ పరివర్తన ఎలా ఆచరణలో రూపు తీసుకుంటుందో కళాత్మకంగా చూపడమే కళల ప్రయోజనం, సాహిత్య ప్రయోజనం. అయితే ఈ విషయంలో ఎదురయ్యే సంఘర్షణలను కానీ వైరుధ్యాలను కానీ సాహిత్యం ఎట్టి పరిస్థితుల్లోనూ సూక్ష్మీకరించరాదు లేదా ఒలిక చేయరాదు.

సోషలిజంకూ, వినిమయ సమాజానికీ మధ్య గల ముఖ్యమైన తేడా యేమిటంటే, సోషలిజం 'రోజువారీ తిండి' సమస్య పరిష్కరిస్తూ పోయేకొద్దీ, ఆ సమాజంలోని సామాజిక సంస్థలన్నీ "ఆత్మికాహారం"పై ఎక్కువ శ్రద్ధ వహిస్తాయి. నూతన పరిస్థితుల్లో మనిషియొక్క ఆత్మిక జీవితాన్ని సంపద్వంతం చేసే విషయంలో సోషలిస్టు సాహిత్యం చేసే సూత్రీకరణల్లో నవ్యత్వం వుంది కాబట్టి, అది సూచించే నిర్ణయాలలో గొప్ప లోతు వుంది కాబట్టి ప్రపంచ సాహితీ క్రమంలో ఈనాడు సోషలిస్టు సాహిత్యం అగ్రరంగంలోకి వస్తున్నది.

డాస్టవ్‌స్కీ అడిగిన ప్రశ్నకు సోషలిజం యిచ్చే సమాధానం స్పష్టమైనది; ఇది ఎంతమాత్రం సూక్ష్మీకరణ రూపంలో లేదు. కాగా "వినిమయ సమాజం" ప్రతిపాదించే సమాధానం మాత్రం పరస్పర విరుద్ధమైందే కాక, ముఖ్యంగా అది చాలా విధాలుగా మానవ వ్యతిరేకమైంది. జీవిత పరమార్థానికి సంబంధించిన మత పర - భావవాద వ్యాఖ్యానాన్ని తిరస్కరించకుండా భక్తులకు భూమిపై కాక స్వర్గంలో బ్రహ్మానందం లభిస్తుందని వాగ్దానం చేస్తుంది. సంప్రదాయ క్రైస్తవ నైతిక సూత్రాలకు ప్రాముఖ్యం యిస్తుంది. అంతేగాక "వినిమయ సమాజం" తల్లక్రిందులైన విలువలను ప్రచారం చేస్తూ ప్రజలను అవినీతిపరులుగా చేస్తుంది. ఈ విలువల్లో కేవలం పాదార్థిక, వినిమయ సుఖాలకు ప్రథమ ప్రాధాన్యం. నిజమైన విముక్తి పంథానుంచి, ఆ సిపర వర్గాల దోపిడీ నుంచి ప్రజల దృష్టిని మళ్ళించడానికి సహాయపడేంతవరకు ఈ విధంగా మతం కానీ, వాణిజ్య తత్వం కానీ మరేదైనా కానీ పెట్టుబడిదారీ విధానానికి సరిగ్గా నప్పుతుంది.

సోషలిస్టు వ్యవస్థకు సంబంధించిన ఆత్మిక, నైతిక విలువల ప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పే క్లిష్టతర కర్తవ్యానికి చెందిన ప్రశ్నలకు సహేతుకమైన మార్క్సిస్టు సమాధానాలు యివ్వడంలో కమ్యూనిస్టులు జాప్యం చేసినట్లయితే సైద్ధాంతికంగా

స్థిరత్వం లేనివారు, కళాకారులతో సహా అప్పుడప్పుడు గతకాలపు ప్రగతి నిరోధక, భావవాద సమాధానాల వైపు మళ్ళుతారు. వారు "ఆధ్యాత్మిక విలువల" కోసం ప్రయత్నిస్తారు. ఆత్మిక విలువల భావనకు చారిత్రక-భౌతికవాద మూలాన్ని కాక భావవాద మూలం అందచేస్తారు; జీవిత విలువలను గ్రహించడంలో విప్లవకర-ప్రజాతంత్ర-మార్క్సిస్టు పద్ధతుల ప్రాముఖ్యతను తక్కువ అంచనా వేస్తారు.

కాలంచెల్లిన తల్లకిందుల విలువలను సమర్థించేవారు ఎల్లప్పుడూ వుండనే వుంటారు వీటిలో ముఖ్యమైంది "ప్రజాబాహుళ్య సంస్కృతి" సోషలిజం సాధించిన విజయాలను, రెండవ ప్రపంచ యుద్ధంలో 40 ఏళ్ళ క్రితం ఫాసిస్టు శక్తులను పరాజయంపాలు చేయడానికి సోషలిజం ప్రదర్శించిన మహత్తర శక్తిని చూచి పాత సమాజాన్ని పాలించేవారు గజగజలాడిపోయారు. ఈ భయం మూలంగా ఆ పాలకవర్గాలు తమ శ్రామిక జనాలకు అంతకు మునుపటికంటె ఎక్కువ పాదారిక సమృద్ధతలో ఎక్కువ వాటా యిచ్చారు. ఏమైనా పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో ఈనాటికీ కోట్లాదిమంది శ్రమజీవులను దోపిడీ చేయడం కొనసాగుతూనే వున్నది. అయితే పెట్టుబడిదార్లు అలా కార్మికులకు ఎక్కువ వాటా ఇవ్వడంతో పాటు జనాలకు వినిమయ సహజాతాలను, ప్రాథమిక స్థాయి ఆవేశాలను ఎక్కిస్తారు. ఉదాహరణకు లాభదాహం, హింసాకాండ, సెక్స్, బూతు సాహిత్యం, ఇంకా యిలాటి అధమస్థాయి అభిరుచులు వగైరా జనాల నరాల్లోకి ఎక్కిస్తారు. పెట్టుబడిదారీ విధానం ఇలాటి "ప్రజాబాహుళ్య సంస్కృతి"ని పోషించడం ద్వారా 18వ శతాబ్దిలోనూ, 19వ శతాబ్దిలోనూ అనగా చరిత్ర ఉషోదయ వేళల్లో అది ప్రతిపాదించిన విలువలను తానే హరిస్తున్నది. ఆనాడు పెట్టుబడిదారీ విధానం ముందుకు తెచ్చిన విలువలు మనిషి పట్ల గౌరవం, జ్ఞానదాహం, వర్గ హక్కుల తిరస్కృతి, పరాన్నభుక్కు తత్వాన్ని నిరాకరించడం వగైరా. "ప్రజాబాహుళ్య సంస్కృతి" పెత్తనం చేసే దోపిడీ సమాజంలో యీ విలువలకు ప్రాముఖ్యం యిచ్చే వాస్తవిక రచయితలు బహిష్కృతులుగా మిగిలిపోతారు.

రక్తనాళాల వ్యవస్థతో సారూప్యం వున్న ప్రపంచంలో మనం నివసిస్తున్న విషయం మనం మరువరాదు. బూర్జువా ప్రజా బాహుళ్య ప్రచార సాధనాలు నూతన సమాజంలో కూడా "ప్రజా బాహుళ్య సంస్కృతి" బీజాలను నాటడానికి ప్రయత్నిస్తున్నాయి. గతకాలపు అవశేషాలు, అపరిష్కృత సమస్యలు బాగా మెత్తబరచిన భూమిలో తరుచుగా ఈ బీజాలు పడుతున్నాయి. అందువల్ల అందులో కొన్ని పెరిగి కలుపుమొక్కల్లా పెరుగుతున్నాయి; అనగా సైద్ధాంతిక, సాంస్కృతిక కలుపుమొక్కల్లా పెరుగుతున్నాయి. సోషలిజం, మానవత్వం, మహోత్కృష్టమైన జీవితార్థం లాటి మహత్తర ఆదర్శాలను ఎత్తిపట్టుకుని, సత్యనిరతితో కూడిన,

స్పష్టమైన, ప్రగాఢమైన రచనలతో పోరాడి ఆ కలుపుమొక్కలను ఏరిపారేయాలి, ఇలాటి మహత్తర ఆదర్శాలన్నీ మానవుని మానవునిగా తీర్చిదిద్దుతాయి.

స్పష్టమైన, ఉన్నతమైన ఆత్మిక మార్గదర్శక సూత్రాలుగల కళాకారులు అలాటి రచనలను సృష్టించగలరని మేము విశ్వసిస్తున్నాం. మీరు గొప్ప సంస్కార వంతులు, ఉన్నత విద్యావంతులు. సీరియస్ రచయిత, రచన లేవైనా జయప్రదం కావాలంటే అధ్యయనం లేకుండా, ఆలోచించకుండా, కృషి చేయకుండా ఒక్కరోజు కూడా అతడు గడపకూడదు అన్నది కీలకమైన షరతు నిజమైన రచయిత అన్నవాడు మార్క్సిస్టు-లెనినిస్టు దృక్కోణం నుంచి చరిత్రను, వర్తమాన కాలాన్ని ప్రగాఢంగా అవగాహన చేసుకోగలగాలి. సాహిత్యంలో అతని నిబద్ధ వైఖరిగా దీనిని మనం పరిగణించాలి. తన ప్రజలకు, దేశానికి నిబద్ధతగల రచయిత విశ్వాసా లన్నవి రష్యన్ రచయితయొక్క సోవియట్ రచయితయొక్క సాంప్రదాయాలు. అహంకారం, క్షమాపణ ధోరణిగల కళా సౌందర్యవాదం మాకు వ్యతిరేకమైనవి. మా సమాజంలోని ప్రతి కళాకారుడికీ అన్ని సందర్భాల్లోనూ రాజకీయాలతోనూ, ప్రభుత్వ వ్యవహారాలతోనూ సంబంధం వుంటుంది. ఇందుకు నన్ను శుద్ధ కళా సౌందర్యవాదులు. ఇంకొంచెం ఖచ్చితంగా చెప్పే సాహితీ రంగంలోని కుసంస్కారులు అభిశంసించవచ్చు; కానీ రాజకీయాలు లేకుండా గొప్ప సాహిత్యం వుండజాలదని నేను స్పష్టంగా చెప్తాను.

రచయిత ఆలోచనా క్రమంలో రాజకీయాలు చోటుచేసుకోవాలన్న ఆవశ్యకతని మరీ సూక్ష్మీకరణరూపంలో అర్థం చేసుకోరాదు. రచయితలుగనక సాహితీ ప్రత్యేక లక్షణాలనూ, కళాభిజ్ఞతనూ, విస్మరించినట్లయితే అలాటి రచయితల రచనలు అల్పమైనవిగా, అవాస్తవికమైనవిగా, ప్రగాఢత్వం లేనివిగా వుంటాయి. కర్తవ్య ప్రాముఖ్యాన్నీ, ఇతివృత్త తీవ్రతను ఉన్నతస్థాయి కళా సౌందర్యంతోనూ, కళాత్మక నూతన పద్ధతులతోనూ, ఆకర్షణతోనూ సమ్మేళనం చేయడం అంత తేలికైన విషయమేమీ కాదు. ఈ సమస్యను అధిగమించడానికి అనుభవం ముఖ్యంగా వీరోచిత యుద్ధకాలంనాటి అనుభవం మా రచయితలకు తోడ్పడుతుంది. ఆ సంవత్సరాలలో సోవియట్ సాహిత్యం, కళలు ప్రజలను ఉత్తేజపరచాయి; దేశభక్తి శిఖరాలు అందుకునేలా వారిని అవి ఉత్తేజపరచాయి; సోషలిజంలో దేశభక్తి, అంతర్జాతీయత విడదీయరానివిగా వుంటాయి. తమ సోషలిస్టు మాతృభూమిని కాపాడుకోడానికి ప్రజలు తమ ప్రాణాలతో సహా సర్వస్వం సమర్పించేలా అవి ప్రేరణ సృష్టించాయి. మా దృష్టిలో తన కర్తవ్యాన్ని అవగాహన చేసుకోవాలన్నా, యీ స్ఫూర్తితో ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించాలన్నా రచయితకు రాజకీయ నిబద్ధతా వుండాలి; నిజమైన అర్థంలో కళాత్మకతగల రచయితగా వుండాలి.

చెర్నిషెవ్‌స్కీ అన్న మాటలు యీనాటికీ సత్యమైనవిగా పరిగణింప బడుతున్నాయి. ఆయన ఇలా అన్నాడు: "మానవ కార్యకలాపాలకు సంబంధించిన అన్ని రంగాల్లోనూ, సామాజిక అవసరాలతో సజీవ సంబంధంగల లక్ష్యాలే ఘన మైన అభివృద్ధి సాధిస్తాయి; జీవితంలో వేళ్లు పాదుకొనని లక్ష్యాలు దుర్బలమైనవిగా, కళా విహీనమైనవిగా మిగిలిపోతాయి; అవి చారిత్రక ప్రాముఖ్యాన్ని సాధించలేక పోవటమేకాక, అవి సంకుచితమైనవి కాబట్టి సమాజంపై ప్రభావాన్ని ప్రసరింప జాలవు". [1]

సోవియట్ సమాజంయొక్క మౌలికమైన చారిత్రక ఆవశ్యకతయు శాంతి, శ్రమ; దాని లక్ష్యం ప్రవృద్ధ సోషలిజంను సర్వతోముఖంగా పరిపుష్టం చేయడం. ఈ ఉత్కృష్ట లక్ష్యాలకోసం కృషిచేయడం ద్వారానూ, మహోన్నత మానవతా సంప్రదాయాలను విస్తరించడం ద్వారానూ తన సర్వంకష ప్రతిభావ్యుత్పన్నతలను వెల్లడించడానికీ, వాటిని తన కళల్లోకి అనువదించడానికీ ప్రతి కళాకారునికీ అవ కాశం వుంది.

★★

1. నికొలయ్ చెర్నిషెవ్‌స్కీ – మునుపు ప్రస్తావించిన గ్రంథమే సంపుటి-3, పుట 299

# నూతన విద్యా విధానం ?

— ప్రతుల్ లహిరి

భారత ప్రభుత్వ నూతన నాయకులు నూతన విద్యా విధానం అవసరమన్న ఆకాంక్షను ప్రకటించారు. 1968 లో ఆమోదించిన విద్యా విధానానికి ప్రత్యామ్నాయంగా ప్రవేశపెట్టడానికి యిది వుద్దేశించబడింది. సుదీర్ఘంగా తర్జన భర్జనలు జరిపిన తర్వాత, వివిధ వుద్యమాల ఫలితంగా 1968 లో విద్యా విధానం రూపొందించబడింది. ఇందుకోసం మూడు విద్యా కమిషన్లు వేశారు. యూనివర్శిటీ విద్యపై ఒకటి (డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ నాయకత్వాన), సెకండరీ విద్యపై మరొకటి (డాక్టర్ ఎస్. ముదలియార్ నాయకత్వాన), సంపూర్ణ విద్యపై ఇంకొకటి (డాక్టర్ డి. ఎస్. కొఠారి నాయకత్వాన)— వేశారు. పార్లమెంటేరియన్ల కమిటీని ఏర్పాటు చేయడంలో భారత పార్లమెంటు కూడా చొరవ తీసుకుంది. వివిధ టీచర్ల, విద్యార్థి సంఘాలు వుద్యమాలను ప్రారంభించాయి. ఈ అన్ని కార్యకలాపాల పరాకాష్టగానే 1968 లో విద్యా విధానం రూపొందింది.

నూతన విద్యా విధానాన్ని రూపొందించి ప్రచురించేవరకు దానిగురించి నూతన ప్రభుత్వ నాయకులు పదే పదే చెబుతున్న మాటల వెనుక ప్రేరణ ఏముందో నిజానికి అర్థం చేసుకొనడం చాలా కష్టం. ఇప్పటికే అనేక ప్రకటనలు చేశారు. ప్రణాళికా సంఘం, యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్, జాతీయ విద్యా, పరిశోధనా, శిక్షణా మండలి, జాతీయ విద్యా ప్రణాళికా, పరిపాలనా సంస్థ, భారత యూనివర్శిటీల సంఘం వగైరాలతో సహా వివిధ సంస్థలు అనేక కార్యకలాపాలు కూడా నిర్వహించాయి.

1985 జనవరి 5 వ తేదీన జాతి నుద్దేశించి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రసంగిస్తూ, "నూతన విద్యా విధానం రూపొందించాలని" తాను ఆదేశించినట్లు ప్రకటించారు". విద్య జాతీయ ఐక్యతా భావాన్ని పనికి సంబంధించి నైతిక సూత్రాన్ని పెంపొందించాలని" ఆయన చెప్పారు. మన మహత్తర స్వాతంత్ర్యోద్యమం

గురించి, జాతీయ సమగ్రతలో దీని ప్రాధాన్యత గురించి ప్రతి విద్యార్థికి తెలియ చేయాలి. మన పాఠశాలలు, కాలేజీలు ప్రాచీన వారసత్వం సంస్కృతి గురించి యువతరానికి తెలియచెప్పాలి. పాఠ్యాంశాలు, పాఠ్య పుస్తకాలలో మన భిన్న సంస్కృతికి సంబంధించి ప్రాంతీయ, మత తత్వ భాష్యాలకు తావులేకుండా అరికట్టాలి.

"మన విద్యావ్యవస్థలో పెద్ద ఎత్తున నూతన కమ్యూనికేషన్ సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకొనడానికి కార్యక్రమాలను మనం రూపొందించు తున్నాం. ప్రభుత్వంలోని వుద్యోగాలనుండి డిగ్రీలను విడదీసే విషయాన్ని తీవ్రంగా పరిశీలిస్తున్నాం. వున్నతవిద్య అందరికీ సులభంగా అందుబాటులో వుండే విధంగా ఒక ఓపెన్ యూనివర్శిటీని ప్రారంభించడానికి చర్యలు తీసుకుంటున్నాం. కేంద్ర పాఠశాలలసంస్థ విస్తరించబడుతుంది. ఈ పాఠశాలలు మన దేశంలోని ప్రతి జిల్లాలో ఉత్తమ కేంద్రాలుగా పనిచేస్తాయి.

ఆయన యింకా యిలా అన్నారు: "సమాజంలోని ఉత్పత్తి శక్తులతో విద్యకు సజీవ సంబంధముంది. మనం దీనిని పరిశ్రమలు, వ్యవసాయం, కమ్యూనికేషన్లు, మన దేశంలోని యితర వుత్పత్తి రంగాలతో సంఘటిత పరచాలి."

జవహర్‌లాల్‌నెహ్రూ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ పి. ఎన్. శ్రీవాత్సవ నాయకత్వాన ముగ్గురు సభ్యులు గల గ్రూపును ప్రధాని ఏర్పాటు చేశారు. ఈ గ్రూపులోని సభ్యులలో జాతీయ విద్యా పరిశోధన, శిక్షణా మండలి డైరెక్టర్ డాక్టర్ పి. ఎల్. మల్హోత్ర, జాతీయ విద్యా ప్రణాళిక, పరిపాలనాసంస్థ మాజీ డైరెక్టర్ ప్రొఫెసర్ మూనిస్ రజా (ప్రస్తుతం ఢిల్లీ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్)లు వున్నారు. ఈ గ్రూపు విద్యా పథకాలు, విధానాలపై ప్రధానికి సలహా యిస్తుంది. విద్యలో తీసుకురావాల్సిన సంస్కరణలను సూచిస్తుంది. ప్రాధాన్యతలను రూపొందిస్తుంది.

మామూలుగా జరుగుతున్నట్లుగానే విద్యామంత్రిత్వశాఖ తన ఆధ్వర్యంలో విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఆనంద్ స్వరూప్ కన్వీనర్‌గా విద్యా ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటుచేసింది. ఈ సంఘంలోని యితర సభ్యులలో జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ పి. ఎన్. శ్రీవాత్సవ, యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ (యు.జి.సి.) వైస్ ఛైర్మన్ డాక్టర్ రయిస్ అహ్మద్, ఎన్.సి.ఇ.ఆర్.టి. డైరెక్టర్, ప్రస్తుత ఎన్.ఐ.ఇ.పి.ఎ. డైరెక్టర్ డాక్టర్ పి. ఎల్. మల్హోత్ర, ప్రణాళికా సంఘానికి చెందిన శ్రీ వీరరాఘవన్, యు.జి.సి. కార్యదర్శి, విద్యామంత్రిత్వశాఖకు చెందిన జాయింట్ కార్యదర్శులు అందరూ వున్నారు.

ఆధునిక విద్యకు సంబంధించిన చరిత్రనుండి కొన్ని ఘటనలను గుర్తుచేసు కొనడం అసందర్భం కాబోదు. బ్రిటిష్ కాలంలో భారత్‌లో ఆధునిక పాఠశాల, యూనివర్శిటీ వ్యవస్థ తలెత్తింది. రెండు ప్రయోజనాలకోసం ఈ విద్యా వ్యవస్థను ఏర్పాటుచేయాలని విదేశీ పాలకులు భావించారు. — (1) పరిపాలనను నిర్వహించే కేడర్లను తయారుచేసుకొనడానికి (2) స్వరూపంలో భారతీయులే అయినా స్వభావంలో బ్రిటిష్‌వారికి అనుకూలంగావుండే ప్రజలను సృష్టించుకొన డానికి — ఈ ప్రయోజనాలకోసమే విద్యావ్యవస్థను ఏర్పాటుచేయదలచారు. రాజా రామ్‌మోహన్‌రాయ్ దూరదృష్టిగల యితర భారతీయ నాయకులు నవ భారత నిర్మాణానికి, సాంస్కృతిక పునరుజ్జీవనానికి దీనిని ఒక సాధనంగా చేసుకోవాలని భావించారు. ఆధునిక విద్యావ్యవస్థను ప్రవేశపెట్టిన నాటినుండి, విద్యారంగంలో భారత ప్రజల ఆకాంక్షలకు, విదేశీ పాలకుల లక్ష్యాలకు మధ్య నిరంతర పోరాటం జరిగింది.

బ్రిటిష్ ప్రయోజనాలకోసం గట్టిగా ప్రాకులాడిన మెకాలే తన ప్రసిద్ధ పుస్తకంలో యిలా పేర్కొన్నారు : "యావన్మందికీ విద్య గరపడం అసాధ్యం. అయితే స్వరూపంలో భారతీయులుగాను, అభిరుచి అభిప్రాయాలు, నైతికసూత్రాలు, మేధస్సు విషయంలో ఆంగ్లేయులుగావుండే ఒక కొత్తరకం వర్గాన్ని ఆంగ్లవిద్య ద్వారా రూపొందించడం సాధ్యమే. ఇట్టివారిద్వారా విద్యను క్రిందిస్థాయి ప్రజలకు వ్యాప్తిచేయాలి." (ఉటంకింపు చేర్చబడింది). 1844 లో, ఆంగ్లంలో విద్యావంతులైన వారికి ఆఫీసులలో అన్ని నియామకాలలో ప్రాధాన్యత యివ్వబడుతుందని లార్డ్ హార్డింజ్ ప్రభుత్వం ప్రకటించింది. ఈస్టుఇండియా కంపెనీకి విశ్వసనీయమైన, సమర్థులైన ఉద్యోగులను సమకూర్చడానికి కలకత్తా, బొంబాయి, మద్రాసులలో మూడు యూనివర్శిటీలను నెలకొల్పాలని మరో ఆంగ్లేయుడు బ్రిటిష్ ఈస్టు ఇండియా కంపెనీ డైరెక్టర్లబోర్డు ఛైర్మన్ వుడ్ సిఫార్సు చేశారు. అందువల్ల వారు సంకుచితత్వంతో కూడిన ఒక విద్యావ్యవస్థను నిర్మించారు.

వారు మూడు యూనివర్శిటీలను, కొన్ని డిగ్రీ కాలేజీలను ఏర్పాటుచేశారు. ప్రతి జిల్లాలో నమూనా పాఠశాలలను (జిల్లా పాఠశాలలు) ఏర్పాటుచేయ తల పెట్టాము. ప్రాథమిక విద్యకు సంబంధించిన బాధ్యతను వదలివేశారు. విద్యా వ్యయాన్ని భరించడం ప్రభుత్వానికి సాధ్యంకాదని చెప్పి పాఠశాలలు, కాలేజీలను ఏర్పాటుచేసే కర్తవ్యాన్ని సమాజ చొరవకు (ఆ కాలంలో భూస్వాముల దయా దాక్షిణ్యాలకు) వదలివేశారు.

1880 లో విద్యకు పెట్టుబడులు సమకూర్చడానికి ప్రభుత్వం మరోసారి నిస్సహాయతను వెలిబుచ్చింది. అందువల్ల పాఠశాలలను ప్రారంభించి వాటని

నిర్వహించే బాధ్యతను చేపట్టడానికి సమాజాన్ని ప్రోత్సహించే నిమిత్తం వారు హంటర్ కమిషన్‌ను నియమించారు. వారికి అనుగుణంగా అది సిఫార్సులు చేసింది. ఆ సిఫార్సులను ప్రభుత్వం వెంటనే ఆమోదించింది. అందువల్ల, కొన్ని పాఠశాలలను మాత్రమే నిర్వహిస్తామని, మిగిలిన వాటిని స్వదేశీ కార్యకలాపాలకు వదలివేస్తామని వారు పేర్కొన్నారు.

భారత్ విదేశీ పాలకులక్రింద వుంది. అందువల్ల సమాజం సరియైన దిశలో కదిలింది. ప్రప్రథమంగా ప్రభుత్వ విధానాన్ని నిరసించడం. రెండవది ఆధునిక విద్య ఫలితాలపై పట్టు సంపాదించడానికి విద్యాసంస్థలను ఏర్పాటుచేసి నిర్వహించడం. శతాబ్దం మలుపుతిరగగానే ఈ పోరాటం మరింత తీవ్రమయింది. లార్డ్ కర్జన్ గవర్నర్ జనరల్‌గా భారత్ వచ్చినపుడు ఆయన పైస్థాయిలో ప్రాముఖ్యత యివ్వబడిన, సమన్వయంలేని విద్యావ్యవస్థను కనుగొన్నారు. ఆయన అలాగే, యూనివర్శిటీ స్వయం ప్రతిపత్తిపైన, విద్యకు సంబంధించిన యితర అంశాలపైన దాడి ప్రారంభించాడు. ఆయన ఒక కమిషన్‌ను (రాలీ కమిషన్) నియమించాడు. 1904 లో ప్రప్రథమంగా భారత్‌లో విద్యావిధానం తీర్మానాన్ని రూపొందించాడు. అయితే, ఆయన చేసిన యత్నాలను భారత ప్రజలు ప్రాంతీయ పత్రికలద్వారా. తీర్మానాలలో తీవ్రంగా ఖండించారు. అంతేగాదు, కాంగ్రెస్ సమావేశాలలో అధ్యక్షోపన్యాసాలలోను, భారత గవర్నర్ జనరల్ మండలిలోని భారతీయ సభ్యులు చేసిన ప్రసంగాలలోను కూడా ఖండించారు. 1913 లో మరో విద్యావిధానం తీర్మానాన్ని చేశారు. "ఈ నూతన విద్యావిధానం లక్ష్యం నిరాటంకంగా వున్నత విద్య అభివృద్ధి చెందకుండా నిరోధించడం, తద్వారా ప్రమాణాలను పెంపొందించి బోధనా తీరును మెరుగుపరచడం, అలాగే, అసంతృప్తిగల అవిధేయులైన యువకులను తయారుచేయకుండా పాఠశాలలను, కాలేజీలను నిరోధించడం" (అపర్ణబాసు : "విద్య, రాజకీయ అభివృద్ధి" ఒ. యు. పి. పేజి 58).

1947 వరకు మొత్తం కాలమంతా రెండు విద్యా విధానాల మధ్య సంఘర్షణలతో నిండుకుంది. ఒక విధానాన్ని విదేశీ పాలకులు అనుసరించారు. మరొక విధానాన్ని భారత ప్రజల నాయకులు రూపొందించారు

విద్యా వ్యవస్థను నిరంకుశాధికారులతో నింపడానికి వ్యతిరేకంగాను, ప్రాథమిక విద్యను ఉచితంగా, నిర్బంధం చేయడానికిగాను మన జాతీయోద్యమం పోరాడింది. రాలీ కమిషన్, సడ్లెర్ కమిషన్, 1904, 1913 సంవత్సరాలలో చేసిన విద్యా విధానం తీర్మానాల పట్ల భారతదేశం ప్రతిస్పందించిన తీరులో యిది వ్యక్తమైంది. భారత జాతీయ కాంగ్రెస్‌లో అధ్యక్షోపన్యాసాలలోను, అన్ని

కాంగ్రెస్ సమావేశాలలో విద్యపై ఆమోదించిన తీర్మానాలలోను, గవర్నర్ జనరల్ మండలిలో గోఖలే, సర్ శంకరన్‌నాయర్, తదితరులు తీసుకున్న చొరవలతోను, చేసిన ప్రసంగాలు, ప్రతిపాదించిన తీర్మానాలలోను యిది వ్యక్తమయింది. వార్ధా, శాంతి నికేతన్‌లలో గాంధీ, టాగూర్‌లు విద్యకు సంబంధించిన తమ భావాలను ఆచరణలో పెట్టారు. శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానంపై ఒక పరిశోధనా సంస్థను ఏర్పాటుచేయడానికి జెమ్‌షెడ్‌జీ తాతా ముందుకు వచ్చాడు. బెంగాల్‌లోని స్వదేశీ వుద్యమ నాయకులు జాదవ్‌పూర్‌లో ఇంజనీరింగ్, టెక్నాలజీ కాలేజీని ప్రారంభించారు. (ఇప్పుడది యూనివర్శిటీ). అందువల్ల మనం స్వాతంత్ర్యంపొంది, అనుసరించాల్సిన పంథాను రూపొందించుకోవడం ప్రారంభించినపుడు, మెకాకే, వుడ్‌హంటర్, కర్జన్, రాలీ, సడ్లర్, సర్జంట్ - తదితరులు మనముందుంచిన పంథాను తిరస్కరించడానికి మనదేశం వెనుకాడలేదు. విద్యా, సాంస్కృతిక రంగంలో రామ్‌మోహన్, టాగూర్, గోఖలే, గాంధీలు చొరవ తీసుకుని ప్రారంభించిన పోరాటాన్ని ముందుకు తీసుకువెళ్ళాలని కూడా నిర్ణయించింది.

విద్యా విధానాన్ని రూపొందించడంలో సోవియట్ యూనియన్ అనుభవం కూడా మనకు తెలుసు. టాగూర్ తన "లెటర్స్‌ఫ్రమ్ రష్యా" పుస్తకంలో సోవియట్ అనుభవాన్ని ఎంతో అందంగా చిత్రించారు.

విద్యా, సాంస్కృతిక రంగంలో నయావలస వాదులు తీవ్రమైన దాడి చేస్తున్న పూర్వరంగంలో నూతన విద్యా విధానాన్ని ప్రకటించుకునే ప్రాంగణంలో మనమున్నట్లు యివన్నీ చెబుతున్నాయి. భారత్ లాంటి దేశానికి ఎలాంటి ఆదర్శప్రాయమైన విద్యావ్యవస్థ వుండాలన్నది నేటి వలసవాదానికి చెందిన ప్రపంచ బ్యాంకు, వివిధ యితర వేదికలలో తరచూ చర్చనీయాంశమైంది అనేక దేశాలలో విద్యావసతులకు తగినంతగా పాఠశాల భవనాలు కట్టలేకపోతున్నారు. ఉపాధ్యాయులను చేర్చుకుని వేతనాలు చెల్లించలేకపోతున్నారని ప్రపంచ బ్యాంకు తెలుసుకుంది. ఈ అవసరాలను తీర్చడానికి అవికొన్ని పద్ధతులను సూచించాయి. (ఆల్టర్‌నేటివ్ రూట్స్‌లో ఫార్మల్ ఎడ్యుకేషన్: డిస్టాన్స్ టీడింగ్ ఫర్ స్కూల్ ఈక్విటవలెన్సీ - రచన హిలరీపెర్రటన్, ప్రపంచ బ్యాంకు ప్రచురణ) అలాగే అభివృద్ధిచెందుతున్న దేశాలలో సెకండరీ విద్యలో వృత్తిపరమైన కోర్సులు ప్రవేశపెట్టడం ద్వారా ప్రత్యామ్నాయ పారిశ్రామిక శిక్షణా పద్ధతులను కూడా అవి సూచించాయి. (ది ఎకనామిక్ ఎవాల్యుయేషన్ ఆఫ్ ఒకేషనల్ ట్రైనింగ్ ప్రోగ్రామ్ - రచన మాన్యువల్ జిమెల్‌మన్, ప్రపంచ బ్యాంకు ప్రచురణ).

బ్రిటిష్ వారు అనుసరించిన విద్యా విధానానికి గండికొట్టాలని స్వతంత్ర భారత్ భావించింది. ప్రజలందరికీ విద్యా సౌకర్యం కల్పించడానికే బ్రిటిష్ విధానం తిరస్కరించింది. నిరంకుశాధికారుల, అజమాయిషీని రుద్దడానికి అది పూనుకుంది. పిల్లలందరికి 14 సంవత్సరాలు నిండేవరకు వారికి నిర్బంధ, వుచిత విద్యా సౌకర్యం కల్పించడానికి ప్రభుత్వం కృషిచేయాలన్న విషయాన్ని స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగం ఆదేశిక సూత్రాలలో పొందుపరిచారు. విద్యాధికవర్గ వ్యవస్థ (కొంతమందికి మాత్రమే వున్నత విద్య కల్పించే పద్ధతి)ను రాజ్యాంగంలో నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. విద్యావకాశాలను వినియోగించుకోవ డానికి సంబంధించి సమాజంలోని వివిధ వర్గాలమధ్య వ్యత్యాసాలను తుడి పెట్టాలన్న ఆకాంక్షను ప్రకటించారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఖేర్ కమిటీ విద్యకు పెట్టుబడులు సమకూర్చే సమస్యను పరిశీలించింది. విద్యపై రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం, కేంద్ర బడ్జెట్‌లో 10 శ తం, మొత్తం జాతీయ ఉత్పత్తిలో (జి. ఎన్. పి) 6 శాతం ఖర్చుచేయాలని అది సిఫార్సుచేసింది. అనేక రాష్ట్రాలు తమ బడ్జెట్ కేటాయింపులలో ఆ సిఫార్సును అమలుపరిచాయి. అయితే కేంద్రం విఫలమయింది. విద్యా మంత్రిత్వశాఖ ఈ సంవత్సరం పార్లమెంటుకు వార్షిక నివే దిక సమర్పిస్తూ, ప్రతిపాదించిన విద్యా విధానానికి అవసరమైన వనరులు "ప్రభుత్వ స్తోమతకు మించి వుంటాయని" పేర్కొంది. భారత రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ నాగ పూర్ యూనివర్శిటీ ప్రత్యేక స్నాతకోత్సవంలో మాట్లాడుతూ, విద్యా వ్యయాన్ని ప్రభుత్వం భరించలేని స్థితిలో వుందని మరింత నిక్కచ్చిగా చెప్పారు. అందువల్ల, సమాజమే ముందుకురావాలి. ప్రభుత్వం ఆ బాధ్యతనుండి తప్పించుకోవాలన్న ఆకాంక్షలు వ్యక్తంచేస్తున్నది. ప్రతి జిల్లా కేంద్రంలో కేంద్రీయ విద్యాలయాన్ని ఏర్పాటుచేసి జిల్లా పాఠశాలలను పటిష్టవంతం చేయాలన్న ఉద్దేశాన్ని మాత్రమే అది ప్రకటిస్తున్నది. (మెకాలె, హంటర్ బాణీ.)

శ్రీ రాజీవ్‌గాంధీ 1985 జనవరి 5న జాతి నుద్దేశించి ప్రసంగిస్తూ యిలా అన్నారు: (1) ప్రభుత్వ ఉద్యోగాలకు సంబంధించి డిగ్రీలను విడదీయాలని, (2) ఒక జాతీయ ఓపెన్ యూనివర్శిటీని నెలకొల్పాలని, (3) కేంద్రీయ విద్యా లయ వ్యవస్థను ఉత్తమ కేంద్రంగా విస్తరించాలని, (4) కమ్యూనికేషన్ సాంకేతిక పరిజ్ఞానానికి ప్రాధాన్యత యివ్వాలని, (5) విద్యకు వుత్పత్తితో సజీవ సంబంధం వుండాలని (వృత్తిపరమైన విద్య.) స్వాతంత్ర్య పోరాట చరిత్ర, జాతీయ సమ గ్రతల గురించి బోధించాల్సిన ఆవశ్యకత వుందని పేర్కొన్నారు.

1990 నాటికి ప్రాథమిక విద్యను సార్వత్రీకరించాలన్న లక్ష్యాన్ని నూతన 20 అంశాల కార్యక్రమం పేర్కొన్నప్పటికీ ప్రస్తుతం యిచ్చిన ప్రాధాన్యతలలో ఆ అంశాన్ని ముట్టకుండానే వదలివేశారు. గాంధీ మనకు నయీతాలిమ్ (వార్ధా),

ప్రసాదించగా టాగూర్ శాంతినికేతన్‌ను యిచ్చారు. శ్రీ రాజీవ్‌గాంధీ జాతీయ సమగ్రతకోసం ఉలాన్ (లేదా షెర్‌పూర్) పాఠశాల వ్యవస్థను అందుబాటులో వుంచుతానని మనకు వాగ్దానం చేశారు.

విద్యా వ్యవస్థకు సంబంధించిన ఈ మొత్తం వ్యవహారం నిజంగా తీవ్ర ఆందోళన కలిగిస్తుంది. భారత్‌లో 32 కోట్లమంది నిరక్షరాస్యులు వున్నారు. విద్యావంతులైన నిరుద్యోగులు 1 కోటి 23 లక్షలమంది వున్నారు. ఈ రెండు సమస్యలకు ప్రాధాన్యతయిచ్చి పరిష్కరించాల్సిన అవసర మెంతైనావుంది. నిరక్షరాస్యతకు సంబంధించి ప్రభుత్వం నిర్లక్ష్య వైఖరి అనుసరిస్తున్నది. ఉన్నత విద్యపై ఆంక్షలు పెట్టి విద్యావంతులైన నిరుద్యోగుల సమస్యను తొలగించుకోవాలని భావిస్తున్నారు. ఈ మొత్తం సమస్య మానవశక్తి పథకంతోను, తగినన్ని ఉపాధి అవకాశాల కల్పనతోను ముడిపడి వుంది. ఉపాధి మార్కెట్‌ను విస్తరించడం ద్వారా మాత్రమే ఉన్నత విద్యలో ప్రవేశాన్ని క్రమబద్ధం చేయగలం. గుర్రం ముందు బండిపెట్టడం వృథా ప్రయత్నం తప్ప మరేమీ కాదు.

ప్రాథమిక విద్యా రంగంలో నిర్వహణ ఘోరంగా విఫలమైంది. అధికార ప్రకటన ప్రకారం, 6 వ ప్రణాళికాంతానికి ప్రాథమిక తరగతులలో చేరినవారు మొత్తం (6-14 వయస్సుగల పిల్లలు- నియత (ఫార్మల్), అనియత (నాన్-ఫార్మల్) పద్ధతి క్రింద) 11 కోట్ల మేరకు వున్నట్లు అంచనా వేశారు. ప్రాథమిక విద్యకు కూడా నోచుకోని పిల్లలు దాదాపు 3 కోట్లమంది వున్నారు. (1981 జనాభా లెక్కల ప్రాతిపదికగా). ప్రాథమిక దశలో 63 శాతంమంది, మాధ్యమిక పాఠశాలల్లో 77శాతం మంది వున్నారు. విద్యకు సంబంధించి ఇటీవల జరిపిన సర్వే ప్రకారం, 40 శాతం ప్రాథమిక పాఠశాలలు ఏకోపాధ్యాయ పాఠశాలలు. 70 శాతం పాఠశాలల్లో లైబ్రరీ అంటూ లేదు. 50 శాతం పాఠశాలల్లో సరైన వసతి సౌకర్యాలు లేవు. 50 శాతం ప్రాథమిక పాఠశాలల్లో ఎటువంటి ఫర్నిచర్ లేదు. అర్థవంతమైన విద్యా వ్యవస్థను నిర్మించాలంటే సంపూర్ణంగా నిరక్షరాస్యతను నిర్మూలించాలన్నది ప్రాతిపదికగా వుండాలి.

కేంద్రీయ విద్యాలయ వ్యవస్థను విస్తరించాలన్న విషయంపై ఎంతో ఆర్భాటం చేస్తున్నారు. ఈ పథకం అసంగతమైంది. ఇంతకుముందు చెప్పినట్లుగా, ఈ పథకం విదేశీ పాలకుల వడియగట్టే సిద్ధాంతాన్ని, జిల్లా పాఠశాల వ్యవస్థను గుర్తుకు తెస్తుంది. ఎన్. సి. ఇ. ఆర్. టి. డైరెక్టర్ శ్రీ పి. ఎల్. మల్హోత్రా మార్చి 8 న పత్రికా సమావేశంలో పేర్కొన్న పథకం, విద్యామంత్రి శ్రీ కె. సి. పంత్ మార్చి 24 న ఢిల్లీ యూనివర్శిటీ స్నాతకోత్సవంలో చేసిన ప్రసంగాల ప్రకారం, గ్రామీణ ప్రాంతాలకు చెందిన 3 వ వంతు విద్యార్థులతో జిల్లా ప్రధాన కేంద్రాలలో రెసిడెన్షి

యల్, కేంద్ర పాఠశాలల వ్యవస్థను నెలకొల్పుతారు. 1986 చివరి నాటికి అలాంటి 100 పాఠశాలలను ఏర్పాటు చేస్తారు. 7వ ప్రణాళికాంతానికి మరో 500 పాఠశాలలు నెలకొల్పుతారు.

ఈ దేశంలో అన్ని సెకండరీ పాఠశాలలకు వర్తించే మౌలిక పాఠ్యాంశాలను ప్రవేశపెట్టడానికి ఎవరూ అభ్యంతరం చెప్పరు. అయితే సెకండరీ విద్యా రంగంలో విద్యాధిక వర్గ వ్యవస్థను విస్తరించి, సంఘటితపరిస్తే ఖచ్చితంగా అభ్యంతరం చెబుతారు. నమూనా పాఠశాల (కె. వి) వ్యవస్థలో విద్యాబోధన ఇంగ్లీషులో వుంటుంది. విద్యావకాశాలలో వ్యత్యాసాలను తుడిచి పెట్టాలన్న రాజ్యాంగ నిబంధనకు యిది విరుద్ధం.

మరో అంశం గురించి చెప్పాలి. సెకండరీ విద్య రాష్ట్ర అంశం, కేంద్ర సెకండరీ విద్యాబోర్డు, కేంద్ర పాఠశాల లేదా సైనిక పాఠశాల వ్యవస్థలకు తమ సొంత ప్రయోజనాలున్నాయి. దానిని అధిగమించి కేంద్ర సెకండరీ విద్యాబోర్డు పోటీ వ్యవస్థగా తయారైతే సెకండరీ విద్యపై రాష్ట్రానికి గల హక్కును అతిక్రమించడమే అవుతుంది. కేంద్రపాలిత ప్రాంతాలలోను, విద్యకు సంబంధించి ప్రభుత్వ అధికారాలు సుస్థిరంగాలేని రాష్ట్రాలలో కేంద్ర సెకండరీ విద్యాబోర్డు తన కార్యకలాపాలను పరిమితం చేసుకోవాలి. అదే విధంగా కేంద్రీయ విద్యాలయ సంఘటన. తరచుగా బదిలీ అయ్యే వుద్యోగుల పిల్లలకు సంబంధించి అయితే అది బాగానేవుంది కాని అంతకుమించి అయితే అనుమతించడానికి వీలులేదు. ఇరుగు పొరుగు పాఠశాల వ్యవస్థ, ఒకే విధమైన స్కూలు పాఠ్యాంశాలకొరకు, ప్రయివేట్ యాజమాన్యాల రద్దుకోసం, రాష్ట్ర సరిహద్దు లోపల రాష్ట్ర విద్యా సంస్థను అతి ప్రాముఖ్యమైనదిగా గుర్తింపుకోసం కృషి/చెయడం మన అభిమతం.

వృత్తిపరమైన సెకండరీ విద్య భావన కూడా హంటర్ కమిషన్‌ను గుర్తుకు తెస్తుంది. వృత్తి విద్యాకోర్సులను ప్రవేశపెట్టాలని ప్రపంచ బ్యాంకు కూడా సూచిస్తోంది. బహుళార్థ సాధక సెకండరీ పాఠశాలలను నెలకొల్పాలని మొదలియార్ కమిషన్ సూచించింది. వృత్తి విద్యా కోర్సులకు, పాలిటెక్నిక్ కోర్సులకు మధ్య తేడా వుంది. మన సెకండరీ విద్యను వృత్తి కళాకారులను, తక్కువ స్థాయి టెక్నీషియన్లను మాత్రమే తయారుచేస్తూ ప్రపంచ బ్యాంకు రూపొందించినట్లుగా వృత్తి విద్య చివరకు పారిశ్రామిక శిక్షణ స్థాయికి దిగజారిపోతుంది. వీటికి సంబంధించిన వివిధ అంశాలను పరిశ్రమలు, ట్రేడ్ యూనియన్లు, టీచర్లు, విద్యార్థి సంఘాలతోను, రాజకీయ పార్టీలతోను చర్చించాల్సి వుంది. ప్రణాళికా సంఘం ఆధ్వర్యాన ఏర్పాటు చేయబడిన కమిటీ పారిశ్రామిక దృక్పథంతోకూడిన సంస్థను ఏర్పాటు చేయాలని సిఫార్సుచేస్తూ నివేదికను సమర్పించినట్లు తెలుస్తున్నది.

ఇరుగు పొరుగు పాఠశాలల్లో వృత్తిపరమైన కోర్సులను ప్రారంభించే విష యాన్ని నిర్ణయించడంలో మాత్రమే గాకుండా ఆర్థిక వనరులు సమకూర్చడం ద్వారా అలాగే ప్రత్యేక నైపుణ్యంగల మానవశక్తిని సమకూర్చడం ద్వారా తమను గుణ్యమైన కార్యకలాపాలకు తోడ్పడేట్లు కూడా స్థానిక పరిశ్రమలు ముందుకు వచ్చేలా చూడడానికి విద్యా మంత్రిత్వశాఖ కృషి చేస్తుందని" ఆ మంత్రిత్వశాఖ వార్షిక నివేదికలో పేర్కొన్నది. విద్యకు అవసరమైన పెట్టుబడులకు సంబంధించి బ్రిటిష్ ప్రభుత్వం జమీందారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడగా, రాజీవ్‌గాంధీ పారిశ్రామిక వేత్తలపై ఆధారపడదలచుకున్నారు.

విద్యారంగంలో ప్రత్యేకించి పెట్టుబడులు సమకూర్చడానికి పారిశ్రామిక వేత్తలను దించే విషయాన్ని జాగ్రత్తగా అంచనా వేయాలి. ప్రయివేటు యాజ మాన్యాన్ని రద్దుచేయాలని టీచర్ల ఉద్యమం ప్రధానంగా డిమాండ్ చేస్తున్నది. దీనివల్ల ఆ డిమాండ్‌కు దెబ్బతగలనట్లయితే దాన్ని వ్యతిరేకించాల్సిన పనిలేదు. విద్యాపరమైన యాజమాన్య రంగంలో పరిశ్రమలు కోరుతున్న దేమిటి? విద్యపై అఖిల భారత 4 వ సర్వే ప్రకారం. ప్రాథమిక దశలో ప్రయివేట్ సంస్థల సంఖ్య 28,540 (4,74, 636 లో), మధ్య దశలో 23,240 (1,12,404లో), సెకండరీ, హయ్యర్ సెకండరీ దశలో 27,669 (47, 104 లో). కాలేజి దశలో 2,264 (3229) లో వుంది. కాపిటేషన్ ఫీజులాంటి అక్రమాలు, అవకతవకలు ప్రయివేట్ యాజమాన్య సంస్థలలో మాత్రమే జరుగుతున్నాయి. నీతిబాహ్యమైన అవినీతి మేనేజర్ల అవినీతి చర్యలవల్ల వాస్తవంగా విద్యా సంస్థలకు అవసరమైన దాని కన్నా ఎక్కువ డబ్బును గ్రాంట్-ఇన్-ఎయిడ్ పథకం హరించివేస్తున్నది.

కమ్యూనిజం టెక్నాలజీ పట్ల భారత ప్రభుత్వ నూతన నాయకులు వ్యామోహం పెంచుకున్నారు. పాఠశాలలో కంప్యూటర్ విద్యకు, విద్యా సాంకేతిక కార్యక్రమానికి (విద్యాపరమైన రేడియో టి వి కార్యక్రమాలు వగైరాలను రూపొం దించడం) విస్తృత ప్రచారం యిస్తున్నారు. ఇవన్నీ ప్రమాదకరమైన ధోరణులతో కూడుకున్నవి. ఎందుకంటే, ఈ విద్యా సాంకేతిక కార్యక్రమాన్ని బి.బి.సి సహ కారంతో రూపొందిస్తున్నారు. బి.బి.సి పథకం ప్రకారమే సున్నిత పరికరాలను కూడా వుత్పత్తి చేస్తారు. అందువల్ల యిది సామ్రాజ్యవాదుల చొరబాటుకు మంచి అవకాశాలున్న రంగం అవుతుంది.

అధికారులు ఆరు అంశాలతో కూడుకున్న జాతీయ నమోను కార్యక్రమా లను ప్రకటించారు. 1. ప్రామాణాలు పడిపోకుండా ప్రతి డిపార్టుమెంటు లేదా కాలేజీలో చేర్చుకునే శక్తిని దృష్టిలో పెట్టుకుని ప్రతిభను బట్టి అడ్మిషన్లను క్రమ బద్ధం చేయుట.

2. వెనుకబడిన ప్రాంతాలలో తప్ప కొత్త యూనివర్శిటీలు, కాలేజీల ఏర్పాటును తనిఖీ చేయుట. విద్యావసరాలపై సర్వే జరిపిన తర్వాత వెనుకబడిన ప్రాంతాలను కూడా పరిశీలిస్తారు.

3. సెకండరీ విద్యా స్థాయిలో వృత్తి కోర్సులు ప్రవేశపెట్టడం. యూనివర్శిటీ విద్యపై వాటి ప్రభావం వుంటుంది.

4. కరస్పాండెన్స్ కోర్సుల ద్వారా ఎక్కువమందిని చేర్చుకొనడానికి సౌకర్యాలు కల్పించడం.

5. బలహీనవర్గాలకు సమాన విద్యావకాశాలు కల్పించడం.

ఓపెన్ యూనివర్శిటీ, డిగ్రీలనుండి ఉద్యోగాలను విడదీయడం—వీటిని "అర్థం పర్థం లేకుండా, ఒక లక్ష్యమంటూ లేకుండా అండర్ గ్రాడ్యుయేట్ విద్యను విస్తరించడానికి అయ్యే వ్యయాన్ని, ప్రయాసను తగ్గించే" పద్ధతులుగా ముందుంచారు. (వార్షిక నివేదిక 1984-85 విద్యా మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వం, పి.పి. 123-124) నిరాటంకంగా అభివృద్ధి చెందడం అన్నది కర్జన్, ఆయన వారసులకు సంబంధించినది.

ఈ సంవత్సరం బడ్జెట్‌లో ఓపెన్ యూనివర్శిటీకి బడ్జెట్ కేటాయింపులు చేశారు. లభ్యంగా ఉన్న సమాచారం ప్రకారం, ఓపెన్ యూనివర్శిటీ దూరంగా వుండేవారికి విద్యను అందించే పద్ధతిని రూపొందిస్తుంది. భారతదేశమంతటా కాలేజీలను అనుబంధించడానికి అది అధికార కలిగి వుంటుంది. ఇది ప్రప్రథమ కేంద్ర యూనివర్శిటీగా వుంటుంది. దీని అధికార పరిధి దేశం నలుమూలలా విస్తరించబడుతుంది. ఇతర దేశాలలో ఈ ఓపెన్ యూనివర్శిటీలో శ్రామిక ప్రజలకు వుద్దేశించబడ్డాయి; యూనివర్శిటీలలో చేరాలన్న అభిలాష, ఆతృత కలిగివుండి, ఉద్యోగం చేసున్న కారణంగా చేరలేకపోయినవారికి అవి వుద్దేశించబడ్డాయి మన దేశంలో అర్హత కల్పించే ప్రామాణాలను సంపాదించలేకపోవడంవల్ల నియత (ఫార్మల్) విద్యాసంస్థలలో సీట్లు దొరకనివారికి సంబంధించి ఓపెన్ యూనివర్శిటీ సంకల్పించబడింది. ఓపెన్ యూనివర్శిటీ పట్టభద్రులు హరిజనులు. యు. జి. సి. తాజా సవరణ చట్టం రాష్ట్ర యూనివర్శిటీల హక్కును సులిమి వేసింది

డిగ్రీలనుండి ఉద్యోగాలను విడదీయడానికి ముందుగానే ఉన్నత విద్యాభ్యాసాన్ని యిప్పటికే డిగ్రీలనుండి విడదీశారు. నేషనల్ టెస్టింగ్ సర్వీస్ (ఎన్. టి. యస్) ద్వారా వచ్చేవారిని మాత్రమే రీసర్చ్ స్కాలర్సు, టీచర్లుగా చేర్చుకోవాలని యు.జి.సి, యితర సంస్థలు యోచిస్తున్నాయి. ఉద్యోగాలకు హామీ కల్పించి

నప్పుడు మాత్రమే డిగ్రీలకు ఎగబడటాన్ని క్రమబద్ధం చేయగలం. ఉద్యోగాలు లభ్యంగా లేకపోవడంవల్ల ఉద్యోగాలనుండి డిగ్రీలను విడదీయడమన్నది శుష్క-నినాదం అవుతుంది తప్ప మరేమీ కాదు.

విద్యకు సంబంధించి వివిధ అంశాలను మెరుగుపరచడానికి ఇప్పటికే వివిధ ప్రతిపాదనలను చర్చించారు. ఇవి నూతన విద్యావిధానం భాగాలు కాజాలవు. విద్యావ్యవస్థ మొత్తంగా ఆశించినంత సాధించలేకపోయింది. అన్ని దశలలోనూ విద్యా ప్రామాణాలను చూసినట్లయితే చాలా అసంతృప్తికరంగా వున్నాయి. ప్రాథమిక దశలో, ఇప్పటివరకు విద్య సార్వత్రికరణను సాధించలేకపోయాం. పాఠశాల వ్యవస్థకు తగినంత బోధనా సిబ్బందిని సమకూర్చలేకపోయారు. అధ్యాపకుల ప్రామాణాలు, అంకితభావం ఆశించినంతగా లేవు. ఉన్నత విద్యలో ప్రామాణాలు పడిపోతున్నాయి ప్రామాణాలులేని సాంకేతిక బోధనా సంస్థలు వున్నాయి. విద్యా ప్రామాణాలను మెరుగుపరచడానికి, దేశ ఆధునికీకరణకు దీనిని క్రియాశీల సాధనంగా రూపొందించడానికి తక్షణం ఈ వ్యవస్థను పునర్వ్యవస్థీకరించాల్సిన ఆవశ్యకత వుంది. (వార్షిక నివేదిక 1984-85, విద్యా మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వము, పేజి 121, ఉటంకింపు చేర్చబడింది)

అవసరమైనదేమంటే పునర్వ్యవస్థీకరణ.

శ్రీ రాజీవ్‌గాంధీ జాతి నుద్దేశించి మాట్లాడుతూ "మన మహత్తర స్వాతంత్ర్యోద్యమం గురించి ప్రతి విద్యార్థికీ తెలియజేయడం ఆవసరం" అని ఉద్ఘాటించారు; ఇది లాంఛనప్రాయమైన ప్రసంగం కాదని ఆశించగలం. మన భావితరాన్ని నయా వలసవాదానికి వ్యతిరేకంగా పోరాడటానికి సంసిద్ధం చేయడం అవసరం. మేధో వలస నయా వలసవాద విధానం వినాశకర ఫలితాలలో ఒకటి. ఇది అందరూ చెబుతున్న రుగ్మత. వనరులను తల్లకిందులుగా బదిలీ చేయడమన్న ఒక పరిమాణంలో భాగం. 1985 ఏప్రిల్ 17న లోక్‌సభలో ప్రధానమంత్రి ప్రకటించినట్లుగా "పరిశ్రమలు, పరిశోధనా శాఖలు ఇముడ్చుకునే వారికంటే ఎక్కువగా కొంత ప్రజ్ఞా ప్రాభవాలు, ఉన్నత విద్య గల ఎక్కువమంది ప్రజలను మన విద్యా వ్యవస్థ రూపొందిస్తుందని కాదు. వర్ధమాన దేశమైన మన దేశంలో రానున్న కొంత కాలం యిదే పరిస్థితి కొనసాగుతుంది"

వర్ధమాన దేశాలు ఆందోళన వ్యక్తంచేస్తున్నటువంటి యీ పరిణామం పట్ల రాజీవ్‌గాంధీ విచారం వ్యక్తం చేయలేదు.

తల్లక్రిందులుగా వనరులను బదిలీచేసే యితర రంగాల మాదిరిగానే ఈ మేధోవలస వలసవాద వ్యవస్థనుండి వారసత్వంగా పొందిన అంతర్గత వైకల్య

ఫలితం. మనకు తగినంత సంఖ్యలో డాక్టర్లు వున్నారు. వేలాదిమంది భారతీయ డాక్టర్లు యింకా విదేశాలలో పనిచేస్తున్నారు. దీనిని జవహర్‌లాల్ నెహ్రూ గుర్తించారు. అందువల్ల "నిధి" పథకాన్ని ప్రవేశపెట్టాలని ఆయన శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనా మండలి (సి.ఎస్.ఐ.ఆర్) కి విజ్ఞప్తి చేశారు. 30 వేలకు పైగా భారతీయ శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు, ఇంజనీర్లు, డాక్టర్లు దీనికి బలి పశువు లవుతున్నారు. ఒక శాస్త్రజ్ఞుని లేదా ఒక సాంకేతిక నిపుణుని, లేదా ఇంజనీరును లేదా డాక్టరును తయారుచేయడానికి భారత సమాజం ఎంత డబ్బును ఖర్చు చేస్తోంది? ఇది మన వనరులను తరలించడం కాదా?" దీనిలోని సానుకూల అంశాన్ని గమనించాలిగాని మేధో వలసగా చూడరాదు....ఇక్కడ మనం చూడాల్సిందేమంటే విదేశాలలో మరింత శిక్షణ పొందడానికి మనం వారిని పంపుతున్నాం. దీనిని మనం కొందరిని కోల్పోవడంగా చూడరాదు. వారు మనకు మరింత బాగా సేవచేయడానికి వీలుగా ఎక్కువ అనుభవం సంపాదించడంకోసం బయటకు పంపుతున్నట్లుగా భావించాలి" అని శ్రీ రాజీవ్‌గాంధీ మనకు చెబుతున్నారు. (లోక్ సభలో ప్రశ్నోత్తరాలు- 1985 ఏప్రిల్ 17).

సామాజిక శాస్త్రాలలో ఉదార విద్యను అధికంగా విస్తరించాలన్న వాదనను ఎవరైనా అర్థం చేసుకోగలరు. అయితే, మేధో వలస ఎక్కువగా జరుగుతున్న రంగాలైన భౌతికశాస్త్రం, సాంకేతిక పరిజ్ఞానం, ఇంజనీరింగ్, మెడిసన్‌ల విషయంలో ఖచ్చితంగా అలా లేదు. రాజీవ్‌గాంధీ చేసిన ప్రకటన అవగాహన లేకపోవడాన్ని మాత్రమే ప్రతిబింబిస్తున్నది. మేధోవలస హానికరమైనది. దీనికి వ్యతిరేకంగా నిర్విరామంగా పోరాడాల్సిన అవసర మెంతైనా వుంది.

ఆ విధంగా "మన మహత్తర స్వాతంత్ర్య పోరాట" విలువను పూర్తిగా పెంచగలం.

విద్యారంగంలో ప్రస్తుత ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు మనకు ఆందోళన కలిగిస్తున్నది. జాతీయ విద్యావిధానానికై మనం జరిపిన పోరాటంలో యిమిడివున్న అన్ని మౌలిక సూత్రాలను పరిరక్షించడం అవసరం. వాటిని నీరుగార్చడానికి చేసే ఏ ప్రయత్నాన్నైనా ప్రతిఘటించాలి.

1968లో చేసిన విద్యావిధానం తీర్మానంలో 17 అంశాలను పొందుపరిచారు. అవి యిలా వున్నాయి. :

(1) ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్య (2) అధ్యాపకుల హోదా, జీతం, విద్య (3) భాషల అభివృద్ధి (4) సమాన విద్యావకాశాలు (5) ప్రతిభ గుర్తింపు (6) పని అనుభవము, జాతీయ సర్వీసు, (7) శాస్త్రీయ

విద్య, పరిశోధన (8) వ్యవసాయం, పరిశ్రమలకు సంబంధించిన విద్య (9) పాఠ్యపుస్తకాల వుత్పత్తి (10) పరీక్ష (11) సెకండరీ విద్య (12) యూనివర్శిటీ విద్య (13) పార్ట్‌టైమ్ విద్య, కరెస్పాండెన్సు కోర్సులు (14) అక్షరాశ్యత, వయోజన విద్యా వ్యాప్తి (15) క్రీడలు, ఆటలు (16) మైనారిటీల విద్య (17) విద్యావ్యవస్థ.

ఈ అంశాలన్నీ పూర్తిగా సమగ్రమైనవి. సరిఅయిన నిర్వాహణ లేక పోవడం, తగిన నిధులు లేకపోవడం వల్ల లొసుగులు ఏర్పడ్డాయి. ఇది సరియైన అవగాహన లేకపోవడాన్ని ప్రతిబింబిస్తున్నది. వీటిని సమీక్షించి పరిష్కార చర్యలు తీసుకోవల్సిన అవసర మెంతైనా వుంది. 1968 విద్యావిధానంలో పేర్కొన్న లక్ష్యాలను సాధించడానికి సవరించిన వ్యూహం మనకు కావాలి. ఆధునికీకరణ అవసరమయితే దానికోసం యత్నించాలి. కాని లోపాలను కప్పి పుచ్చుకోవడానికి యత్నించరాదు.

★★

# 14 సంవత్సరాల కఠోర అజ్ఞాతవాసం

## సూడాన్ కమ్యూనిస్టుల అనుభవాలు
## తిజాని వయెబ్ బబెకర్

సభ్యులు, సూడాన్ కమ్యూనిస్టుపార్టీ
(సి. పి. యస్.) కేంద్ర కమిటి కార్యదర్శివర్గం

మీకు సుదీర్ఘకాలం జైలుశిక్ష విధించిన జాతీయ భద్రతాట్రిబ్యునల్ ముందు మీరుయిచ్చిన ప్రకటనలోని కొన్ని భాగాలను (వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ) రెండు సంవత్సరాల క్రితం ప్రచురించింది. (చూడండి, నిజాని తయెబ్ బబేకర్ "పోరాటం వెలుపల నన్ను నేను చూసుకోలేను", డబ్ల్యు. యం. ఆర్. సం.3 1983) మీరు తిరిగి విడదల అయ్యారన్న వార్త మాకెంతో సంతోషాన్ని కలిగించింది. మేము దానిని హర్షించాము.

నిమేరీ ప్రభుత్వం పడిపోయిన రోజున అంటే ఏప్రిల్ 6న నేను విడుదల అయ్యాను. ఈ ప్రభుత్వం పడిపోయిన రెండు మూడుగంటల్లోనే ఖార్టూమ్ ప్రజలు నగర జైలులోనికి త్రోసుకవెళ్ళారు. జైలుగదుల యినుప కడ్డీలు, తలుపులు బ్రద్దలుచేశారు. రాజకీయ ఖైదీల నందరినీ విడుదల చేశారు. మేము బజార్లలోనికి వచ్చినపుడు వేలాదిమంది సంతోషంతో కేరింతలు వేయడాన్ని, వికసించిన ముఖాలను స్వయంగా చూశాము. అందరు అసహ్యించుకొనే నియంతృత్వం ఆఖరికి కూల్చివేయబడింది.

— మీరు అనేక సంవత్సరాలు జైలులో గడిపారు. అక్కడ ఏదైనా రహస్యంగా పార్టీకృషి నిర్వహించ బడిందా? అయితే అది ఎలా వుండేది, కమ్యూనిస్టులు ఏ లక్ష్యాలను అనుసరించారు.

ప్రారంభంలో నేను రెండుసంవత్సరాలు ఒంటరిగా నిర్భంధించ బడినాను. మొదట భద్రతా సర్వీసు కేంద్ర కార్యాలయంలో. ఆ తరువాత యితర సహచరులకు దూరంగా పూర్తిగా ఒంటరిగా జైలులో.

విచారణ అనంతరం, రాజకీయ ఖైదీలకోసం కేటాయించిన జైలులోని ఒక విభాగానికి నన్ను బదిలీచేసినప్పుడు నా పార్టీ కామ్రేడ్స్‌ను కలుసుకొన్నాను. చాలా యిబ్బందికరమైన పరిస్థితులున్నప్పటికీ ఒకపార్టీ స్కూలును, డిబేటింగ్ సొసైటీలను (చర్చావేదికలు) సృష్టించడంలో విజయం సాధించాము. మేము ఒక నినాదాన్ని రూపొందించాము. అదేమంటే, "మన జైలుజీవన కాలాన్ని కమ్యూనిస్టుల విశ్వవిద్యాలయంగా మార్చుదాం." సహవాసులలో అనేకరకాల మహత్తరమైన పార్టీ అనుభవాలు గొప్పగా పుణికిపుచ్చుకొన్నవారున్నారు. నిర్మాణ, రాజకీయ కృషి సూత్రాలు. కార్మికోద్యమంలో కర్తవ్యాలు పనిపద్ధతులు, సూడాన్ ఆర్థిక వ్యవస్థ సమస్యల వంటి విషయాలపై వారు ఉపన్యాసాలు చేశారు. అధ్యయనం చేసే అవకాశాలు లేకుండా చేయబడిన కామ్రేడ్స్‌కోసం ఒక విధమైన అక్షరాస్యతా పాఠాలను నిర్వహించాము.

పార్టీ మాతో నిరంతరం సంబంధాలను ఏర్పాటుచేసుకొని కొనసాగించడం అన్న అంశంచాలా ముఖ్యమైనది. పార్టీ, మార్క్సిస్టు సాహిత్యాన్ని, అది నడిపే వివిధ సంస్థలు ఆమోదించిన పత్రాలను రహస్యంగా జైలులోనికి పంపింది. దానికి బదులుగా మేము రహస్యంగా నడపబడే పార్టీపత్రికలకోసం వ్యాసాలను వ్రాసి పంపేవాళ్ళం. బయటవున్న కాంమ్రేడ్స్‌కు మా అనుభవాలు తెలియచేస్తూ వివిధ సందేశాలను పంపేవాళ్ళం. నిరంతరంగా సాగే అధ్యయనాలు చర్చలు, యితర కార్యకలాపాలు, జైలులో వూపిరి పోసుకొనడానికి తోడ్పడినాయి. మానసికంగా కృంగిపోకుండా మమ్మల్ని నిలిపాయి. అలాగే, కమ్యూనిస్టులు, యీ కార్యకలాపాలను తాము విడుదల అయినపుడు ప్రారంభించే కృషికి సన్నాహకంగా చూశారు.

రాజకీయ ఖైదీల్లో అనేక గ్రూపుల వారున్నారు. ఇతర ప్రతిపక్ష పార్టీల, ప్రగతిశీల సంఘాల సభ్యులతో యీ గ్రూపులుండేవి. ఈ గ్రూపులలోని చాలా వాటితో మేము సంబంధాలు పెట్టుకున్నాము. అనేకసార్లు జైలు అధికారులు తీసుకొన్న చర్యలకు వ్యతిరేకంగా మేము ఉమ్మడి నిరసనలను నిర్వహించాము. ఖైదీలకు సంబంధించి ముఖ్యంగా అనారోగ్యంతో వున్నవారికి సంబంధించి పరిసితులను మెరుగుపరచాలని మేము డిమాండ్ చేశాము. ప్రతిపక్షాలకు చెందిన యితర విభాగాలతో సంయుక్తంగా కృషి చేస్తూ విడుదల అయిన అనంతరం అవసరమైన భవిష్యత్ సహకారానికి ప్రాతిపదికను రూపొందించాలన్నదీ. నియంతృత్వానికి వ్యతిరేకంగా నిలచే శక్తులన్నింటి ఐక్యతను సుదృఢం చేయడానికి దోహదంచేయాలన్నదీ మా లక్ష్యం.

మార్చి 26 న. నిమేరీ నియంతృత్వాన్ని కూల్చివేయడానికి మార్గాన్ని సుగమం చేసిన సూడాన్‌లోని తిరుగుబాటు గురించి ప్రపంచ ప్రజలు తెలుసుకున్నారు.

ఈ విప్లవ కార్యాచరణకు ప్రజా బాహుళ్యాన్ని సన్నద్ధం చేయడంలో కమ్యూనిస్టు పార్టీ ఎలాంటి పాత్రను నిర్వర్తించింది?

గడిచిన 14 సంవత్సరాలు సూడాన్ కమ్యూనిస్టు పార్టీకి చాలా కఠినమైనవి. అయితే అది ప్రజా బాహుళ్యంలో తన పనిని ఎన్నడూ మానుకోలేదు. మా ప్రధాన కర్తవ్యం శ్రామిక ప్రజల్లో ప్రతిఘటనాభావాన్ని నిరంతరంగా వుండేట్టు చూడడం. కమ్యూనిస్టులు, వారి మిత్రులు అన్ని ప్రధాన పారిశ్రామిక సంస్థల్లో చురుకుగా పని చేశారు. కార్మిక సంఘాలను పూర్తిగా ప్రభుత్వానికి దాస్యంచేసే సంస్థలుగా తయారుచేయడం అన్నది పాలకుల లక్ష్యం అనీ అలా చేసే ప్రయత్నాలను కార్మికులు నిరోధించాలని వారు విజ్ఞప్తిచేశారు. పాలకపార్టీ బలపరచే అభ్యర్థులను ఎన్నికల్లో ఓడించేందుకు వీలుగా ఐక్యం గావాల్సిందన్న కార్యకర్తల డిమాండ్‌లకు అంగీకరించేట్టు చేయడానికి పశ్చిమితవాదులతో సహా యూనియన్ నాయకులను ఒప్పించేందుకు ప్రయత్నించాలని వారు విజ్ఞప్తిచేశారు.

శ్రామిక ప్రజల్లో విశ్వాసాన్ని కలిగించడానికి వీలుగా, కమ్యూనిస్టులు సాధ్యమైన కర్తవ్యాలను నిర్ణయించారు. వాస్తవమైన నినాదాలను ముందుంచారు. ఆయా ప్రత్యేక పరిస్థితులమీద ఆధారపడి పోరాట రూపాలను ఎన్నుకోవలసిందిగా నేర్పారు. ఉదాహరణకు కమ్యూనిస్టులు, కొన్ని పరిస్థితులలో సమ్మెకు పూనుకొనడానికి బదులుగా, కార్మికుల కోర్కెలను తెలియచేస్తూ ఒక మహజరును తయారు చేయడం వాటిని అమలు పరచవలసిందిగా పట్టుపట్టడం చేయాలని మంచిదని వివరించారు. ఆ విధంగా ప్రజలను సమైక్యపరచాలని చెప్పారు. కమ్యూనిస్టులు, రహస్య పత్రికల్లో, కరపత్రాల్లో ప్రజల కిచ్చిన సందేశాల్లో ప్రభుత్వాన్ని ఎండకట్టేవారు. మార్పులు అనివార్యమని వాదించారు.

మా పార్టీ యితర ప్రతిపక్ష పార్టీలతో, ఉద్యమాలతో, కనీసం అతి పెద్దవిగా వున్న వాటితో సంబంధాలు నెలకొల్పుకున్నది. నిషేధింపబడిన సంస్థల నాయకుల సమావేశాలు క్రమం తప్పక జరిగేవి; ప్రత్యేకంగా 1983 నుండి; సహజంగానే రహస్యంగా మంచి రక్షణలో యివి జరిగేవి.

1971 లో పార్టీమీద ప్రభుత్వం దాడులు ప్రారంభించినపుడు సూడాన్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి అబ్దుల్ ఖలీక్ మహగౌబ్‌తో సహా అనేకమంది సభ్యులు అరెస్టుచేయబడి, కాల్చి చంపబడ్డారు. నియంతృత్వ ప్రభుత్వం కూలిపోయినప్పుడు పార్టీ ఏ రూపంలో వున్నది?

నిజం, 1971 లో మా పార్టీకి అతి బాధాకరమైన దెబ్బ తగిలింది. అయినప్పటికీ మేము కూడదీసుకోగలిగాం. సూడాన్ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు కాకపో

యినా, దాని మిత్రులుగా భావించబడే వందల, వేలమంది సహాయంతో అత్యంత సమర్థవంతమైన పార్టీని సంరక్షించుకొన్నాం. మా పార్టీ కార్యకర్తలను కాపాడుకున్నాం. ఇన్ని సంవత్సరాలుగా పార్టీ నాయకత్వం గ్రామీణ ప్రాంతంలో వున్నప్పటికీ 1971 తరువాతనే నిమేరీ రహస్య పోలీసులు కొద్దిమంది నాయకులను మాత్రమే అరెస్టు చేయగలిగారు. ముమ్మరంగా వేటలాంటిది సాగినా వారిలో ఎక్కువమంది అరెస్టు కాబడలేదు.

జాతీయ రంగంలో సూడాన్ కమ్యూనిస్టు పార్టీ యొక్క ప్రస్తుత స్థితిని మీరు ఏ విధంగా వర్ణిస్తారు? దేశ రాజకీయాల్లో అది ఏ విధంగా పాల్గొంటున్నది?

ఇక్కడ నేనొక విషయాన్ని వక్కాణించాలి. అదేమంటే నియంతృత్వం కూల్చివేయబడిన తరువాత మేము చట్టబద్ధంగా పనిచేయగలుగుతున్నాం. ట్రేడ్ యూనియన్లలో బహిరంగంగా పనిచేయగలుగుతున్నాం. ఇతర ప్రజాతంత్ర శక్తులలో సహకరించగలుగుతున్నాం. ఆపద్ధర్మ పౌర ప్రభుత్వం ఏర్పాటుపై జరిగే సంప్రదింపుల్లో కమ్యూనిస్టులు పాల్గొన్నారు. మా నాయకులు సైనిక ప్రభుత్వ అధినేతను కలుసుకున్నారు. వివిధ సమస్యలపై కమ్యూనిస్టు పార్టీ వైఖరిని వివరించారు.

దేశంలో క్రియాశీలంగా వున్న అన్ని రాజకీయ పార్టీలలోనూ మేము ద్వైపాక్షిక సంబంధాలు కొనసాగిస్తున్నాం. మార్చి తిరుగుబాటులో పాల్గొన్న రాజకీయ, సామాజిక శక్తుల ఐక్యతను పటిష్టం చేయడానికి, యిలాంటి సంబంధాల కొనసాగింపు ముఖ్యమైన అంశం అని మేము అభిప్రాయపడుతున్నాం.

ఈనాడు, ఒక దినపత్రికను ప్రారంభించాలని సూడాన్ కమ్యూనిస్టు పార్టీ సన్నద్ధం అవుతున్నది. పార్టీ తన కేంద్ర కార్యాలయాన్ని తెరవనున్నది. ఇది రాజధానిలో చట్టబద్ధంగా పనిచేస్తుంది. 1935 మే 2న ఖార్టూమ్ స్టేడియంలో ప్రప్రథమంగా ప్రజా ప్రదర్శన జరిపాం. మా ప్రధాన కార్యదర్శి మహమ్మద్ నుగుద్ అందులో ప్రసంగించారు. మేము యింకేమాత్రం రహస్యంగా వుండాల్సిన అవసరం లేదు. అదే సమయంలో ఎలాంటి అవాంతరాలనైనా ఎదుర్కొనడానికి సిద్ధంగా వున్నాము. అవసరమయ్యే పక్షంలో అజ్ఞాతంనుండి బయటికి వచ్చిన దానికంటే త్వరగా రహస్య జీవితాలు మేము గడపడానికి సిద్ధంగా వున్నాం.

ఇక చివరి ప్రశ్న. నియంతృత్వానికి వ్యతిరేకంగా తమ పోరాటంలో సూడాన్ దేశభక్తులతో అంతర్జాతీయ సంఘీభావ పాత్రపై మీ అంచనా ఏమిటి?

సంఘీభావం అన్నది మాకు అధికతర ప్రాముఖ్యతగల విషయం. నిమేరీ ప్రభుత్వాన్ని ప్రపంచ వ్యాపితంగా ఖండించారు. ఇదే మాపట్ల సంఘీభావం అంటే.

ప్రభుత్వ యాజమాన్యాన వున్న ట్రేడ్ యూనియన్లు, మహిళా, యువజన, తదితర సంస్థలు అంతర్జాతీయ రంగంలో బహిరంగంగా యీ ప్రభుత్వాన్ని బహిష్కరించాయి. ప్రత్యేకంగా ఆఫ్రికా, అరబ్ దేశాల్లో యీ విధంగా జరిగింది. ఈ సంఘీభావం మాకు బలాన్ని యిచ్చింది. ఇది రాజకీయ ఖైదీలకు సంబంధించిన నైతిక తోడ్పాటులోగల అమూల్యమైన శక్తి. ఇది ఎంతగానో మాకు తోడ్పడింది. నియంతృత్వానికి వ్యతిరేకంగా ఎన్నో సంవత్సరాల పోరాటంలో మా ప్రక్కన నిల్చిన వారికందరికీ హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియచేసుకొంటున్నాను.



# కార్డోవా కమ్యూనిస్టు మేయరు

స్పెయిన్‌లోని అతి ప్రాచీన నగరాలలో ఒకటైన కార్డోబా రాష్ట్ర రాజధాని కార్డోవా నగర సమితి అధిపతిగా (అల్ కాల్డియా) కమ్యూనిస్టు నాయకుడు జులియో అంగుయిటా గత ఆరు సంవత్సరాలుగా పనిచేస్తున్నారు. కార్డోవా మేయరును ఇంటర్వ్యూ చేయవలసిందిగా వరల్డు మార్క్సిస్టు రివ్యూ స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ ప్రముఖ సభ్యులు రొమాన్ మెంచెజోనాను అడిగింది.

ప్రథమంగా మేయరు పదవి స్వీకరించి ఆరు సంవత్సరాలు అయింది; మీరు 1983 లో తిరిగి ఎన్నికయ్యారు. ఇటీవలి ఎన్నికల్లో కమ్యూనిస్టులు యేమి సాధించారు?

స్పెయిన్‌లో ప్రథమంగా 1931 లో మున్సిపల్ ఎన్నికలు జరిగాయి. 1979 తో పోల్చి చూస్తే మేము గుణాత్మకమైన ముందడుగు వేశాము. 1979 లో మేము యితర పార్టీలకంటె ఎక్కువ ఓట్లు సాధించాము. నగర మండలిలో అతి పెద్ద పక్షాన్ని ఏర్పాటు చేయగలిగాం. అయితే మొత్తం 27 స్థానాలకుగాను 8 సీట్లను మాత్రమే సాధించాము గాని మాకు మెజారిటీ లేదు. ఈనాడు నగర మండలిలో కమ్యూనిస్టులకు 17 స్థానాలున్నాయి. ఇతర 10 స్థానాల్లో పాపులర్ ఎలయన్స్ (ఆరు) సోషలిస్టులు (నాలుగు) గెలిచారు.

ప్రస్తుతం మీరు నగర పాలకమండలి పనికి నాయకత్వం వహిస్తున్నారు. కమ్యూనిస్టు మేయరుకు అంతకుముందు ఆ పదవిలో వున్నవారికి మధ్య ప్రధానమైన తేడా ఏమిటి?

మొదటి విషయమేమంటే బూర్జువా ప్రజాస్వామ్యంలోని మేయరుకు, నియంతృత్వం క్రింద మేయరుకు చాలా తేడా వున్నది. ఈనాడు స్థానిక స్వపరిపాలనా సంస్థలు జాతీయ ప్రభుత్వానికి సంబంధించి మరింత స్వయంప్రతిపత్తి కలిగివున్నాయి. ప్రజలకు మరింత అందుబాటులో వున్నాయి. వాటికున్న విస్తృతమైన అధికారాలవల్ల సమస్యలను కూలంకషంగా పరిశీలించి పరిష్కరించగలుగుతున్నాయి. పూర్వంలాగా సమస్యలు పరిష్కరించబడినట్టుగా కనపడక నిజంగా పరిష్కారం అవుతున్నాయి.

మా నగరంలో ఫ్రాంకో పాలనా సంవత్సరాలకు ఈనాటికి గల వ్యత్యాసం స్పష్టంగా కనబడుతున్నది. ఏమంటే నియంతృత్వానికి నూకలు నిండిన వెంటనే కమ్యూనిస్టు మేయరు ఎన్నికయ్యారు. మొదటినుండీ నేను అందరికంటే ఎక్కువగా పెద్ద బాధ్యత వున్నట్టు అభిప్రాయపడుతున్నాను. ఎందుకంటే కార్డోవా ప్రజలు నేనున్న పార్టీని మాటలనుబట్టి గాక చేతలనుబట్టి నిర్ణయం చేస్తారు. ఇతర రాజకీయ పార్టీలవారి నుండి ఆశించిన దానికంటే ఎక్కువగా స్పెయిన్ ప్రజలు, బాధ్యతాయుతమయిన పరిపాలనా సంబంధ. యితర పదవులకు ఎన్నికైన కమ్యూనిస్టుల నుండి కోరుతున్నారు. అందువల్ల అతడు హృదయపూర్వకంగా పనిలో నిమగ్నమై కృషి చేస్తున్నాడన్న విషయాన్ని ప్రజలు ప్రత్యక్షంగా చూసేట్టు కమ్యూనిస్టు మేయరు కృషి వుండాలి. నగర పాలకమండలిలోని యితర సభ్యులకు ఆదర్శంగా కమ్యూనిస్టు మేయరు కృషి చేస్తున్నాడన్న విషయాలు ప్రజలు గమనించాలి.

నగర పాలకమండలి కార్యకలాపాల్లోని ఏ అంశాలమీద మీరు కేంద్రీకరించి పనిచేశారు? ఇన్ని సంవత్సరాల్లో మీరు సాధించిందేమిటి?

మా ప్రధాన కర్తవ్యం, ఫ్రాంకో క్రింద పటకాల ప్రజల నుండి యీ నగర మండలిని వేరుపరచిన అడ్డుగోడను బ్రద్దలుచేయడం. అందువల్ల 1979 ఎన్నికల తరువాత మేము చేసిన మొదటి చర్య ఏమంటే వివిధ జిల్లాల (యిరుగు పొరుగు సంస్థలుగా వీటిని పిలుస్తారు) ప్రజల సమావేశాలకు హాజరై నగరపాలక బడ్జెటును ఎలా రూపొందించామో వివరించడం. నేను నగరానికి చెందిన పాఠశాలను సందర్శించాను. నగర పాలకమండలి స్వరూపం, కర్తవ్యాల గురించి విద్యార్థులకు వివరించాను. (వృత్తిరీత్యా నేను ఉపాధ్యాయుడను) అతి సూక్ష్మమైన విషయం కూడా వివరించి ప్రజల విశ్వాసాన్ని పొందడానికి మేము కృషిచేశాము. ఈ ప్రయత్నాలు యిటీవల జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో కార్డోవా కమ్యూనిస్టుల విజయంలో తమ వంతు పాత్ర నిర్వహించాయి. ఒక స్పెయిన్ మేయరు, అతని సహచరులు, నగర పాలకమండలి సభ్యులు, నివాస ప్రాంతాలకు వెళ్ళి యేమి చర్యను తీసుకోబడమన్నాయో వివరించడం యిదే మొదటిసారి.

ఆ తర్వాత ప్రజలతో మా సహకార సూత్రాలను రూపొందించాము. ఇది దేశంలోనే అత్యంత ప్రగతిశీలమైన సూత్రాలు. వీటి ప్రకారం జిల్లా మండలులు ఏర్పాటు చేయబడతాయి. వీటిలో "యిరుగు పొరుగు సంస్థలు", యిలాంటి యితర పక్షాలు పాల్గొంటాయి. ఈ మండలుల ప్రతినిధులు, నగర సమితి సమావేశాలకు సమాచార సంఘం సమావేశాలకు హాజరు కావడానికి అధికారం వుంది. ముసాయిదా బడ్జెటులోని అంశాల ఆమోదానికి 45 రోజుల ముందు వాటిని పరిశీలించడానికి,

అవసరమయితే కొత్త అంశాలను. చేర్చడానికి వీరు యీ సమావేశాలకు హాజరవు తారు అవి తమ సూచనలను సమర్పించడానికి వీలుగా తమ జిల్లాలలోని అన్ని ప్రధాన నిర్మాణాలపై ముందుగానే సమాచారాన్ని ఈ మండలులకు నగరపాలక సంస్థ అందచేస్తుంది. ఈ సమస్యలపై ఏవైనా వివాదాలు వస్తే నగర పాలకసంస్థ విస్తృత సమావేశంలో పరిశీలిస్తారు దానికి జిల్లా మండలుల ప్రతినిధులు హాజరవు తారు. అందువల్ల విస్తృతమైన, సమగ్రమైన సహకారాన్ని అందచేయడానికి అవకాశం కలుగుతున్నది.

మేము ఆమోదించిన నియమ నిబంధనలు ఆచరణలో యింకా అన్నిచోట్లా అనుసరించబడడం లేదన్న విషయం యదార్థం. కొన్ని సందర్భాలలో నగరపాలక సంస్థ అధికారులు వాటిని మర్చిపోతారు కొన్ని సందర్భాలలో నగరపాలకసంస్థ కృషిలో భాగస్వామ్యం వహించే యంత్రాంగాన్ని చురుకుగా ఉపయోగించుకొన డంలో తగు విధంగా వ్యవహరించడంలేదు. అయితే ఎక్కువ సందర్భాలలో యీ సహకారం సమర్థవంతంగా వుంటున్నది

మరొక్క అంశం, స్పెయిన్‌లోకెల్లా రెండు అతి పెద్ద ట్రేడ్ యూనియన్ అసోసియేషన్లు అయిన లేబర్ కమిషన్స్, జనరల్ వర్కర్స్ యూనియన్ ప్రతి నిధులను మా పరిపాలనా సంస్థల్లో కలుపుకొన్నది యింతవరకు మా నగరపాలక సంస్థ ఒక్కటే. ఈ ప్రతినిధులు వాటర్ వర్క్సు, రవాణా, హౌసింగ్, పారిశుధ్యం, తదితర సర్వీసులకు సంబంధించిన పరిపాలనా మండలుల్లో పనిచేస్తున్నారు నివా సులకు సంబంధించిన ఒక ప్రతినిధి కూడా ప్రతి మండలిలో పనిచేస్తాడు. క్రింది స్థాయినుండి వస్తున్న, కమ్యూనిస్టు మేయరు బలపరిచిన చొరవల ఫలితంగా జరుగుతున్నవే యీ సూచన ప్రక్రియలు.

కార్డోవాలో మునుపెన్నడూ లేనటువంటి మున్సిపల్ సర్వీసులను స్థాపించ డంలో మేము విజయవంతం అయినాము. మంచినీరు, విద్యుత్, తదితర సౌక ర్యాలు లేని 50 వేలమంది పట్టణ ప్రజల జీవన పరిస్థితులను, నివాస పరిస్థితులను మెరుగుపరచాము. నగరపాలక మండలి నూతన భవన నిర్మాణం, స్థానికంగా థియే టర్‌ను, బొటానికల్ గార్డెన్‌ను ఏర్పాటుచేయడం తదితర సమస్యలపై కమ్యూ నిస్టులను నివాసుల సంస్థలు, ట్రేడ్ యూనియన్‌లు బలపరచాయి. నేను మేయ రుగా వున్న ఆరు సంవత్సరాల్లో నిర్మాణ పథకాలమీద 7 బిలియన్‌ల పెసెటాలు పెట్టుబడి పెట్టినాయి. 3,00,000 మంది గల ఒక నగరానికి యీ పెట్టుబడి చాలా ఎక్కువ ప్రమాణంగల పెట్టుబడి.

—పట్టణాభివృద్ధి సమస్యల పరిష్కారంలో కమ్యూనిస్టులు ఆచరించే ప్రమాణం ఏమిటి ?

కార్డోవా సంపద్వంతమైన, ప్రసిద్ధమయిన చరిత్ర కలది. క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దం మధ్య భాగంలో హిస్పానియా సెటిల్‌మెంటు స్థానే రోమన్లు దీనిని నిర్మించారు. విసిగోథ్‌లనాటి స్పెయిన్‌లో యిది ముఖ్యమైన కేంద్రం. క్రీ॥ శ॥ పదవ శతాబ్దంలో కార్డోబా ఖలీఫతేలో భాగంగా ముస్లిమ్ దండయాత్ర తరువాత ఈ నగర సౌభాగ్యం తారాస్థాయికి చేరుకున్నది. ఆ యాకారాల్లో ప్రభావం యీ నగరంమీద పడింది. వాటికి యిది ప్రజల ప్రతిబింబంగా వుంటున్నది.

ముస్లిమ్ శకాల్నుండి 19 వ శతాబ్దం వరకు కార్డోవా నగర హద్దులు, వీధులు, చౌకులు, చివరకు రవాణా సౌకర్యాలు ఎలాంటి మార్పులు లేకుండా అలానే వున్నాయి. ఈనాడు మా నగరం, చారిత్రక కట్టడాలున్న యూరోప్ నగరాలలో అతి పెద్ద నగరం. ఈ నగర చారిత్రక స్వరూపాన్ని సంరక్షించాలని మేము కృషి చేస్తున్నాం. అదే సమయంలో అవసరమైన నిర్మాణ పనులను కొనసాగిస్తున్నాం. నేటి అవసరాలను తీర్చడానికి నిర్మాణ ప్రాతిపదికను సృష్టిస్తున్నాం.

1986 లో అండాలుసియాలో (ఇది స్పెయిన్ 17 స్వయంపాలిత ప్రాంతాల్లో ఒకటి. ఇందులో కార్డోబా మండలంతో సహా 8 మండలాలు వున్నాయి) ప్రాంతీయ ఎన్నికలు జరుగనున్నాయి. అండాలుసియా స్వయం పరిపాలనా ప్రభుత్వానికి అధ్యక్షునిగా స్పెయిన్ కమ్యూనిస్టుపార్టీ మమ్మల్ని నియమించింది. ఎన్నికల ముందు కమ్యూనిస్టులు యితర వామపక్ష శక్తులు రూపొందించిన "అండాలుసియా విజ్ఞప్తి" గురించి దయచేసి చెప్పండి

ఈ "విజ్ఞప్తి" ఉద్దేశం యేమంటే యీ ప్రాంతీయ ప్రభుత్వానికి సంబంధించిన ప్రత్యామ్నాయ కార్యాచరణ పథకాన్ని రూపొందించడంలో యీ ప్రాంత ప్రజలను భాగస్వాములను చేయడం. ప్రజలకు, అన్ని ప్రజాతంత్ర శక్తులకు మేము చేసిన "విజ్ఞప్తి" వెనుకగల ఉద్దేశం ఏమంటే స్పెయిన్ సోషలిస్టు వర్కర్సు పార్టీ(1982 డిసెంబరునుంచి పాలక పార్టీ) తన ఎన్నికల కార్యక్రమం నుండి వైదొలగిపోతే ప్రజానీకంలోని విస్తృత విభాగాలు రాజకీయ పోరాటంలో శ్రద్ధ కోల్పోయి, నిరాశా నిస్పృహలకు లోను అయ్యే ప్రమాదం కలుగుతుందన్నది.

ఈ పరిస్థితులు సంభవించకుండా నివారించడానికి వీలుగా ప్రగతిశీల శక్తులను, ధోరణులను సన్నిహితపరచేందుకు మా పార్టీ కృషిచేస్తున్నది.. కోర్కెలు ముందుంచడమే గాకుండా, ప్రాంతీయ స్థాయిలో ప్రభుత్వ కార్యకలాపాలను ఆచరణాత్మకంగా నెరవేర్చేందుకు సమాయత్తం కావాల్సిందిగా కమ్యూనిస్టులు, అండలూసియాలోని ప్రగతిశీల శక్తులకు పిలుపు యిస్తున్నారు. ఇందుకు విజ్ఞానం, కావాలి. చర్చల్లో నైపుణ్యం కావాలి. సామాజిక పరిణామాన్ని కూలంకషంగా

అర్థం చేసుకునే శక్తి కావాలి. ప్రత్యామ్నాయ కార్యక్రమ రూపకల్పనలో భాగస్వామ్యంవల్ల పారిశ్రామిక, వ్యవసాయ కార్మిక, మత్స్య కార్మిక, కళాకారులకు సంబంధించిన సమాజంలోని వృత్తి కళాకారులు, యితరులకు వివిజ్ఞాన కలుగుతుందని మేము అభిప్రాయపడుతున్నాం. ప్రజా జీవనంలో వారి పాత్రను పెంచడానికి అది దోహదపడుతుంది.

ఏప్రిల్ ప్రారంభంలో కార్డొవాతో మేయర్ల అంతర్జాతీయ సమావేశం జరిగింది. వివిధ పట్టణాల, జాతులకు సంబంధించిన మేయర్లు హాజరైన ఈ సమావేశం అణ్వస్త్ర రహిత మండలాలకు కట్టుబడి వుంటున్నట్టు ప్రకటించింది. ఈ సమావేశం ఫలితాలు ఏమిటి ?

ఈ రోజున, స్పెయిన్‌లోని జనాభాలో మూడింట ఒక వంతు అణ్వస్త్ర రహిత మండలాలుగా ప్రకటించిన జాతుల్లో నివసిస్తున్నారు. మా దేశ యీ విషయంలో బ్రిటన్‌కు సన్నిహితంగా వుంటున్నది. కార్డోవా సమావేశాన్ని ఏర్పాటుచేసిన మున్సిపల్ అధికారుల ఉద్యమంలో యీ రెండూ ముందు పీటాన నిలబడినాయి. దీనికి 15 దేశాలకు చెందిన 99 మున్సిపల్ కౌన్సిల్‌ల నుండి ప్రతినిధులు హాజరయ్యారు. అంతకుముందు మాంచెస్టర్‌లో జరిగిన సమావేశం కంటే యిది ఎక్కువ ప్రాతినిధ్యం వున్నది. ఇక్కడ ముఖ్యమైన తీర్మానాలు ఆమోదించబడినాయి. తమ దేశాలు అణ్వాయుధాలను ఉత్పత్తి చేయకుండా వుండేట్టు ఆయా దేశాలనుండి అణ్వాయుధాలు ఉపసంహరించుకొనేట్టు, అణు సంబంధమైన వ్యర్థ పదార్థాన్ని రవాణా చేయడానికి స్వస్తి చెప్పేట్టు డిమాండ్ చేయవలసిందిగా ప్రపంచవ్యాపితంగా వున్న "అణ్వస్త్ర రహిత మున్సిపల్ కౌన్సిల్స్"కు ఒక తీర్మానం కోరింది.

నాటోలో స్పెయిన్ సభ్యత్వంపట్ల అణ్వస్త్ర రహిత మున్సిపల్ కౌన్సిళ్ళు వ్యక్తం చేసిన ఆందోళన యీ సమావేశంలో ప్రతిబింబించింది. ఈ సమస్యపై దేశవ్యాపిత ప్రజాభిప్రాయాన్ని జరుపవలసిందిగా అవి ప్రభుత్వానికి పిలుపునిచ్చాయి. దాని ఫలితాలు ఎలా వున్నప్పటికీ దేశ భూభాగంపై అణ్వాయుధాలు మోహరించరాదని ప్రకటించాయి. 

# ఫ్రెడరిక్ ఎంగెల్స్ - సమకాలీన సిద్ధాంత పోరాటం

- హెన్రిక్ గెమ్కో

ఈ సంవత్సరం ఆగస్టు 5 న ఫ్రెడరిక్ ఎంగెల్స్ 90 వ వర్ధంతిని, నవంబరు 28న 165 వ జయంతిని అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం జరుపు కొంటోంది.

తన అంతిమయాత్రలో బహు కొదిమంది మాత్రమే పాల్గొనాలని ఎంగెల్స్ వీలునామాలో పేర్కొన్నారు. ఆయన కోర్కెననుసరించి, లండన్‌లో ఆగస్టు 10న ఆగస్టు బెబెల్, విల్హెం లీబ్‌నెక్ట్, వీరాజాసులిచ్, పాల్‌లెఫార్గు, ఎలియనార్ మార్క్స తదితర ప్రముఖుల సమక్షంలో—దాదాపు 80 మంది — ఎంగెల్స్ అంత్యక్రియలు జరిగాయి

ఆ సందర్భంలో లీబ్‌నెక్ట్ పలికిన పలుకులు, లక్షలాది శ్రమజీవుల మనో భావాలకు ప్రతీకలుగా వున్నాయి. "కారల్ మార్క్స్‌ను కోల్పోయిన తరువాత యింతటి నష్టాన్ని మేం ఎరుగం. ఫ్రెడరిక్ ఎంగెల్స్ మరణంతో మార్క్స రెండవసారి చనిపోయారు. సమాధివద్ద వున్నవారు కొద్దిమంది మాత్రమే. కాని మా ఆలోచనతో ఏకీభవించేవారు యిక్కడ చేరితే, అంతమందిని లండన్ మహా నగరం భరించటం కష్టం." లీబ్‌నెక్ మాటల్లో అణువంతయినా అతిశయోక్తి లేదు. అంతర్జాతీయ కార్మికోద్యమ పత్రికలలో వందలకొలది వ్యాసాలు వెలువడి నాయి. బెర్లిన్, బుడాపెస్టు బుఖారెస్టు, జెనివా, లండన్, మాడ్రిడ్, వియన్నా, న్యూయార్క్ తదితర నగరాలలో సంతాప సభలు జరిగాయి.

యవ్వన ప్రాయంలో వున్న లెనిన్ ఆగస్టు మాసంలో బెర్లిన్‌లో మార్క్స, ఎంగెల్స్ గ్రంథాలను అధ్యయనం చేస్తున్నాడు. యీ విషాదవార్త విన్న వెంటనే, దుఃఖమనస్కుడైన లెనిన్, మృతుని సంగ్రహ జీవిత చరిత్ర రాశాడు. అదే

ఆ తరువాత "ఫ్రెడరిక్ ఎంగెల్స్" శీర్షికతో ప్రసిద్ధి చెందింది. "విధి మార్క్స్. ఎంగెల్స్‌లను దగ్గరి చేసిన నాటినుండి, ఆ యిరువురు స్నేహితులు ఒక సమిష్టి లక్ష్యానికి తమ జీవితకాల కృషిని వెచ్చించారు."

మనం వారి పేర్లను కలిపే సంభోదించుతాం. "మార్క్సిజం" భావనలో ఒక పేరు మాత్రమే కన్పించవచ్చు; కాని ఎంగెల్స్ చారిత్రక కృషి, ఆయన పేరు దానిలో భాగంగా మనం భావిస్తున్నాం. వారి అభిప్రాయాలు, కృషి విడదీయరానివి. వాటి ఐక్యత సహజ సిద్ధమైనది.

వాస్తవానికి, ఎంగెల్స్ స్వతంత్రగా—ప్రధమంలో సమాంతరంగా, ఆ తరువాత మార్క్స్‌తో కలసి— నూతన ప్రపంచ దృక్పథాన్ని విపులీకరించారు. దాని మౌలిక భావాలను, శాస్త్రీయ ఆవిష్కరణలను సంపద్వంతం చేసారు. గతితార్కిక, చారిత్రక భౌతికవాదం, రాజకీయ అర్థశాస్త్రం, వర్గపోరాటం, శ్రామికవర్గ విప్లవాల బోధనలకు సంబంధించి మాత్రమే కాదు; వారిద్దరి మధ్య శ్రమ విభజననుసరించి ప్రకృతి చరిత్ర, సైనికశాస్త్రం, సౌందర్యశాస్త్రం, భాషాశాస్త్రం, సామాజిక వ్యవస్థల చరిత్ర, ప్రపంచ చరిత్ర, జర్మనీ చరిత్రలాంటి నూతన రంగాలకు ఎంగెల్స్ భౌతికవాద గతితార్కిక తత్వశాస్త్రాన్ని వర్తింపజేసి విశదీకరించాడు. శాస్త్రీయ కమ్యూనిజంవిశ్వజనీన సూత్రాల ప్రాధాన్యతను చాటి చెప్పటంలో ఆయన కృషి అపారమైనది. కనుకనే లెనిన్ ఇలా అన్నారు."ఎంగెల్స్ రచనలన్నింటినీ పరిగణనలోకి తీసుకోకుండా, మార్క్సిజంను అర్థం చేసుకోవటం దానికి పూర్తి సమగ్రతను చేకూర్చటం అసాధ్యం." కాపిటల్ గ్రంథం రెండు, మూడు వాల్యూంలను ముద్రణకు సంసిద్ధం చేయటంలో ఎంగెల్స్ కృషిని అంచనా కడుతూ లెనిన్ అన్న మాటలు గమనార్హం "కాపిటల్ వాల్యూంలు రెండూ, యిద్దరి మహనీయుల కృషి; మార్క్స్, ఎంగెల్స్‌లు." కాపిటల్ మొదటి వాల్యూం రచనలో కూడా మార్క్స్‌కు ఎంగెల్స్ సలహాదారుగా, ప్రవీణునిగా వ్యవహరించాడు. మార్క్స్ నిరంతరం ఆయన సహాయాన్ని పొందాడు. అర్థశాస్త్రంలో ఆయనకు అపార పరిజ్ఞానంవుంది. ఆచరణాత్మక అనుభవం వుంది.

మార్క్స్, ఎంగెల్స్‌లు మధ్య, వారి అభిప్రాయాలు మధ్య ఘర్షణ వుందని చూపెట్టటానికి గత కొద్ది దశాబ్దాలుగా కొంతమంది బూర్జువా మేధావులు ప్రయత్నిస్తున్నారు. మార్క్స్ మౌలిక సూత్రాల విశ్వజనీక ప్రాధాన్యతను ప్రశ్నించి, దాని సమగ్రతను నాశనం చేసేందుకు వారి అన్వేషణ సాగిస్తున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగానే ఎంగెల్స్‌ను ఒక స్వతంత్ర సిద్ధాంతవేత్తగా పరిగణించరాదని, మార్క్స్ భావాలను సూక్ష్మీకరించిన వ్యక్తిగా మాత్రమే చూడాలని అంటున్నారు. మహా అయితే ప్రతిభావంతుడైన శాస్త్రీయ కమ్యూనిజం ప్రచారకుడు మాత్రమే.

ఈ విధమైన తీర్పులు ఎంగెల్స్ నిర్వహించిన పాత్రకు విరుద్ధమైనవి. శ్రామికవర్గ ప్రపంచ దృక్పథాన్ని రూపొందించటంలో, అంతర్జాతీయ విప్లవ కార్మికోద్యమాన్ని స్థాపించటంలో ఎంగెల్స్ చారిత్రాత్మక పాత్ర నిర్వహించారు. మార్క్స్.ఎంగెల్స్‌లు మధ్య విభజన గీత గీయటం నిష్ప్రయోజనకరమైనది. వారి సృజనాత్మక కృషి అవిభాజ్యమైనది. ఎంగెల్స్ ఒకగొప్ప శాస్త్రవేత్త; విప్లవకారుడు మార్క్స్‌తోకలసి ఆయన సాగించిన సిద్ధాంత, ఆచరణాత్మక కృషిలో యిది వ్యక్తమయింది.

శ్రామికవర్గ ప్రపంచ దృక్పథంను రూపొందించటంలో, అభివృద్ధి పరచటంలో తన పాత్రను గురించి ఎంగెల్స్ చెప్పిన మాటలు మనకు తెలుసు. తనను గురించి ఎంతో వినయాన్ని ప్రకటిస్తూ ఎంగెల్స్ యిలా అన్నారు. "మార్క్స్ ఒక మేధావి; యితరులం మేం ప్రతిభావంతులం." ఇక్కడ మనం ఎంగెల్స్‌తో కొంత విభేదాలువలసి వుంటుంది. ఆయన 'యితరుల' జాబితాలో లేడు. శాస్త్రీయ కమ్యూనిజం నిర్మాతలలో ఆయన ఒకరు. మార్క్స్ సహచరుడూ. మార్క్స్‌వలెనే ఆ స్థాయిగల భావుకుడు ఎంగెల్స్. భిన్నరూపంలో మార్క్స్‌వలె మేధావి. లెనిన్ చెప్పినట్టు "ఆధునిక సోషలిజం సిద్ధాంత కర్తలుగా మార్క్స్. ఎంగెల్స్‌లు ప్రక్క ప్రక్కనే వుంటారు.

మానవజాతి మేధో జీవితంలో మార్క్స్. ఎంగెల్స్‌లు, విప్లవాన్ని తెచ్చారు. కార్మికవర్గ చారిత్రక కర్తవ్యం వెల్లడించారు, శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించారు. ఆ తరువాత సిద్ధాంత రంగంలో జరిగిన. పోరాటాలన్నింటిలోనూ ప్రధాన వస్తువును మార్క్సిజం నిర్ణయాత్మకంగా ప్రభావితం చేసింది. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సిద్ధాంత సంబంధాలలో విజృంభణకు అది మార్గదర్శి అయింది "కమ్యూనిస్టు ప్రణాళిక" వెలువడిన నాటినుండి కార్మిక వర్గ శాస్త్రీయ ప్రపంచ దృక్పథం అసాధారణ రీతిలో విజయభేరి మ్రోగిస్తున్నది. కమ్యూనిస్టు పార్టీల నిర్విరామ కృషి ఫలితంగా మార్క్స్ ఎంగెల్స్‌ల భావాలు. ఆ తరువాత లెనిన్ భావాలు ప్రజల మనస్సులను ఆకట్టుకున్నాయి. దోపిడీకి వ్యతిరేకంగా సాగే పోరాటంలో అవి భౌతిక శక్తిగా మారాయి. చరిత్రచోదక శక్తులు ప్రజలే, కాని మార్క్సిజం అవతరణతో వారి పోరాటం నూతన విస్తృతి సంతరించుకుంది. మొదటిసారిగా వారు చైతన్యయుత చరిత్ర నిర్మాతలుగా మారారు. మార్క్స్, ఎంగెల్స్ భావాలను జీవితం నిత్యం ధృవీకరిస్తున్నది.

మార్క్సిజం వ్యతిరేకులు ఎన్ని శాపాలు పెట్టినా, అది చావలేదు. కనుకనే మార్క్సిజం సజీవంగా వుందనటానికి వారి విమర్శలు కూడా సాక్ష్యమే. మార్క్సిజంపై "ధర్మ యుద్ధం" ప్రకటించారు. "చరిత్ర చెత్తబుట్ట"లోకి దానిని

నెట్టేశాం అని ప్రకటించారు. అది గతంలోనూ సాధ్యం కాలేదు. నేడు సాధ్యంకాదు.

అమెరికా, నాటో దేశాలు అనుసరిస్తున్న సంఘర్షణ విధానం, ఆయుధ పోటీలతోపాటు సిద్ధాంత రంగంలో కన్సర్వేటివ్ ధోరణి ప్రబలుతున్నది. మార్క్సిజంపై విమర్శలో కూడ అది వ్యక్తమవుతున్నది. హేతురాహిత్యవాదం, సమాజం గురించిన కల్పనలు బహు ప్రచారం పొందుతున్నాయి. మార్క్సిజంను మత సిద్ధాంతంగా, అధికారంకొరకు సిద్ధాంతంగా చిత్రిస్తున్నారు. అది శాస్త్రీయ సిద్ధాంతం కాదంటున్నారు.

మార్క్సిజం వక్రభాష్యకారుల ప్రధాన దాడి, సమాజ పరిణామం గురించిన మార్క్స్, ఏంగెల్స్‌లు భావాలపై కేంద్రీకరించబడింది. పెట్టుబడిదారీ సమాజాన్ని సమరిస్తూ, దానిలోని చెడును మానవస్వభావ బలహీనతలకు వారు అంటగడు తున్నారు.

ఎంగెల్స్ సిద్ధాంత భావాలు, ఆయన విప్లవకర కృషి, ప్రభావం నేటికీ అంతర్జాతీయ పరిణామాలపై ప్రగాఢంగా వుంది. శాంతి సాధనకొరకు నిర్వహించ వలసిన పోరాటం గురించి ఆయన వుపదేశాలు నేటికీ మనకు మార్గదర్శకంగా వున్నాయి. శాంతి నేటి కాలపు ప్రధాన సమస్యగా వుంది. ఈ సమస్యపైన కూడ బూర్జువా సిద్ధాంతవేత్తలు అనేక వక్రీకరణలకు పూనుకున్నారు. యుద్ధం స్వభావం, దాని కారణాలు, లక్ష్యాలుతో నిమిత్తంలేకుండా ఏ యుద్ధమైనా శ్రామికవర్గ విప్లవ వ్యాప్తికి సాధనంగా వుంటుందని మార్క్స్, ఏంగెల్స్‌లు ప్రచారం చేసినట్లు వీరు ఆరోపిస్తున్నారు.

ఆ విధంగా సోవియట్ యూనియన్‌నుంచి యుద్ధ ప్రమాదం వుందనే సాకుతో కమ్యూనిజం వ్యతిరేకతను, సోవియట్ వ్యతిరేకతను వీరు బోధిస్తున్నారు. ఆయుధ నిల్వలకు పూనుకుంటున్నారు. యుద్ధానికి మూలకారణం ప్రైవేటు ఆస్తి. ప్రపంచ యుద్ధాలు ప్రారంభించినది పెట్టుబడిదారీ వ్యవస్థ అన్న వాస్తవాలను వీరు మరుగుపరుస్తున్నారు. నేడు అణు యుద్ధ ప్రమాదం అమెరికా సామ్రాజ్యవాదం నుండి ఏర్పడింది. యుద్ధాలు మార్క్సిజం సృష్టికావు, సోషలిజం తెచ్చినవికావు.

పెట్టుబడిదారీ విధానానికి యుద్ధ ప్రయత్నాలకు మధ్య సోషలిజం, శాంతి సంకల్పాల మధ్య గల సహజ సంబంధాలను ఎంగెల్స్ విశదీకరించాడు. "కమ్యూనిస్టు ప్రణాళిక" గ్రంథంలోని యీ సూత్రీకరణను పరిశీలించండి.

"ఒక వ్యక్తి మరో వ్యక్తిని దోపిడీచేసే విధానం అంతంచేయడం ఏ మేరకు సాధ్యమయితే, ఆ మేరకు ఒక జాతిని మరోజాతి దోపిడీచేయటం కూడ అంతమవు తుంది.

"ఒకే దేశంలో వర్గాల మధ్య వైరుధ్యం ఏ మేరకు అదృశ్యమవుతోందో, ఆ మేరకు ఒక దేశానికి వ్యతిరేకంగా మరో దేశం శత్రుత్వం కూడ అంతమవు తుంది."

శాంతికొరకు జరిగే పోరాటం సోషలిజం పోరాటంలో అంతర్భాగం. కార్మిక వర్గ చారిత్రక కర్తవ్యంనుండి దానిని విడదీయలేం.

1880 సంవత్సరం అనంతరం పెట్టుబడిదారీ దేశాల అసమానాభివృద్ధి కారణంగా యూరప్ దేశాల మధ్య ఆయుధపోటీ తీవ్రమవుతున్న పరిణామాన్ని ఏంగెల్స్ గమనించారు. యూరప్కు, ప్రపంచానికి యుద్ధప్రమాదం ఏర్పడుతున్నదని హెచ్చరించాడు. శాంతికొరకు సోషలిస్టులు నిలబడాలని విజ్ఞప్తి చేశాడు.

పెట్టుబడిదారీ విధానం అధికారంలో యింకా కొనసాగుతున్నప్పటికీ, యుద్ధ ప్రమాదం కారణాలను తొలగించటం లేదా పరిమితంచేయటం సాధ్యమేనని ఏంగెల్స్ తన వ్యాసాలలో, లేఖలలో పేర్కొన్నాడు. ఇది ప్రజా కార్యాచరణద్వారా, కార్మికవర్గం అగ్రగామిపాత్ర వల్లనూ సాధ్యమవుతుందని, దానికి కావలసిన సైద్ధాంతిక పరిస్థితులు సృష్టించాలని అన్నారు. వారిలో శ్రామికవర్గ అంతర్జాతీయత, సైనికతత్వ వ్యతిరేకత, నిర్మాణం భావాలను పెంపొందించవలసి వుంది.

ఏంగెల్స్ చనిపోవటానికి రెండు సంవత్సరాలముందు "యూరప్ నిరాయుధీకరణ సాధ్యమా?" అన్న కరపత్రం రచించారు. శాస్త్రీయ విశ్లేషణ ప్రాతిపదికగా నిరాయుధీకరణపై తయారుచేసిన మొదటి డాక్యుమెంటుగా దీనిని పరిగణించవచ్చు.

రాజకీయ, సైనిక శక్తుల ఏకీకరణ తీరు, తెన్నులు ఏంగెల్స్ లోతుగా పరిశీలించాడు, ఆ ప్రాతిపదికగా నిరాయుధీకరణ కార్యక్రమాన్ని ఆయన తయారు చేశాడు. దశలవారిగా నిరాయుధీకరణను సాధించగలమని, యిది ప్రజాస్వామ్యయుత కోర్కెగా ప్రజలను సమీకరించేందుకు కార్మికవర్గం చొరవతీసుకోవాలని ఏంగెల్స్ ఆనాడు చెప్పిన మాటలు నేటికీ ఎంతో ప్రాధాన్యతను కల్గియున్నాయి.

"యుద్ధం ప్రారంభం కాకమునుపే దానిని నిరోధించాలి"

యీ సూత్రంతో ఆయన కరపత్రం నిండివుంది.

* * * * *

గతి.తార్కిక - భౌతికవాద ప్రపంచ దృక్పథంలోని శాస్త్రీయతనుండి ఒక అద్భుతగుణం మార్క్సిస్టులకు ఎల్లప్పుడూ సాక్షాత్కారంఅవుతూఉంటుంది. మార్క్స్, ఎంగెల్స్ గ్రంథాలు ఎన్నిమార్లు చదివినా తిరిగి ఏదో ఒక కొత్తదనం వాటిలో కనుగొంటాం. గతసారి చదివినపుడు స్ఫురించని కొత్త భావం మనలో మెరుస్తుంది. మన కాలానికి సరిపోయిన ఆలోచనలు కనపడుతాయి. ఇది భౌతికవాద గతితర్కం సాధించిన విజయం. అది సిద్ధాంతమూ, అధ్యయనపద్ధతి కూడ. మార్క్స్, ఎంగెల్స్‌ల మహత్తర సృష్టి. మారుతున్న ప్రపంచం యొక్క సమస్యలు నూతన రూపంలో తలెత్తుతున్నాయి. వీటి పరిష్కారానికి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ గ్రంథాలు నిరంతర సమాలోచన మనకు తోడ్పడతాయి. ★

# స్వాతంత్ర్యం, సోషలిజం, శాంతి లక్ష్యాల బాటలో వియత్నాం

— ఫామ్ వాన్ డాంగ్

(పొలిట్ బ్యూరో సభ్యులు వియత్నాం కమ్యూనిస్టు పార్టీ, ప్రధానమంత్రి)

వియత్నాం జీవితంలో 1945 ఆగస్టు విప్లవం చారిత్రాత్మక మైలురాయిగా నిలుస్తుంది. ప్రజలపై సాగిన దోపిడీ, దమననీతి విధానాలను భూస్థాపితం చేశారు. జాతి స్వాతంత్ర్యం, ఐక్యత, సోషలిస్టు నిర్మాణం దశలో నాడు కాలు పెట్టినాం. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన శ్రమజీవులు పోరాటంవల్లనే యిది సాధ్యమైంది. మార్క్సిజం-లెనినిజం బోధన మార్గదర్శకంగా మేం పయనించాం.

వియత్నాం ప్రజల సుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటం ఫలితమే విప్లవం. మన యుగం ప్రధాన ధోరణి, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ భావాలు, అక్టోబరు విప్లవం అనుభవం, ప్రపంచ వ్యాపిత విప్లవ పోరాటం— వీటన్నింటితో వియత్నాం జాతీయోన్నత సంప్రదాయాలు మిళితమయినాయి. అందరి ప్రేమను, గౌరవాన్ని చూరగొన్న అధ్యక్షుడు హోచిమిన్ స్మృతిని వియత్నాం జాతి ఎల్లప్పుడూ స్మరించుకొంటోంది. ఈ శతాబ్దం ప్రారంభంలో ఆయన జాతి విముక్తికి బాట వేశారు. శ్రామికవర్గ విప్లవంలో ఆ బాటను ఆయన చూశారు.

జాతీయ ప్రజాస్వామిక విప్లవం పరిణామ క్రమంలో సోషలిస్టు విప్లవంగా మారుతుంది. పెట్టుబడిదారీ పరిణామ దశను అధిగమించటం ద్వారా యిది సాధ్యం. మా పార్టీ ప్రారంభంనుండి యీ మార్గాన్ని రూపొందించుకుంది.

వియత్నాం కమ్యూనిస్టు పార్టీ స్థాపన జరిగి 55 సంవత్సరాలు గడిచినాయి. ఆగస్టు విప్లవం విజయంపొంది 40 సంవత్సరాలు పూర్తయినాయి. వియత్నాం డెమోక్రటిక్ రిపబ్లిక్ ఏర్పడింది. జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజం పతాకం క్రింద

మా ప్రజలు సాగించిన త్యాగఫలమే యీ పరిణామాలు. మన యుగంలో యివి గొప్ప మార్పులు.

"తన్ను తాను రక్షించుకోలేని విప్లవం విలువలేనిది" కనుక తత్ సంరక్షణ కొరకు దానికొరకు వియత్నాం ప్రజలు తమ జీవితాలను, ఆస్తులను ఒడ్డారు.

శాంతి లక్ష్యానికి వియత్నాం ప్రజలు నిబద్ధులై వున్నారు. యుద్ధాలనుండి వారిని విముక్తి కల్పించాలని హోచిమిన్ అహర్నిశలు పాటుపడ్డారు. కాని మా దేశంపై దురాక్రమణదారు దాడిచేస్తే, వియత్నాం ప్రజలందరూ ఒక వ్యక్తిగా లేచి, విజయం సాధించేవరకు పోరాడారు.

ఫ్రెంచి దురాక్రమణదారుకు వ్యతిరేకంగా ప్రతిఘటనా యుద్ధంలోనూ, ఆ తరువాత అమెరికా దురాక్రమణదారుకు వ్యతిరేకంగానూ, వియత్నాం జాతి హోచిమిన్ నాయకత్వంలో మహత్తర త్యాగాలు చేసింది. అమెరికాతో పోరాటం వియత్నాం జాతి చరిత్రలోనే మహా ప్రతిఘటన యుద్ధంగా ప్రసిద్ధికెక్కింది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో వియత్నాం ప్రజల ధైర్య సాహసాలను, మేధాశక్తిని, సమీకరించటమేకాక, ప్రపంచ అభ్యుదయ శక్తుల సానుభూతిని, తోడ్పాటును కూడ పొందగలిగింది. అమెరికా, ఫ్రెంచి ప్రగతిశీల శక్తులు కూడ మా ఆశయాన్ని బలపరచారు. సైనిక, రాజకీయ, దౌత్య రంగాలలో వివిధ రూపాలలో అనేక పోరాటాలు నిర్వహించాం. మా బలం నిరంతరం పెరుగుతూ వచ్చింది. విజయం తరువాత విజయం సాధించుతూ వచ్చాం. ప్రజలతో రక్షణ బలాల సంబంధాలు పెరిగాయి. పోరాటంలో సైనిక కళ నిగ్గుతేలింది.

ఫ్రెంచి దురాక్రమణదారు ఓడిపోవటంతో వలసవాదానికి ఆయువు మూడింది. అమెరికా దురాక్రమణదారు ఓడిపోవడంతో నయా వలసవాదానికి పెద్ద దెబ్బతగిలింది. సామ్రాజ్యవాదం బలహీనపడటంతో ప్రపంచ విప్లవ శక్తులు బలపడినాయి. ప్రపంచ బలా బలాలలో మార్పుకు అది దోహదం చేసింది. 30 సంవత్సరాలపాటు యీ ప్రతిఘటనా యుద్ధం జరిగింది. "స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకంటే విలువైనది ఏదీ లేదు".

గత మే నెలలో మా దేశంలోనూ, ప్రపంచంలోనూ అమెరికా దురాక్రమణపై వియత్నాం విజయం దశ వార్షికోత్సవాన్ని జరుపుకున్నాం. అమెరికా అన్యాయ యుద్ధం, వియత్నాంలో దాని ఓటమి అమెరికా జాతిపైన, జీవితంపైన బలమైన గాయాల్ని మిగిల్చింది. నాటి విజయం చారిత్రక ప్రాధాన్యత నేడు మరింత స్ఫుటంగా కనిపిస్తున్నది.

వియత్నాం ఏకీకరణ జరిగింది. దేశ ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి కర్తవ్యా లను పరిష్కరించవలసి వుంది. సోదర లావోస్, కంపూచియా దేశాలతో స్నేహం పెంపొందించుకొన్నాం. దేశం ఉత్తర, దక్షిణ ప్రాంతాలలో, పొలాల్లో, ఫ్యాక్టరీ లలో, కార్యాలయాలలో, సముద్రతీరాలలో పునర్నిర్మాణ గీతం ఆలాపించబడు తున్నది. శాంతియుత, స్వేచ్ఛాయుత, సోషలిస్టు వియత్నాం పురోగమిస్తున్నది. పసిఫిక్ తీరంలో శాంతి, సోషలిజంల స్థావరంగా అది వుంది.

అయితే, ఒక వాస్తవాన్ని గుర్తించవలసి వుంది. పెకింగ్ ప్రభుత్వ విస్త రణవాద లక్ష్యాలగురి వియత్నాంపై వుంది. మా సరిహద్దులపై అది దురాక్రమణ చర్యలకు పాల్పడింది. ఆక్రమిత సరిహద్దు భూభాగాలపై తన అధికారాన్ని నెల కొల్పుతున్నది పెద్దఎత్తున విధ్వంసక కార్యక్రమం సాగిస్తున్నది. ఆగ్నేయాసి యాపై దండయాత్రకు సిద్ధమవుతున్నది. ఉభయ దేశాల మధ్య సాధారణ సంబం ధాల స్థాపనకు వియత్నాం చేసిన శాంతి ప్రతిపాదనలను పెకింగ్ పాలకులు నిరాక రిస్తున్నారు. కాని యీ పంథాను మేం కొనసాగించ నిర్ణయించుకున్నాం. వియ త్నాం, చైనా ప్రజల మధ్య స్నేహానికి మేం కట్టుబడి వున్నాం.

జాతీయ ప్రజాస్వామిక, సోషలిస్టు విప్లవాల కారణంగా ఉత్తర వియత్నాం రూపం మారింది. ఆకలి, నిరక్షరాస్యత విదేశీజోక్యం పోయినాయి. అమెరికా దురా క్రమణకు వ్యతిరేకంగా న్యాయ యుద్ధానికి స్థిరమైన పునాది ఏర్పడింది. పోరాటం పూర్తి విజయంతో వియత్నాం ఏకీకరణ జరిగింది. వియత్నాం సోషలిస్టు రిపబ్లిక్ ఏర్పడింది. విప్లవ పురోగమనంతో యిది సాధ్యమయింది.

చిన్న స్థాయి వుత్పత్తి ప్రధానాంశంగా వున్న దేశంలో సోషలిజం పురోగ మనం ఎంత కష్టసాధ్యమయినదో వివరించ నక్కరలేదు. 30 సంవత్సరాల నిరం తర యుద్ధాలు, శత్రువులచే ఆస్తి విధ్వంసన, ప్రకృతి నష్టాల నీడలో మేం పయ నించవలసవచ్చింది. గత పది సంవత్సరాల కాలంలో కష్టాలను అధిగమించాం.

1976 లో జరిగిన పార్టీ మహాసభ వియత్నాం వర్కర్స్ పార్టీని కమ్యూ నిస్టు పార్టీగా పేరు మార్చింది. 1982 లో పార్టీ 5 వ మహాసభ సోషలిజం పరివర్త నకు విధానాన్ని నిర్దేశించింది.

వలస పాలనలో వందల సంవత్సరాలు మగ్గిన అనంతరం వియత్నాం సామా జిక రంగాలన్నింటినీ పునర్ వ్యవస్థీకరించడం అంటే లక్షలాది ప్రజల ఆలోచ నను, జీవిత విధానాన్ని మార్చాలి. మా దేశ దక్షిణ ప్రాంతంలో, హోచిమిన్ నగరం, యితర ప్రాంతాలలో వచ్చిన మార్పులు చాల ఆశ్చర్యాన్ని కలిగించేవిగా వున్నాయి. విముక్తి అనంతరం 10 సంవత్సరాల కాలంలో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక మార్పులు ఎవరినైనా ముగ్ధులను చేస్తున్నాయి.

దోపిడీ వర్గాలు మొత్తంమీద అంతరించి పోయినాయి. మెజారిటీ రైతులు, శ్రమజీవులు సమిష్టి శ్రమతో భాగస్వాములయ్యారు. సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు బలపడుతున్నాయి. వ్యవసాయం, పరిశ్రమలలో గణనీయమైన అభివృద్ధి సాగింది. ఆర్థిక వ్యవస్థ యొక్క సాంకేతిక పునాది విస్తరించింది భారీ పరిశ్రమలు నిర్మాణంలో వున్నాయి. విద్యా, సాంస్కృతిక స్థాయి వేగంగా పెరుగుతున్నది. పరిపాలనా వ్యవస్థలో ప్రజలు చురుకుగా పాల్గొంటున్నారు.

సామ్రాజ్యవాద శక్తులు, అభివృద్ధి నిరోధకుల విచ్ఛిన్న కార్యకలాపాలు, యితర అవరోధాలు లేని పక్షంలో మా విజయాలు యింకా గొప్పగా వుండేవి విప్లవాన్ని పీల్చి పిప్పిచేయాలనే కుట్ర సాగుతూనే వున్నది. కాని విప్లవాన్ని బలపడుతున్నది.

సోషలిస్టు నిర్మాణం, ఆర్థిక మేనేజిమెంటు రంగాలలో కొన్ని పొరపాట్లు దొర్లినాయి. దాని కారణంగా ప్రతికూల పరిణామాలు సంభవించాయి. యిటీవల కాలంలో యీ లోపాలను సవరించుకుంటున్నాం. పార్టీ కార్యకర్తల సిద్ధాంత, ఆచరణాత్మక స్థాయిని పెంచటం ద్వారా యీ బలహీనతలను అధిగమించుతున్నాం. మొత్తం ప్రజానీకంలో శాస్త్రీయ సోషలిజం దృష్టి బలపడేందుకు కృషిచేస్తున్నాం. ఆర్థిక వ్యవస్థ యొక్క వాస్తవ స్థితిని ప్రజలు గ్రహించేందుకుగాను పార్టీ ప్రయత్నిస్తున్నది.

రెండు వ్యూహాత్మక లక్ష్యాలకొరకు మేం ప్రస్తుతం కేంద్రీకరించి పనిచేస్తున్నాం. సోషలిజం నిర్మాణం; దేశ రక్షణ. రానున్న సంవత్సరాలలో ఆర్థిక స్థితిని సమగ్రంగా స్థిరీకరించేందుకు, శ్రమ ఉత్పాదకతను పెంచేందుకు, జాతీయాదాయాన్ని ఎక్కువ చేసేందుకు మేం కృషి చేయవలసి వుంది. మేం మూడు విప్లవాలపై కేంద్రీకరించాం. ఉత్పత్తి సంబంధాలు, శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం, సిద్ధాంతం, సంస్కృతి రంగాలలో, విప్లవం సాధించటం మా లక్ష్యం.

"పార్టీ నాయకత్వం వహిస్తుంది. ప్రజలు, పాలకులుగా హక్కులను వినియోగిస్తారు; ప్రభుత్వం పరిపాలిస్తుంది," ఈ సూత్రాన్ని అన్ని స్థాయిల్లోనూ ప్రవేశపెట్టుతున్నాం; వివరించుతున్నాం; సామాజిక జీవిత రంగాలన్నింటిలో యిది వర్తింపచేస్తున్నాం.

ప్రజలే చరిత్ర నిర్మాతలు వారు క్రియాశీలురు; వారే మా ఆస్తి. నూతన సంస్కృతి పెంపుదలకు మేం కృషిచేస్తున్నాం. "ఒకరి కొరకు అందరం; అందరి కొరకు ఒకరు" అనే ఉన్నత ఆదర్శం కొరకు సమాజంలోని ప్రతి ఒక్కరిని తీర్చిదిద్దేందుకు మా ప్రయత్నాలు కొనసాగుతూనేవున్నాయి.

సోషలిస్టు విప్లవ లక్ష్యం యావన్మంది లక్ష్యం కావాలి; "ప్రతి ఒక్కని స్వేచ్ఛాభివృద్ధి, యావన్మంది స్వేచ్ఛాభివృద్ధికి ప్రాతిపదిక" అన్న మార్క్స్ ఎంగెల్స్‌ల మహత్తర సూత్రీకరణ వాస్తవరూపం దాల్చాలి.

అంతర్జాతీయ రంగంలో వియత్నాం ప్రజలు విశ్వశాంతి కొరకు నిర్విరామ పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. అణ్వస్త్ర ఆయుధ పోటీకి అమెరికా సామ్రాజ్య వాదం అగ్నిలో ఆజ్యం పోసినట్టుగా, వ్యవహరిస్తున్నది. భూతలంపై మానవ కోటికి ప్రమాదం ఏర్పడింది. తాను కోల్పోయిన స్థానాలను నిలబెట్టుకునేందుకు యుద్ధ వుద్రిక్తతలను సృష్టిస్తున్నది. కనుకనే నేటి పరిస్థితులలో శాంతి పరిరక్షణ అతి ప్రధాన సమస్యగా మారింది.

సోవియట్ యూనియన్ నాయకత్వానగల సోషలిస్టు దేశాలు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, జాతీయ విముక్తి వుద్యమం, శాంతి పరిరక్షణకు ప్రధాన అండగా నిలిచాయి. సోవియట్ శాంతి చొరవను వియత్నాం పూర్తిగా బల పరుస్తోంది.

సమిష్టి లక్ష్యం కొరకు సాగే పోరాటంలో సోదరులకు, స్నేహితులకు సహాయపడటం అంటే తనకుతాను సహాయపడటమే కాగలదు. కంపూచియా ప్రజ లకు మా తోడ్పాటు వుంది. పోల్‌పాట్ ప్రభుత్వం కూలిపోయిన తరువాత ఆ దేశం కోలుకుంటున్నది. చైనా విస్తరణవాదుల కీలుబొమ్మలు దేశం వెలుపలకు గెంటి వేయబడ్డారు. వియత్నాం, లావోస్, కంపూచియాల మధ్య పొత్తు, ఆ దేశాల విప్ల వాల బంధం దృఢతర మవుతున్నాయి. కంపూచియాకు వియత్నాం అందిస్తున్న సహాయం అంతర్జాతీయవాదానికి, మానవ వాదానికి ఒక మచ్చుతునక. ఇండో చైనా మూడు దేశాల జాతీయ హక్కులను గౌరవించే ప్రాతిపదికగా నిజాయితీతో కూడిన సంభాషణ అన్నిపక్షాల మధ్య జరగటం ద్వారానే కంపూచియా సమస్య రాజకీయంగా పరిష్కారంకాగలదని నేడు ప్రపంచంలోని అనేకమంది భావి స్తున్నారు

మా విజయంలో ప్రధాన అంశం వియత్నాం కమ్యూనిస్టుపార్టీ కృషి. మన యుగం మనస్సు, గౌరవం, అంతరాత్మ కమ్యూనిస్టుపార్టీయే. మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాన్ని వియత్నాం దేశ ప్రత్యేక పరిస్థితులను అన్వయించి సృజ నాత్మకంగా దానిని అభివృద్ధిచేస్తున్నాం. పార్టీ నిర్మాత, బోధకుడు హోచిమిన్. శ్రామికవర్గ అంతర్జాతీయతతో దేశభక్తియుత సాంప్రదాయాలను పార్టీ సమ్మిళితం చేసింది. వియత్నాం విప్లవానికి, సాధారణ సోషలిస్టు విప్లవానికి అది లింకు. ప్రజల విశ్వాసాన్ని మా పార్టీ చూరగొన్నది. నాడు అజ్ఞాతవాస కాలంలోనూ,

నేడు సోషలిజం నిర్మాణంలోనూ ప్రజలతో దాని సంబంధాలు అభేద్యమైనవి. శ్రామికవర్గ అంతర్జాతీయతకు అది కట్టుబడి వున్నది.

"సకల దేశ కార్మికులారా, అణగారిన ప్రజలారా, ఐక్యం కండు !" లెనిన్ యిచ్చిన యీ నినాదం మాకు శిరోధార్యం. మా దేశ ప్రయోజనాలకు, మానవజాతి సుఖానికి మా కృషి అంకితమయింది, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలబడే ప్రజలలో మేం చేతులు కలుపుతున్నాము. కష్టాలలో వున్న సోదరులతో మాకున్న కొద్దిపాటి తిండిగింజలు, బట్టలు పంచుకుంటున్నాం. జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజం పతాకం క్రింద వియత్నాం విజయాలు సాధిస్తున్నది ప్రపంచ ప్రజల విప్లవ లక్ష్యానికి మేం అందిస్తున్న సేవ యిది. ★

చరిత్ర పుటలు

# క్యూబా కమ్యూనిస్టుల ప్రథమ పార్టీ

ఆగస్టు 16 వ తెది క్యూబా విప్లవోద్యమ చరిత్రలో చిరస్మరణీయమైనది. దేశంలో మొదటి మార్క్సిస్టుపార్టీ - లెనినిస్టుపార్టీ స్థాపన జరిగి 60 సంవత్సరాలు నిండాయి.

1959 జనవరి 1 వ తేదీన క్యూబా విప్లవం విజయం పొందింది. దేశంపై అమెరికా సామ్రాజ్యవాద పెత్తనాన్ని అంతం చేసింది. ఈ ఖండానికి సోషలిజం తెచ్చింది. దేశంలో మానవుని దోపిడీని అంతంచేసింది.

ఈ విజయాలన్నింటిలో శ్రామికవర్గ మొదటి రాజకీయపార్టీ పాత్ర ఏమిటి? ఆ పార్టీకి దేశంలో నేడు పాలిస్తున్న పార్టీకి మధ్య కొనసాగింపు దేనిలో ఎక్కడ వుంది ? యితర దేశాలలోని అతివాద-మితవాద, రివిజనిస్టులు, చారిత్రక సత్యాలను వక్రీకరిస్తున్నారు.

క్యూబా కమ్యూనిస్టుపార్టీ ప్రథమ మహాసభ నివేదికలో పార్టీ పుట్టుక పూర్వ రంగం గురించి పేర్కొన్న భాగాన్ని యిక్కడ యిస్తున్నాం.

"అక్టోబరు విప్లవం ప్రభావంతో, కమ్యూనిస్టులు కార్లోస్ బెలి, ఆంటో నియోమెల్లా నాయకత్వంలో ఆదర్శవంతమైన, వివరణాత్మక కృషిచేశారు. మార్క్సిజం - లెనినిజంను ప్రచారం చేశారు. రాజకీయ చైతన్యం మొగ్గతొడుగుతున్న అనేకమంది యువకులను వారు ఆకర్షించారు. విప్లవకర గ్రంథాలు, సాహిత్యం, చారిత్రక ఘటనలు ప్రముఖ పాత్ర వహించాయి మార్క్స్ ఎంగెల్స్, లెనిన్ బోధనలలోని సత్యాన్ని ప్రజలు తెలుసుకొనే రోజు వస్తుంది. ఈ కాలంలో, మన దేశ నిర్దిష్ట పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని నూతన విప్లవకారులు ఆ బోధనలను వ్యాఖ్యానించాలి; వర్తింపచేయాలి"

* కార్లోస్‌బెలివో (1848 - 1926), జోస్‌మార్తితో కలసి క్యూబా విప్లవ పార్టీని స్థాపించారు, స్పానిష్ వలస దాస్యం నుండి స్వాతంత్ర్యం కొరకు పోరాడారు.

* అంటోనియామెల్లా (1903 - 1929) క్యూబా, దక్షిణ అమెరికా యువజన, కార్మికోద్యమ నాయకుడు, క్యూబా కమ్యూనిస్టుపార్టీ స్థాపనలో ముఖ్యుడు. ఆయన చొరవతోనే విశ్వ విద్యాలయ విద్యార్థి ఫెడరేషన్ ఒక మహా సభను నిర్వహించింది. సోవియట్ యూనియన్‌కు మద్దతు ప్రకటించింది. విద్యార్థి వుద్యమం, ట్రేడ్ యూనియన్ ఉద్యమం మధ్య సంబంధాలు పెరగటంతో విశ్వ విద్యాలయంలో మార్క్సిజం భావాలు వ్యాప్తిచెందాయి. జులై 26 ఉద్యమ నాయకులు పలువురు మార్క్సిజం ఓనమాలు యిక్కడే దిద్దుకున్నారు. ఈ సందర్భంలో క్యూబా కమ్యూనిస్టు పాబ్లోట్రా విద్యార్థులపై కల్గించిన ప్రభావం స్మరించదగినది. ఆయన స్పెయిన్‌లో అంతర్యుద్ధంలో అసువులు బాసారు.

ప్రారంభం నుండి కమ్యూనిస్టుపార్టీపై నిషేధం ఉంది. ఆనాడు మచాడో నియంతృత్వం పడగవిప్పింది. పెట్టుబడిదారీ ప్రపంచంలో ఫాసిజం అధికారం లోకి వస్తున్నకాలం. క్యూబాలో కమ్యూనిస్టులను హింసించడం, జైళ్ళల్లో నిర్బంధించటం ఎక్కువ ఉంది. 1926 లో బాలినో చనిపోయారు. అది ఆయన విచారణకు సన్నాహాలు జరుగుతున్నకాలం మూడు సంవత్సరాల అనంతరం మెల్లాను మెక్సికోలో సామ్రాజ్యవాద ఏజెంట్లు హత్య చేశారు.

కఠోర నిర్బంధం వున్నప్పటికీ పార్టీ పెరుగుతున్నది. కార్మికుల, రైతుల, పట్టణ మధ్య తరగతుల సానుభూతిని పార్టీ పొందుతున్నది. ఆనాటి పార్టీకి రుబెన్ మార్టినెస్‌విల్లినా నాయకత్వం వహించారు. 1933లో ప్రజల విప్లవపోరాటం, కార్మికుల సాధారణ సమ్మె ఫలితంగా మచాడో నియంతృత్వం పతనమయింది నూతన ప్రభుత్వం ఏర్పడింది. కాని అది ప్రజా విప్లవానికి ద్రోహంచేసి, సామ్రాజ్యవాదులకు, భూస్వాములకు లొంగిపోయింది. కమ్యూనిస్టుపార్టీపై నిషేధం కొనసాగింది.

"1933 అనంతరం పార్టీ శ్రేణులు బలపడినాయి. స్పెయిన్‌లో అంతర్యుద్ధం ప్రారంభమయినప్పుడు పార్టీ నికరమైన అంతర్జాతీయతా సూత్రాలకు కట్టుబడివుంది. స్పానిష్ రిపబ్లిక్ సంరక్షణకు వెయ్యిమంది పోరాట యోధులను పంపింది. శ్రామికవర్గ అంతర్జాతీయతావాదం చరిత్రలో యిది ఒక ముఖ్య అధ్యాయంగా వుంటుంది" అని ఫైడల్ కాస్ట్రో అన్నారు.

క్యూబాలో ప్రజాతంత్ర వుద్యమం పెరగటం, ఫాసిస్టు వ్యతిరేక ఐక్య సంఘటన ఎత్తుగడలను సృజనాత్మకంగా క్యూబా కమ్యూనిస్టులు రూపొందించటం కారణంగా 1938 లో పార్టీ చట్టబద్ధ సంస్థగా మారింది. 1940 లో ఆ పార్టీ రివల్యూషనరీ యూనియన్‌తో విలీనం అయింది. మార్క్సిజం - లెనినిజం సిద్ధాంత సూత్రీకరణలు, నిర్మాణ సూత్రాల ప్రాతిపదికగా ఐక్యతను సాధించారు. కొత్త

పార్టీ పేరు రివల్యూషనరీ కమ్యూనిస్టు యూనియన్. అది రాజ్యాంగసభ ఎన్నికలలో పాల్గొంది.

1944 నాటికి పరిస్థితులలో యింకా మార్పులు వచ్చాయి. ఫాసిస్టు వ్యతిరేక పోరాటం పెద్దదయింది. క్యూబాలోని సంస్కరణవాద గ్రూపులలో సంక్షోభం ఏర్పడింది కార్మికులలో సోషలిస్టు చైతన్యం పెరిగింది. పార్టీ పేరును మార్చారు. పీపుల్స్ సోషలిస్టు పార్టీగా నామకరణం చేశారు.

1952 లో బాటిస్టా నాయకత్వాన అభివృద్ధి నిరోధక కుట్ర జరిగింది. అప్పటి వరకు అధికారంలో వున్న ప్రభుత్వం కమ్యూనిస్టులను తీవ్ర నిర్బంధకాండకు గురిచేసినా, రాజ్యాంగ వ్యవస్థకొరకు, పౌరసత్వ హక్కులకొరకు పార్టీ పిలు పిచ్చింది. అధికారంలోకి వచ్చిన సైనిక ముఠా సామ్రాజ్యవాద అనుకూల, జాతి వ్యతిరేక స్వభావాన్ని పార్టీ బహిర్గతం చేసింది. నియంతృత్వానికి వ్యతిరేకంగా ప్రజల ఐక్యతకు, పోరాటానికి పార్టీ పిలుపిచ్చింది

బాటిస్టా నియంతృత్వాన్ని కూల్చే పోరాటంలో భాగంగా 1953 జులై 26 వ తేదీన మొంకాడా సైనిక కేంద్రాలపై దాడి జరిగింది. దీనిలో ప్రధానపాత్ర "కొత్త కమ్యూనిస్టులది."

జులై 26 ఉద్యమం (కాస్ట్రో నాయకత్వానగల సంస్థ - అను) వల్లనే యీ విజయం సాధించడం జరిగింది. మార్క్సిస్టు - లెనినిస్టులు విప్లవం విజయం కొరకు అనేక త్యాగాలు చేశారు. 1957 మార్చి 13 న అధ్యక్షభవనంపై రివల్యూషనరీ డైరక్టరేట్ యోధులు దాడిచేశారు.

భయోత్పాతం, హింసించటం, సిద్ధాంత ఒత్తిడి, నిందలు—ఏవీ కమ్యూనిస్టు లను లొంగదీయలేక పోయినవి. అజ్ఞాతవాసంలోనూ, చట్టబద్ధంగానూ, వారు నిజాయితీగానే నిలబడ్డారు. నేడు అధికారపదవులలోవున్నా ఎట్టి మచ్చా లేకుండానే వున్నారు.

కార్మికవర్గాన్ని, ప్రజలను చైతన్య పరచటానికి కమ్యూనిస్టు పార్టీ అద్భుత కృషి సల్పింది ప్రజల ప్రయోజనాలకు, ప్రగతిశీల చట్టాలను అమలు పరచేందుకు తీవ్ర కృషి చేసింది.

మొదటి మార్క్సిస్టు - లెనినిస్టు సంస్థ కొన్ని తప్పులను కూడ చేసింది. వాటిని బహిరంగంగా, ఆత్మవిమర్శన తీరులో అంగీకరించింది వాటిని సరిదిద్దుకునే చర్యలను తీసుకుంది. కాని చరిత్రలో ఎన్నడూ అది ద్రోహం చేయలేదు. అవకాశ వాదులతో రాజీపడలేదు. పార్టీ ప్రారంభంలో దాని సభ్యత్వం 100 కు మించి లేదు.

ఫైడల్ కాస్ట్రో చెప్పినట్టుగా 1959 జనవరి 1 న బాటిస్టా నియంతృత్వాన్ని క్యూబా విప్లవకారులు కూలద్రోసినా అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా యింకా పెద్ద పోరాటం సాగించవలసివుంది. అంతేకాదు; ప్రజలలో పాతుకుని వున్న కమ్యూనిస్టు వ్యతిరేక దురభిప్రాయాలను పెకలించే పోరాటం జరగాలి. "సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, కమ్యూనిజం వ్యతిరేక దురభిప్రాయాలకు ప్రతిగా, అభివృద్ధి నిరోధక భావాలకు వ్యతిరేకంగా, సి. ఐ. ఏ. విధ్వంసక చర్యలకు వ్యతిరేకంగా, విభిన్న సంస్థలకు చెందిన విప్లవకారులైన మేం పోరాడాం, ప్రథమంలో మా కార్యక్రమాన్ని సమన్వయం చేసుకున్నాం. ఐక్యత ఆ తరువాత వచ్చింది. మార్క్సిజం - లెనినిజం సూత్రాల ప్రాతిపదికగా మేం "ఐక్యమయినాం"
—(కాస్ట్రో).



సిద్ధాంత సమస్యలు

# ప్రపంచ విప్లవ క్రమంలో ప్రధానాంశం

—ఒ. వ్లదిమీరవ్

26 వ మహాసభ తర్వాతి కాలంలో సైద్ధాంతిక, ఆచరణాత్మక కార్యకలాపాలను కమ్యూనిస్టుపార్టీ ముమ్మరంగా సాగించింది. మహాసభ తీర్మానాలూ, ఆ తర్వాత జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీసమావేశాల తీర్మానాలూ నూతన సైద్ధాంతిక, రాజకీయ నిర్ధారణలతో మార్క్సిజాన్ని - లెనినిజాన్ని సుసంపన్నం చేశాయి; సోవియట్ యూనియన్ సమాజ, సోషలిస్టు కుటుంబ, అంతర్జాతీయ సంబంధాల అభివృద్ధికి చెందిన కీలకమైన విషయాలకు వర్తించేవి యీ నిర్ధారణలు.

అంతర్జాతీయ జీవిత ప్రధానాంశమూ, సోషలిస్టు కుటుంబానికి వెన్నెముకగా గల ప్రపంచ సోషలిస్టు వ్యవస్థా—యివి విప్లవ క్రమంలో అత్యంత ముఖ్యమైన వర్గశక్తిగా వ్యక్తమౌతున్నాయి.

1985 ఏప్రిల్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి ఎం. ఎస్. గర్బచ్యేవ్ యిలా పేర్కొన్నారు: "సోదర సోషలిస్టు దేశాలతో సహకారాన్ని మరింత మెరుగుపరచుకుని సంపన్నవంతం చేసుకోవడం, సర్వతోముఖ సంబంధాలను అభివృద్ధిపరచుకోవడం; రాజకీయ, ఆర్థిక, సైద్ధాంతిక, రక్షణ, తదితర రంగాల్లో వాటి సన్నిహిత సహకారానికి హామీకల్పించడం; ఈ మహత్తర కుటుంబంలోని అన్ని సభ్యదేశాల జాతీయ, అంతర్జాతీయ ప్రయోజనాలను అంగాంగికంగా మేళవించడంపట్ల శ్రద్ధకనబర్చడం—యివన్నీ మనకు నానాటికీ ముఖ్యమైన కర్తవ్యాలుగా రూపొందుతున్నాయి.

చైనా ప్రజారిపబ్లిక్‌తోసహా యితర సోషలిస్టు దేశాలతో సంబంధాలను పటిష్ఠం చేయడానికై, సహకారాన్ని అభివృద్ధి చేయడానికై సోవియట్ యూనియన్ నిలకడగా కృషిచేస్తోందని ప్లీనరీ సమావేశం పేర్కొంది.

* * *

ప్రపంచ సోషలిస్టువ్యవస్థ ఆవిర్భవించి, సోషలిస్టు రాజ్యాల కుటుంబం ఏర్పడటం ప్రారంభమై యిప్పటికి నాలుగు దశాబ్దాలకన్నా తక్కువకాలమే గడిచింది. నలభై సంవత్సరాలు స్వల్పకాలమే. అయినప్పటికీ, సోదర దేశాలు సాధించిన విజయాలనూ, సోషలిస్టు వ్యవస్థలోని సహజ సాధారణ నియమాలను పాటించడంపై ఆధారపడిన ఆ వ్యవస్థకుగల చారిత్రక ఆధిక్యతలనూ, యీ కాలం సందేహానికి యేమాత్రం తావులేకుండా ధ్రువీకరించింది.

సోషలిస్టు కుటుంబమనేది ప్రపంచ సోషలిజానికి లభించిన మహత్తర విజయం. దాని సభ్యదేశాలు కలిసి స్థాపించుకున్న అంతర్జాతీయ సంస్థల్లో (వార్సా సంధి సంస్థ, పరస్పర ఆర్థిక సహాయ సమితి) అవి భాగస్వాములు; అవి అంతర్జాతీయ సంబంధాలకు చెందిన ప్రధాన సమస్యల విషయంలో కార్యాచరణను సమన్వయ పరుస్తున్నాయి; ద్వైపాక్షికంగా, బహుపాక్షికంగా సహకారాన్ని అభివృద్ధి చేస్తున్నాయి. మార్క్సిజం-లెనినిజం, సోషలిస్టు అంతర్జాతీయత, వర్గ సంఘీభావం స్నేహసహకారాలు, పరస్పర విశ్వాసం, పరస్పర సోదర సహాయం, సమానత, సార్వభౌమాధికారం అనే సూత్రాలపై యీ సంబంధాలు ఆధారపడి వున్నాయి. దేశాల మధ్య నిజమైన సోదర సంబంధాలకు సోషలిస్టు కుటుంబం ఆదర్శప్రాయంగా వుంది.

విదేశాంగ విధానంలో లెనినిస్టు సూత్రాలను నిలకడగా సమర్థిస్తున్న సోషలిస్టు రాజ్యాల కుటుంబం వునికి శాంతికీ, అంతర్జాతీయ భద్రతకూ అత్యంత అనుకూల అంశమని మన పార్టీ పదే పదే నొక్కి చెప్పింది. సోషలిజాన్ని ఆర్థికంగా నిర్వీర్యపరచే సామ్రాజ్యవాద పథకాలను సోషలిస్టు కుటుంబంలోని దేశాలు సంయుక్తంగా భగ్నం చేస్తున్నాయి. ఈ దేశాలు సమైక్యంగా వ్యవహరిస్తూ అమెరికాకు, దాని బంధుదేశాలకు సైనిక, వ్యూహాత్మక సమతూకాన్ని తమకు అనుకూలంగా మార్చుకునేందుకు అవకాశమివ్వలేదు లేదు; యివ్వవు కూడా.

నాటో కూటమి యిప్పుడు తలపాటును తీవ్రతరం చేస్తోంది కాబట్టి, సోదర దేశాలు తమ సమన్వయీకృత శాంతియుత విదేశాంగ విధానాన్ని అమలు జరుపుతూనే వుండాలని, తమ దేశాల ప్రజల శాంతియుత కృషిని పరిరక్షించడానికి తోడ్పడగల విశ్వసనీయమైన రక్షణ కవచాన్ని పటిష్ఠం చేస్తూనే వుండాలని కృతనిశ్చయంతో వున్నాయి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఈ పంథాను దృఢంగా అనుసరిస్తోంది. 1985 మార్చిలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం ఇలా ప్రకటించింది : మన మాతృ దేశ, దాని బంధు దేశాల ప్రయోజనాలను మనం ఎన్నటికీ విస్మరించబోమని ప్రతి ఒక్కరూ గ్రహించాలి."

సోషలిస్టు దేశాల కుటుంబం అనేక ప్రధాన సమస్యలను యెదుర్కొం టోంది. సోషలిజం సాధించిన విజయాలనూ, విలువలనూ సామ్రాజ్యవాద దాడుల నుండి రక్షించడం; పటిష్టమైన శాశ్వత శాంతికోసం, అంతర్జాతీయ భద్రత కోసం వుద్యమం సాగించడం; రాజకీయ సహకారాన్ని మరింత మెరుగుపర్చడం; ఆర్థిక ఏకీకరణకు తాజా ప్రేరణ నివ్వడం—యివి యీ కర్తవ్యాల్లో వున్నాయి. సంక్లిష్ట అంతర్జాతీయ పరిస్థితి నెలకొనివున్న తరుణంలో సోషలిజం తన ఆర్థిక, సామాజిక వ్యవస్థలకు, జీవనసరళికి, సిద్ధాంతానికి గల ఆధిక్యతలనూ, పటిమనూ స్పష్టంగా, సందేహానికి తావులేకుండా ప్రదర్శిస్తోంది. మన కుటుంబాన్ని కలుపు తున్న అనుబంధాలను సామ్రాజ్యవాదం దుర్బలం చేయలేదనేది అను భవంలో కూడా పూర్తిగా రుజువైన మరొక నిర్ధారణ. ఇందుకు భిన్నంగా వాటి మధ్య సహకారం మరింత సన్నిహితం, మరింత ప్రగాఢం అవుతోంది.

మొత్తంమీద సోషలిస్టు ప్రపంచం విషయానికొస్తే అది వైవిధ్య పూరితమైనది, సంకీర్ణమైనది. ఏదో ఒక సమస్యపై అనుసరించే వైఖరిలో భిన్న దశలు, భిన్నాభిప్రాయాలు అందులో లేకపోలేదు. దీన్ని అర్థం చేసుకోవచ్చు; ఎందుకంటే ఎంతో వ్యత్యాసంగల ప్రారంభ దశలనుండీ, రాజకీయ, సామాజిక రాజకీయ అభివృద్ధి స్థాయిలనుండీ మన దేశాలు ముందుకు సాగాయి. బాహ్య అంశాలు కూడా ఏమంత అనుకూలంగా వుండేవికావు; అంతర్జాతీయ రంగంలో జరిగిన భీషణ వర్గపోరాట క్రమంలో సంబంధాల నూతన రూపాలను పరిరక్షిం చడం జరిగింది. పాలక కమ్యూనిస్టు పార్టీల విధానంపై, వుత్పన్నమయ్యే సమస్య లకు నిర్మాణాత్మకమైన పరిష్కారాలను అన్వేషించడంపై యిది చాలావరకు ఆధారపడి వుండిందనీ, యిప్పటికీ ఆధారపడి వుంటోందనీ చెప్పాల్సి వుంది. ప్రమాదకరమైన వుద్రిక్త అంతర్జాతీయ పరిస్థితి వున్నట్టి తరుణంలో, సామ్రాజ్య వాదం అధికారకాంక్షతో కూడిన రాజకీయాలను అనుసరిస్తున్న తరుణంలో, సోష లిజంపై కొత్తవిడత ఆయుధపోటీని బలవంతంగా రుద్దటం ద్వారా దాన్ని ఆర్థికంగా దెబ్బతీయాలని సామ్రాజ్యవాదం ప్రయత్నిస్తున్న తరుణంలో, సోషలిస్టు కుటుంబ దేశాలను విభజించి వాటిని ఒకదాని కొకటి యెదురు పెట్టాలని, ముఖ్యంగా సోవి యట్ యూనియన్‌కు ఎదురు పెట్టాలని ప్రయత్నిస్తున్న తరుణంలో సోవియట్ యూనియన్‌నూ, సోదర సోషలిస్టు దేశాలూ ప్రధానమైన నిర్మాణాత్మక కర్తవ్యా లను నెరవేరుస్తున్నాయి.

కమ్యూనిజానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదం తన "మత దండయాత్ర"ను వదులుకోలేదు. కాగా అది ప్రతిఘాత విప్లవాల ఎగుమతిని గురించి,సోషలిస్టు దేశాల వ్యవహారాలలో ప్రత్యక్ష జోక్యాన్ని గురించి నొక్కి-చెపుతోంది; వాటి "ప్రత్యేకతల" గురించి, "ప్రత్యేక పాత్ర"గురించి వదంతులు వ్యాపింపజేయడానికి ప్రయత్నిస్తోంది. సోదర దేశాల ఐకమత్యాన్ని బలహీనపర్చడం; సోవియట్ యూనియన్ నుండి వాటిని వేరుపర్చి ఛిన్నాభిన్నం చేయడం, చివరకు వాటి సామాజిక వ్యవస్థలను క్షీణింపజేసి, వాటిలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నించడం దీనంతటి లక్ష్యం. సామ్రాజ్యవాదం వివిధ పద్ధతుల్లో ఈ పంథాను అనుసరిస్తోంది. అది యీ పనిని చాలా యుక్తిగా, ఈ పంథా సృష్టికర్తలు మానవ విద్వేషంతో అంగీకరించి నట్టుగా వాగ్దానాలను, బెదిరింపులను మేళవిస్తూ, సోషలిస్టు దేశాల "ప్రవర్తన" ను పరిగణనలోకి తీసుకొంటూ, చేస్తోంది. తదనుగుణంగా అమెరికా, దాని నాటో బంధు దేశాలు తమ బాధ్యతలను పంచుకుంటున్నాయి. సోషలిస్టు కుటుంబ దేశాలకు సంబంధించి అంతర్జాతీయ అవకాశవాదమూ, మత కేంద్రాలూ, పెత్తందారీ విధానాన్ని కోరుకుంటున్న శక్తులూ అంతే వైవిధ్యపూరితమైన పద్ధతుల్లో (తమ నిర్దిష్ట లక్ష్యాల కోసం) రాజకీయ, ప్రచార పంథాను అనుసరిస్తున్నాయి.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదం ప్రస్తుతం చేస్తున్న దాడి స్వభావరీత్యా మును పెన్నడూ లేనంతటి తీవ్రమైనది. సోషలిస్టు దేశాల ఐక్యతను విచ్ఛిన్నం చేయడం ద్వారా సామాజిక ప్రతీకారం కోసం సామ్రాజ్యవాద వర్గాలు ప్రయత్నిస్తున్నాయి. ఆ దేశాల ప్రజల మనసుల్లోకి పరాయి నైతికతత్వాన్నీ, అభిప్రాయాలనూ యెక్కించడానికి ప్రయత్నిస్తున్నాయి.

సోదర పార్టీల మనోస్థైర్యానికీ, వర్గ సమీకరణ శక్తికీ, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాలపట్ల వాటి విధేయతకూ, తమ విజయాలను, ప్రపంచ సోషలిజం ప్రయోజనాలను, ఈనాటి విప్లవ శక్తులన్నిటి ప్రయోజనాలను కాపాడే వాటి సన్నద్ధతకూ, ప్రపంచ వ్యవహారాల్లో వాటి సమన్వయీకృత పంథాకూ—వీటన్నిటికీ సోషలిస్టు కుటుంబంపై అన్ని దశల్లో బలవంతంగా రుద్దుతున్న విధానం ఒక పరీక్ష.

ప్రస్తుత పరిస్థితిలోని జటిలత, సోషలిజం భవిష్యత్తు పట్ల బాధ్యత అనేవి వర్గశత్రువుకు వ్యతిరేకంగా బంధుదేశాల సంఘీభావాన్ని, సమన్వయీకృత చర్యలనూ ఖచ్చితంగా పాటించాల్సిన సమస్యను ముందుకు తెస్తున్నాయి. సోషలిజం మార్గాన్ని చేపట్టిన దేశాలమధ్య సాధ్యమైనంత ఎక్కువ సన్నిహిత సహకారం అవసరమని లెనిన్ తన రచనల్లో పదేపదే నొక్కి-చెప్పాడు. అంతర్జాతీయ సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనే తరుణంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా

పోరాడుతున్న మనం ఒక సంఘమనీ, దానికి మరింత ఎక్కువ సంలగ్నత అవసర మనీ, ఆ సంలగ్నతను భగ్నంచేసే అన్ని ప్రయత్నాలనూ మనం బొత్తిగా అనుమతించరాని విషయంగా, అంతర్జాతీయ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ప్రయోజనాలకు ద్రోహంగా పరిగణిస్తామనీ ఆయన పేర్కొన్నాడు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, యితర సోదర పార్టీల విషయానికొస్తే, సోష లిస్టు కుటుంబ దేశాల మధ్య స్నేహాన్ని, ఐక్యతను పటిష్ఠం చేయడానికి వుద్దేశిం చిన అచంచల విధానాన్ని అనుసరించడంలో అవి తమ సహకారాన్ని కేవలం విస్తరింపజేసే విధానానికి మాత్రమే గాక, దాని నాణ్యతను, సామర్థ్యాన్ని మెరుగు పర్చే విధానానికి కూడా కట్టుబడి వుంటున్నాయి. రాజకీయ సహకారాభివృద్ధీ, ఆర్థిక యేకీకరణలో మౌలికంగా నూతన స్థాయీ, సోదర దేశాల మధ్య మరింత ఎక్కువ సైద్ధాంతిక సంలగ్నతా యిందులో గర్భితమై వున్నాయి.

ప్రస్తుతమున్న అంతర్జాతీయ వుద్రిక్తతలను తొలగించడానికీ, క్రియాశీల మైన రాజకీయ సహకారాన్ని పెంపొందించడానికీ వుద్దేశించిన సమన్వయీకృత విధాన అవలంబనకు వర్తమాన పరిస్థితుల్లో ఒక ప్రత్యేక పాత్ర వుంది.

విదేశాంగ విధానానికి చెందిన తక్షణ కర్తవ్యాలను పరిష్కరించేందుకు వర్తమాన చర్యలను, దీర్ఘకాలిక చర్యలను అంగాంగికంగా మేళవిస్తూ, విధాన సంబంధమైన మౌలిక సూత్రాలను రూపొందించడానికి, బహుళపక్ష, ద్వైపాక్షిక సమావేశాలూ, సభలూ అవకాశాన్ని కల్పిస్తాయన్న విషయంలో మన పార్టీకి ఎలాంటి సందేహమూ లేదు "ఐక్య కార్యాచరణను అంతర్జాతీయ స్థాయిలో అమలుజరపడానికి మౌలిక సైద్ధాంతిక దృక్పథాల విషయంలో స్పష్టత, అలాగే కార్యాచరణను సంబంధించిన ఆచరణాత్మక పద్ధతులన్నిటిలో సిద్ధత అవసరం" అని లెనిన్ రాశాడు.

రాజకీయ సంబంధాలను పటిష్ఠంచేసే కృషి అనేక మార్గాల ద్వారా, ముఖ్యంగా సోదర పార్టీల, దేశ నాయకుల బహుళపక్ష సమావేశాల్లో, వార్సాసంధి సభ్యదేశాల రాజకీయ సంప్రతింపుల కమిటీ (పి.సి.సి) సమావేశాల్లో జరుగుతోంది.

1985 ఏప్రిల్ 26 న వార్సాలో జరిగిన వార్సా సంధి సభ్యదేశాల పార్టీల, ప్రభుత్వాల అగ్రనాయకుల సమావేశం ఈ కృషికి నిజమైన చరిత్రాత్మక దోహదం చేసింది.

"సోషలిస్టు కుటుంబ దేశాలను పటిష్ఠం చేస్తూనే వుండటం, వాటి ఆర్థిక, రక్షణ పాటవాన్ని పెంపొందించడం, వాటి శాంతియుత విదేశాంగ విధాన పంథాను అచంచలంగా అమలుజరపడం అనేవి అపార ప్రాముఖ్యంగల విషయాలు. వార్సా సంధి కాలపరిమితిని పొడిగించాలని ఏకగ్రీవంగా తీసుకున్న నిర్ణయం సోదర

మిత్ర దేశాల భద్రతను పటిష్టం చేయడానికీ, యూరప్‌లో, మొత్తం ప్రపంచంలో శాంతిని పరిరక్షించి, పటిష్టం చేయడానికీ ప్రధానమైన నూతన దోహదాన్ని కూర్చింది" అని ఆ సమావేశ ఫలితాలను పూర్తిగా ధ్రువీకరించిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ పొలిట్ బ్యూరో పేర్కొంది.

అన్ని పద్ధతుల ద్వారా, ముఖ్యంగా శిఖరాగ్ర స్థాయిలో సమిష్టి, ద్వైపాక్షిక సమావేశాలను క్రమం తప్పకుండా సకాలంలో జరపడం ద్వారా సోదర దేశాలు తమ సహకార యంత్రాంగాన్ని కాలానుగుణంగా మెరుగుపర్చడం కొనసాగించాలని పూర్తిగా కృతనిశ్చయంతో వున్నాయి. సోషలిస్టు బంధుదేశాల మధ్య వివిధ రంగాలలో సన్నిహిత సహకారానికి హామి కల్పించడంలో అత్యంత ముఖ్యమైన అంశాల్లో ఒకటి సోదర పార్టీల కేంద్ర కమిటీల కార్యదర్శుల సమావేశాలు..

సోదర పార్టీల మధ్య సహకార రూపాలు ఎన్నో వున్నాయి; అవి వైవిధ్య పూరితమైనవి. బహుళపక్ష సంప్రతింపుల్లో, పరిశోధనా బృందాల్లో చేసే కృషి ఫలితంగా రాజకీయ సంబంధాలు మరింత పటిష్టమౌతున్నాయి. సోదర పార్టీల, కేంద్ర కమిటీల తాలూకు స్థాయీ కార్యనిర్వాహక బృందాలున్నాయి; ఇవి అనేక నిర్దిష్ట దశల్లో పనిచేస్తున్నాయి. అంతిమంగా, సహకారానికి సంబంధించి అత్యంత వ్యాప్తిలో వున్న రూపంగా స్థానిక పార్టీ సంబంధాలను అంతర్ పార్టీ సంబంధాల వ్యవస్థలో ఒక ముఖ్యమైన అంశంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ భావిస్తోంది. ఇది మహత్తర రాజకీయ, ఆచరణాత్మక ప్రాముఖ్యంగల విషయం.

సోదర దేశాలమధ్య ఆర్థికరంగంలో కూడా ఏకీకరణ పెరుగుతోంది. 1984 జూన్‌లో మాస్కోలో జరిగిన స్మియా ఆర్థిక శిఖరాగ్ర సమావేశం యీ రంగంలో యిటీవల జరిగిన ప్రధాన ఘటనల్లో ఒకటి; యిందులో చర్చలు కేవలం ఆర్థిక సమస్యలకు మాత్రమే పరిమితంకాలేదు

ఈ బాంధవ్యానికి సంబంధించిన ఉమ్మడి ప్రయోజనాలు, దాని నిర్ణయాలను యేకరీతిగా అమలుజరపాల్సిన అవసరాన్ని కల్పిస్తున్నాయి తమ కృషిని కలబోయడంవల్ల సోదర దేశాల్లోని ప్రతి ఒక్కటీ ఆర్థికంగా అంతకంతకూ యెక్కువ లాభాలు పొందుతోంది. అంతర్జాతీయ రంగంలో సోషలిజం స్థానాలను మరింత పటిష్టంచేయడానికీ, అణుయుద్ధాన్ని నివారించే కృషిని పుధృతం చేయడానికీ సోషలిస్టు కుటుంబానికి తగినంత వుత్పత్తి, శాస్త్ర, సాంకేతిక శక్తి స్తోమత లున్నాయి.

1970 దశకం చివర్లో, 1980 దశకం ప్రారంభంలో స్మియాలోని అత్యధిక యూరోపియన్ సభ్యదేశాలకు యిబ్బందులు యెదురయ్యాయి; వాటి ఆర్థిక వ్యవస్థలు ముమ్మరాభివృద్ధి పద్ధతులకు మారడంవల్ల, పాశ్చాత్యదేశాలతో వాటి వ్యాపార,

చెల్లింపుల సంబంధాలు జటిలంకావడంవల్ల, సామ్రాజ్యవాదంనుండీ ఆర్థిక వత్తిడులు పెరగడంవల్ల యేర్పడినవి యీ యిబ్బందులు. సోషలిస్టు వ్యవస్థకు తన ఆర్థిక వ్యవస్థను శక్తివంతమైన పద్ధతిలో అభివృద్ధిచేసుకునే, శాస్త్ర, సాంకేతిక ప్రగతిని పెంపొందించే సామర్థ్యంలేదని యీ యిబ్బందులను సాకుగా తీసుకుని బూర్జువా ఆర్థికవేత్తలు వాదిస్తున్నారు. స్వేచ్ఛామార్కెట్ ఆర్థిక వ్యవస్థకూ, ప్రైవేటు పరిశ్రమలకూగల ఆధిక్యతలను రుజువుచేయడానికి ప్రయాసపడుతూ వీళ్ళు హాస్యాస్పదమైన భావనలు ముందుంచుతున్నారు; ప్రభుత్వ యాజమాన్య వ్యవస్థను అపఖ్యాతి పాలేయడానికీ, సోషలిజంలోని యితర యాజమాన్య రూపాలకన్నా స్వేచ్ఛామార్కెట్ వ్యవస్థలోని విశిష్టతలను చెప్పడానికీ ప్రయత్నిస్తున్నారు.

సోషలిస్టు యాజమాన్యానికి సంబంధించిన సమస్యలనూ, ప్రభుత్వ వుత్పత్తికీ, ప్రైవేటు వుత్పత్తికీ మధ్యగల సంబంధాన్ని రివిజనిస్టు స్థానాలనుండి వ్యాఖ్యానించడానికి గూడా ప్రయత్నాలు సాగుతున్నాయి. ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రభుత్వ నిబంధనను, ముఖ్యంగా కేంద్రీకృత ప్రణాళికారచనకు సంబంధించిన నిబంధనను సడలించాల్సిందిగా కొంతమంది పండితులు వాదిస్తున్నారు. మార్కెట్‌లో పోటీని ప్రవేశపెట్టడాన్ని, ప్రైవేటురంగం వాటాను విస్తరించడాన్ని వాళ్ళు సమర్థిస్తున్నారు. ఈ రకమైన "ప్రయత్నాల"న్నీ ప్రధానమైన విషయాన్ని దాటవేస్తున్నాయి; ప్రైవేటు రంగాన్ని యేమాత్రం విస్తరించినా అది సోషలిస్టు ఆర్థిక మేనేజిమెంటు సూత్రాలను సడలించడం, సామాజిక న్యాయాన్ని అతిక్రమించడం, చివరకు సామాజిక వ్యతిరేకతను పెంచడమే అవుతుంది; అంతేకాదు, దానివల్ల తీవ్ర ఆర్థిక, సామాజిక, సైద్ధాంతిక పర్యవసానాలతో కూడిన ప్రమాద మేర్పడుతుంది.

సోషలిజపు వుమ్మడి ప్రయోజనాలనూ, ప్రతిఒక్క నిర్దిష్ట దేశంలో సోషలిజం, కమ్యూనిజం నిర్మాణాలకు సంబంధించిన నిర్దిష్ట కర్తవ్యాలనూ గరిష్ఠంగా పరిగణనలోకి తీసుకోవాల్సిన అవసరాన్ని సోషలిస్టు దేశాల్లోని చర్చలక్రమమూ, ప్రయోగాల నిర్వహణా, అపరిష్కృతంగా వున్న సమస్యల పరిష్కారానికి క్రియాశీలమైన విశదీకరణా తెలియజేస్తున్నాయి. జాతీయ ప్రత్యేకతకోసం చేసే వాదనలు, యితర దేశాల అనుభవాన్ని యాంత్రికంగా అనుసరించడం, లేదా దాన్ని వుపేక్షించడం కూడా యీ సందర్భంగా అంతే ప్రమాదకరమైనవి. సోషలిజం ప్రయోజనాలు, సోషలిస్టు ఆర్థిక మేనేజిమెంటుకు ప్రాతిపదికగావున్న సూత్రాలు, అంటే ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థ, సామాజిక లక్ష్యాల ప్రాధాన్యక్రమం, సోషలిస్టు యాజమాన్యాన్ని పటిష్టంచేసి, దాని రూపాలను పురోగమింపజేయడం—యివి యిక్కడ ప్రధాన మార్గదర్శక అంశాలు.

సోదర దేశాల ఆర్థిక వ్యవస్థల్లో, వాటిని నడిపే పద్ధతుల్లో సహజంగానే సమస్యలున్నాయి; అయినప్పటికీ సోషలిస్టు ఆర్థికవ్యవస్థ పెట్టుబడిదారీ విధానం కన్నా శక్తివంతమైనదని తన ఆధిక్యతలను గట్టిగా రుజువుచేసుకుంటూ వుందనేది వాస్తవం.

* * *

మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీల ఐక్యత, సంలగ్నతలు పెరుగుతున్నట్లు సైద్ధాంతిక రంగంలో కూడా వ్యక్తమౌతోంది. అవి కమ్యూనిస్టు ప్రబోధాత్మక కృషి విషయంలో అనుభవ ఆదాన ప్రదానాలను మెరుగుపర్చడానికీ, తమ సైద్ధాంతిక సహకారాన్ని కాలానుగుణంగా నిర్దుష్టం చేయడానికీ, సామ్రాజ్యవాద ప్రచారానికి వ్యతిరేకంగా సంయుక్త పోరాటం జరిపేందుకు అందుబాటులోవున్న అవకాశాలను మరింత విస్తృతంగా వినియోగించుకోడానికీ ప్రయత్నిస్తున్నాయి.

ప్రజలు అధికారంలోకి వచ్చినప్పటినుండీ అనేక సోషలిస్టు దేశాల జీవితంలో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం ప్రజల స్థానాలకు పురోగమించింది. అయినప్పటికీ ప్రస్తుతమున్న సమస్యలను వుపేక్షించడం పొరపాటే అవుతుంది. ఈ రంగంలో రివిజనిస్టు, సంకుచిత జాతీయవాదధోరణులు యిప్పటికీ అనుభూతమౌతూనే వున్నాయి. సామ్రాజ్యవాద ప్రచార కేంద్రాలు సోషలిస్టు దేశాల భూభాగాలను పూర్తిగా తమ రేడియో, టెలివిజన్ ప్రసార దాడులతో ముంచెత్తడమే యీ ధోరణులు కొనసాగడానికి చాలావరకూ కారణం.

సోదర దేశాల ఐక్యతకు ప్రాతిపదికగా వున్న మార్క్సిజాన్ని-లెనినిజాన్ని అపఖ్యాతి పాల్జేయడానికీ, సోషలిస్టు నిర్మాణ సాధారణ నియమాలను వక్రీకరించడానికీ, అవి జాతీయ ప్రయోజనాలకు బొత్తిగా పొసగనివని రుజువుచేయడానికీ మన వర్గశత్రువులు ప్రయత్నిస్తున్నారు. సైద్ధాంతిక, రాజకీయ బహుసత్తావాదాన్ని ప్రచారంచేయిడంద్వారా సమాజంలో పార్టీ మార్గదర్శకరంగాన్ని పరిమితంచేయడానికీ, పార్టీపాత్రను కేవలం సైద్ధాంతిక విధుల నిర్వహణకు మాత్రమే కుదించడానికీ వాళ్ళు ప్రయత్నిస్తున్నారు. సోషలిస్టు వ్యతిరేక శక్తులతో సూత్రరహితమైన రాజీలు అవసరమని పేర్కొంటున్న వివిధ భావనలు యిదే లక్ష్యాన్ని అనుసరిస్తున్నాయి.

మార్క్సిస్టు - లెనినిస్టు ప్రామాణిక గ్రంథాల్లో రూపొందించిన, సోదర పార్టీల పత్రాల్లో నమోదుచేసిన సాధారణ మౌలిక సూత్రాలు గతించిన కాలానికి మాత్రమే వర్తిస్తాయని చెప్తూ కొంతమంది వాటి వస్తుగత, విశ్వజనీన స్వభావాన్ని సవాలు చేస్తున్నారు సమష్టి అనుభవానికి సృజనాత్మక వ్యాఖ్యానం అనేది యీ వైఖరికి ముసుగుగా వుంది.

కానీ సోషలిజం నిర్మాణానికి సంబంధించిన సాధారణ మౌలికసూత్రాలు నైరూప్యభావన కావు. ఇవి శాస్త్రీయ సోషలిజం, దాన్ని నిర్మించడంలో సోదర దేశాలు గడించిన వుమ్మడి అనుభవం—వీటి సమ్మేళనమే యీ కింద పేర్కొన్నది వాటి సారాంశమని విదితమే; కార్మికవర్గం నాయకపాత్ర నిర్వహిస్తున్నట్టి శ్రామిక ప్రజల అధికారం; సమాజానికి మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ మార్గదర్శకత్వం; మౌలిక వుత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం; మొత్తంగా ప్రజల ప్రయోజనంకోసం యెడతెగని, ప్రణాళికాబద్ధమైన ఆర్థికాభివృద్ధి, "శక్తినిబట్టి పని, పనినిబట్టి ప్రతిఫలం" అన్న సూత్రాన్ని అమలుజరపడం; దేశదేశాల ప్రజలమధ్య స్నేహం, సోదరభావం.

మార్క్సిస్టు - లెనినిస్టు బోధలపట్ల పాలక కమ్యూనిస్టు పార్టీల విధేయత, శ్రామిక ప్రజాబాహుళ్యాల్లో అత్యధిక సంఖ్యాకులతో వాటి సన్నిహిత బాంధవ్యం, పార్టీ జీవితానికి, రాజనీతిజ్ఞతకు సంబంధించిన లెనినిస్టు ప్రమాణాలను విధేయంగా పాటించడం, వాస్తవ పరిస్థితులను నిరావేశంగా పరిశీలించడం, సోషలిజాన్ని నిర్మించే క్రమంలో వుత్పన్నమయ్యే సమస్యలను సకాలంలో పరిష్కరించడం— యివి విజయానికి ప్రధానమైన హామీ.

సోదరదేశాలమధ్య ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి సామ్రాజ్యవాదులు నానాటికీ యెక్కువ తీక్షణమైన పద్ధతులను ప్రయోగిస్తున్నారు. వాస్తవ సోషలిజపు చరిత్రను అపఖ్యాతి పాల్జేయడానికీ, బయటినుండీ లోపలినుండీ యే నిర్దిష్ట సోషలిస్టు దేశ విధానంపైనైనాసరే పట్టు సంపాదించడంకోసం "సోషలిజపు జాతీయ నమూనాల" సమర్థకులుగా పాశ్చాత్యదేశాలు పోజు పెడుతున్నాయి.

అగ్రరాజ్యాలమధ్య రాజీ యేర్పాట్లకు "చిన్న" దేశాలు మధ్యవర్తిత్వం నెరపాల్సిన ప్రత్యేకపాత్ర వుందనేవాదం ప్రస్తుతం ముందుకు తెస్తున్న వాదాల్లో ఒకటి. ప్రధాన అంతర్జాతీయ సమస్యల విషయంలో సోవియట్ యూనియన్ విదేశాంగ విధానానికీ, నూటికి నూరుపాళ్ళు మార్క్సిస్టు - లెనినిస్టు ప్రాతిపదిక గల సోషలిస్టు ప్రపంచానికీ సారూప్యత వున్నప్పుడు సోవియట్ యూనియన్‌కూ, అమెరికాకూ మధ్యగల అభిప్రాయభేదాలను పరిష్కరించడంలో యే నిర్దిష్ట సోషలిస్టు దేశమైనా యే రకమైన మధ్యవర్తిత్వం నెరపగలదు?

వర్గ శత్రువుకు యిప్పటికీ సంకుచిత జాతీయవాదం ప్రధాన ఆయుధంగా వుంది. సోషలిస్టు దేశాలకు గత చరిత్రనుండీ వారసత్వంగా సంక్రమించిన సమస్యలను ఆధారంచేసుకుని పాశ్చాత్య ప్రచార వ్యవస్థలు ప్రయోజనం పొందడానికి ప్రయత్నిస్తున్నాయి. వాటిపై కుహనా దేశభక్తియుత, జాతీయవాదభావాలను రుద్దుతున్నాయి; పాశ్చాత్య నాగరికతపట్ల ఆరాధనాభావాన్ని పెంచుతున్నాయి; సోవి

యట్ యూనియన్‌కూ, అనేక సోదర దేశాలకూ మధ్యగల సంబంధాల చరిత్రలోని "పొరబాట్లను", "అంతరాలను" బాగా వినియోగించుకుంటున్నాయి.

మార్క్సిస్టు - లెనినిస్టు పంథానుండి వైదొలగిన ఘటనలు యేదో ఒక విధంగా సంకుచిత జాతీయవాద ధోరణులకు సంబంధించినవని సోషలిస్టు దేశాల చరిత్ర రుజువు చేస్తోంది. సోషలిస్టు దేశాల్లో యిది మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత ప్రభావాన్ని తగ్గించే, "జాతీయ కమ్యూనిజం" తాలూకు సవరించిన సిద్ధాంతాలను సృష్టించే, జాతీయ సంబంధాల సమస్యను ప్రకోపింపజేసే ప్రమాదంతో కూడుకున్నది. ఇతర సోషలిస్టు దేశాలతోగల సంబంధాల్లో యీ జాతీయవాద పెడధోరణులు నిస్సందేహంగా అంతర్జాతీయ సంబంధాలను సడలింపజేస్తాయి. సంకుచిత జాతీయవాదం మార్మికరూపం (బాహాటరూపం సంగతి చెప్పనక్కరలేదు) తీసుకున్నట్టయితే రష్యన్ బూచి, సోవియట్ వ్యతిరేకత అనేవి సోషలిస్టు దేశాల ఐక్యతను, సంలగ్నతను క్షీణింపజేస్తాయి; మొత్తంమీద సోషలిజానికి, ప్రతి దేశానికి ప్రత్యేకించి నష్టం కలుగజేస్తాయి.

సోషలిజపు వస్తుగత నియమాలకు విరుద్ధమైన సంకుచిత రాజకీయవాద ధోరణులను అన్ని దేశాల మార్క్సిస్టు లెనినిస్టులతో కలిసి వ్యవహరించడంద్వారా తగినంత నేర్పుతో, దృఢచిత్తంతో, సూత్రబద్ధమైన స్థానాలనుండి వ్యతిరేకించడమూ, సైద్ధాంతికంగా నిబద్ధులైవున్న సోషలిజం ఆశయానికి అంకితమైన అంతర్జాతీయవాదులకు శిక్షణనివ్వడమూ తన విధ్యుక్త ధర్మమని మన పార్టీ నమ్ముతోంది. మన వుమ్మడి ప్రయోజనంకోసం డిమిట్రావ్, థేల్‌మన్, గోట్‌వాల్డ్, యితర అసాధారణ కమ్యూనిస్టుల సంప్రదాయాలను ముందుకు తీసుకెళ్ళగలవారి సంఖ్య సోదర పార్టీల్లో సర్వదా పెరగాలి.

కమ్యూనిస్టు వ్యతిరేక సిద్ధాంతవేత్తలూ, అవకాశవాదులూ శ్రామికవర్గ అంతర్జాతీయతపై ఛీత్కారాలు కురిపిస్తూనే దాన్ని "కాలం చెల్లిపోయినది"గా ప్రకటిస్తున్నారు; యేదో "నూతన ఐక్యత"కు ఆద్యులుగా పోజు పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అంతర్జాతీయ భావాలుగల కమ్యూనిస్టులకు దేశభక్తి భావంలేదని ఆరోపిస్తున్నారు. తమ తమ దేశాలపట్ల వారు పట్టీపట్టనట్టున్నారని వాదిస్తున్నారు. యీ రకమైన అపనిందను తనకాలంలో లెనిన్ మహాశయుడు బహిర్గతం చేశాడు. శ్రామికవర్గం నిజమైన దేశభక్తి కలిగినదని ఆయన రుజువు చేశాడు.

శ్రామికవర్గ అంతర్జాతీయత నైరూప్య సిద్ధాంతంకాదని అనుభవం రుజువు చేసింది. "....అది సులభమైన కర్తవ్యం కానందువల్లే ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించాలని కోరుకునే వారితో, జాతీయ దురహంకారవాదులనుండి, సామాజికదురహంకారాన్ని సమర్థించేవారినుండి పూర్తిగ తెగతెంపులు చేసుకోడానికి భయపడని

వారితో కలిసి దాన్ని నెరవేర్చాలి" (సంపుటి 22, పేజి 99). అంతర్జాతీయతను మాటల్లో మాత్రమే బలపరచేవారిని యెండగట్టాలని లెనిన్ నొక్కిచెప్పాడు. లెనిన్ భావించినట్టుగా సంఘీభావం దానిని, నిర్దిష్ట కార్యాచరణ ద్వారా నిజమైన అంతర్జాతీయత వ్యక్తమౌతుంది. ప్రపంచవ్యాప్త విప్లవోద్యమాన్ని పెంపొందించడానికి తోడ్పడుతుంది. ఇప్పుడు అన్ని రకాల రివిజనిస్టు, సంకుచిత జాతీయ వాద, మతపరమైన భావనలు సైద్ధాంతిక రంగంలో ప్రత్యక్షమవుతున్నాయి. కాబట్టి ప్రతిఒక్క కమ్యూనిస్టుకుగల రాజకీయ వైఖరిలో స్వచ్ఛత, మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంలో స్పష్టత ప్రత్యేకించి ముఖ్యమైన విషయాలు.

విప్లవ సిద్ధాంతం స్థాణువులా నిలిచిపోదనేమాట నిజమే అందువల్ల ప్రతి ఒక్క రంగంలో ధైర్యంగా, సముచితమైన వ్యూహశక్తితో, అయితే మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాలపట్ల అచంచల విధేయత అనే అనివార్యమైన షరతుతో సోషలిస్టు ప్రపంచ అభివృద్ధికి సంబంధించిన వర్తమాన సమస్యలను లేవనెత్తడం, నిజమైన మార్క్సిస్టు - లెనినిస్టులముందున్న కర్తవ్యం. సోదర దేశాల ప్రజలు తమ సోషలిస్టు పురోగమనంలో గణనీయంగా ముందుకుసాగడం, మార్క్సిజం-లెనినిజం భావాలు నూతన సామాజికవ్యవస్థ చెల్లుబాటులో వున్నాయనడానికి స్పష్టమైన సూచన.

హిట్లరు ఫాసిజంపై విజయం సాధించిన 40వ వార్షికోత్సవం, అనేక సోషలిస్టుదేశాల్లో జరిగిన సోషలిస్టు, జనసామాన్య ప్రజాతంత్ర విప్లవాల 40 వ వార్షికోత్సవంలాంటి అతి ముఖ్యమైన ఘటనలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోదర దేశాల మార్క్సిస్టు - లెనినిస్టుపార్టీలు విస్తృతంగా జరుపుకొన్నాయి. మన దేశాల మధ్యగల చారిత్రక భవితవ్యాల సాదృశ్యతనూ, విప్లవకర సంబంధాల శక్తినీ యీ ఉజ్వల వార్షికోత్సవాలు మరోసారి ధ్రువీకరించాయి.

సోషలిస్టు దేశభక్తి భావన సరళిలో, అంతర్జాతీయతా సరళిలో శ్రామిక ప్రజలను బాగా ప్రబుద్ధంచేయడానికి, ప్రపంచ సోషలిజం భవితవ్యంపట్ల యీ కుటుంబ దేశాల ప్రజల వుమ్మడి బాధ్యతను గ్రహించడానికీ, దాని విజయాలను రక్షించడానికైనిరంతరం సంసిద్ధంగా వుండడానికీ చరిత్ర గుణపాఠాలను బాగా గుర్తుంచుకోవడం సహాయకారిగా వుంటుంది.

27 వ మహాసభకు సాగుతున్న తరుణంలో, పార్టీ విధాన సంబంధమైన పత్రాలను రచిస్తున్న తరుణంలో, శాస్త్ర, సాంకేతిక ప్రగతిద్వారా దేశ సామాజిక, ఆర్థికాభివృద్ధిని త్వరితంచేసే పంథాను మన పార్టీ పూర్తి విశ్వాసంతో అనుసరిస్తోంది; సోషలిస్టు కుటుంబ ఐక్యతను అన్ని విధాలా పటిష్ఠంచేయడానికి దాని అధికారాన్ని, అంతర్జాతీయ పలుకుబడిని పెంపొందించడానికి సోదరపార్టీలతో కలిసి

కృషిచేయడం తన అంతర్జాతీయ విధిగా భావిస్తోంది. ఇతర సోదర దేశాలు కూడా బహుముఖ పర్యవసానాలుగల, అంటే సంయుక్త కృషిద్వారా శాస్త్ర, సాంకేతిక ప్రగతిని త్వరితంచేయడం, సాధ్యమైనంత తక్కువకాలంలో సామాజికశ్రమ వుత్పాదకతలో ప్రపంచంలోనే అత్యున్నత ప్రమాణాలను సాధించడంలాంటి లక్ష్యాలను నిర్దేశించుకుంటున్నాయి. సోషలిస్టు కుటుంబ పటిష్ఠతపై, వాటిలో ప్రతిఒక్క దేశం చేసే నిర్మాణాత్మక కృషిలో అవి సాధించిన విజయాలపై, సోదర దేశాల సహకార అంతర్జాతీయ కార్యాచరణపై శాంతి, సామాజిక ప్రగతుల భవితవ్యం ప్రధానంగా ఆధారపడివుంటుంది. ★

# సోవియట్‌లో భారతీయ అధ్యయనం

—ఏటుకూరు బలరామమూర్తి

ప్రాచీన సంస్కృతీ అధ్యయనం ఒక నిరంతర పరిశోధన. అనుగు చిక్కని గనిని తవ్వుకుంటూపోతే, ఒక్కొక్క పొర గడిచినకొద్దీ కొత్త విశేషాలు బైటపడతాయి అతఃపూర్వం ఏర్పరచుకున్న భావాలను కొంత సవరించుకోవలసి వుంటుంది. భారతీయ అధ్యయనం సోవియట్‌లో జరిగిన తీరు ఇలాగే సాగింది.

ఓల్డెన్‌బర్గ్, షెర్‌బట్‌స్కి లాంటి మహోపాధ్యాయులు బౌద్ధంపై విశేష కృషి చేశారు భారదేశంలోనూ, మధ్య ఆసియాలోనూ జరిగిన పురావస్తు త్రవ్వకాల ద్వారా బౌద్ధం విశ్వరూప దర్శనం ఇచ్చింది. సమానత్వం, కరుణ, విశ్వజనీనత లాంటి బౌద్ధంలోని భావాలు సోవియట్ మేధావులను సహజంగానే ఆకర్షించాయి. 1919 లో సోవియట్ రష్యా అప్పుడప్పుడే నూతన రాజకీయ వ్యవస్థను రూపొందిస్తున్న కాలంలో, పెట్రోగ్రాడ్‌లో ఒక బౌద్ధ అవశేషాల ప్రదర్శన జరిగింది. పండితలోకాన్ని, మేధావివర్గాన్ని విశేషంగా ఆకర్షించిన ఆ ప్రదర్శన సభలో మాట్లాడుతూ షెర్‌బట్‌స్కి యిలా అన్నారు :

"ఆచరణాత్మక రంగంలో బౌద్ధం స్వంత ఆస్తి హక్కును, సంకుచిత జాతీయ దృక్పథాన్ని నిరాకరించి, విశ్వసౌభ్రాతృత్వ భావన ప్రచారం చేసింది. మానవుడు స్వయంకృషి ద్వారా సమగ్ర ఔన్నత్యాన్ని సాధించగలడనే ఆశాభావాన్ని బోధించింది."

షెర్‌బట్‌స్కి కృషిని గురించి ఆనాటి విద్యామంత్రి లూనచార్‌స్కి లెనిన్‌కు ఒక లేఖ వ్రాస్తూ ఇలా అన్నాడు. "ఈయన అద్భుతమైన పండితుడు. బౌద్ధంపై ఇతని గ్రంథం ప్రతిభావంతమైనది. సోషలిస్టు దృక్పథం నుండి బౌద్ధాన్ని పరిశీలించాడు. (వ్యక్తిగత ఆస్తి, వ్యక్తి అహంకారానికి చిహ్నమైన ఆత్మ భావనలను నిరాకరించటం, మానసిక శాంతి, సామాజిక పరిణామక్రమంలో వ్యక్తి అంతర్భాగమై ఆనందస్థితికి చేరడమనే నిర్వాణ భావన)"

కాగా ఈ భావన అకస్మాత్తుగా బౌద్ధంలో ప్రవేశించిందా, అతఃపూర్వ భారతీయ తాత్విక భావనలో ఈ బీజాలు లేవా ? ఇంత ఉన్నత భావాలు బోధించిన

బౌద్ధం అతి త్వరలోనే ఎందుకు పతనమైంది ? బహుశా ఈ ఉన్నత భావాల సరసనే, కొన్ని అశాస్త్రీయమూ, అస్పష్టమూ అయిన తాత్విక ఆ సందర్భాలుకూడా మొదటినుంచీ ఉన్నవేమో ? ఆనాటి చారిత్రక సామాజిక పరిస్థితులకు బౌద్ధం ఆవిర్భావానికి గల సంబంధం ఎలాంటిది? ఈ సమస్యలన్నీ పరిశోధకులను ఏమిరోకాసాగాయి.

ఓల్డెన్‌బర్గ్, షెర్‌బట్‌స్కీలు ఈ సమస్యలను ప్రస్తావించకపోలేదు. కాని బౌద్ధంలోని సానుకూల అంశాలను ప్రపంచానికి తెలియజేసే కృషికే వారు సహజంగా ప్రథమ స్థానం ఇచ్చారు. ఫలితంగా వారు బౌద్ధాన్ని, ఆది బౌద్ధాన్నే కావచ్చు అతిశయంగా ఆదర్శీకరించారు. ఈ లోపాన్ని ఆ తరువాత పరిశోధకులు సరిచేయటానికి పూనుకున్నారు. ఈ కృషి చేసినవారు ఆయన సమకాలికులైన, బరాన్నికోవ్, శిష్యులైన ఓబర్ మిల్లర్, టుబ్యాన్‌స్కీ, వోస్ట్రికోవ్ గారలు.

ఈలోగా సోవియట్ ప్రభుత్వం దేశవ్యాపితంగా భారతీయ అధ్యయన కేంద్రాలను ఏర్పరచసాగింది. పెట్రోగ్రాడ్‌లో ఉన్న ఆసియాటిక్ మ్యూజియంలో వేల సంఖ్యలో ప్రాచీన తాళపత్ర గ్రంథాల సేకరణ జరిగింది. 1921 లో కళా సాంస్కృతిక అధ్యయన కేంద్రం, మానుషశాస్త్ర. అధ్యయన కేంద్రాలు పెట్రోగ్రాడ్‌లో ఏర్పడ్డాయి. మాస్కో, తిబిల్సి, కార్కోవ్ నగరాలలో సంస్కృత భాషాధ్యయనం మొదలైంది. అఖిల రష్యన్ ప్రాచ్య శాస్త్రీయ పరిశోధనా సంస్థ 1922 లో ఏర్పడ్డది. సజీవ ప్రాచ్య భాషల అధ్యయన సంస్థ ఏర్పడి, హిందీ, తమిళం లాంటి వర్తమాన భాషలపై పరిశోధనలు చేయసాగింది.. ఈ సంస్థలో షెర్‌బట్‌స్కీ, ఓల్డెన్‌బర్గ్‌లతో పాటు, బరానికోవ్ కూడా ఉన్నారు. ఇతడు 'జాతకమాల'ను రష్యన్ భాషలోకి అనువదించాడు.

1927 లో ప్రాచ్యదేశ భావ సముదాయం అనే గ్రంథాన్ని యం. రీస్నిర్ వ్రాసి, మార్క్సిస్టు పరిశీలనా పద్ధతిలో,. కుల వ్యవస్థ, వర్గ పొందికకు గల సంబంధం, బౌద్ధంలోని సామాజిక సారం మొదలైన అంశాలు చర్చించాడు.

షెర్‌బట్‌స్కీ శిష్యుడైన టుబ్యాన్‌స్కీ హిందూ మతంపై ఒక విమర్శనా వ్యాసం వ్రాశాడు. భారతీయ ఆలోచనలో మార్మికత ఉన్నా, దాని అడుగున గాఢమైన తాత్విక చింతన ఉన్నదనేది ఆయన ప్రధాన వాదన. ఠాగూరు కవిత్వాన్ని, బంకించంద్ర చటోపాధ్యాయ, వందేమాతరం గేయాన్ని రష్యన్లకు పరిచయం చేసింది ఇతడే.

సాహిత్యం, కళలు, తత్వశాస్త్రం చరిత్ర ఇత్యాది విభాగా లన్నింటినీ సమన్వయ దృష్టితో చదివితేగాని సమగ్రత రాదు. మార్క్సిస్టు ఆలోచనా ధోరణిలో యిదొక ప్రధాన అంతర్భాగం.

ఈ కారణంగానే సోవియట్‌లో భారతీయ అధ్యయనం బహుముఖంగా సాగింది. 1927 లో, భారతీయ రంగస్థలంపై ఎ. మోర్వార్డు వ్రాశాడు. ఇతడు భారతదేశం వచ్చి, మద్రాసు, తిరువాన్కూరు నగరాలలో భారతీయ నాట్య నృత్యకళలపై సుదీర్ఘ పరిశోధనలు చేసిన విషయం ఇదివరకే తెలుసుకున్నాము.

షెర్‌బట్‌స్కీ శిష్యులలో వై. వై. ఓబర్ మిలర్ (1901-1935) ఒకడు. ఇతడు టిబెట్, మంగోలియా భాషలలో నిపుణుడు. చివర రోజులలో ఈ పండితునికి అంగవైకల్యం ప్రాప్తించింది. ఐనప్పటికీ బౌద్ధంపై సుమారు 30 రచనలు చేశాడు. బౌద్ధ, నిర్వాణ, శూన్యతా భావనలపై ఓబర్ మిలర్ వ్యాసాలు, ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ పత్రికలో (కలకత్తా) ప్రచురితమయ్యాయి. ఈ పత్రికకు రవీంద్రనాథఠాగూర్ అధిపతి.

షెర్‌బట్‌స్కీ మరో శిష్యుడు టుబ్యాన్‌స్కీ (1893-1943) మంగోలియా ప్రజా రిపబ్లిక్‌లో టిబెటన్ విభాగంలో వీరు చాలాకాలం పనిచేశారు. బౌద్ధ తర్కంపై ప్రత్యేక కృషి చేశాడు. సంస్కృత గ్రంథాలైన, 'న్యాయ ప్రవేశ' 'చతుష్టవ' లపై ఇతడు పరిశోధనలు చేశాడు. టిబెట్ మూలాధారాల నుండి, భారతీయ భౌతికవాదంపై పరిశోధన చేశాడు. ఇతని అకాల మరణం వలన అనేక గ్రంథాలు ప్రచురణ కాలేదు.

షెర్‌బట్‌స్కీ మరో శిష్యుడైన వోస్త్రికోవ్ (1904-42). ఉద్యోతకారుని న్యాయవార్తికం, ధర్మకీర్తి, 'వాద న్యాయం' లాంటి తార్కిక గ్రంథాలను అధ్యయనం చేసి పెక్కు వ్యాసాలు వ్రాశాడు. వసుబంధుపై ఇతడు వ్రాసిన ప్రామాణిక వ్యాసాన్ని భారతీయ పండితులు 1934 లో ప్రచురించి ఎంతో ప్రశంసించారు. ఇతడు కూడా అకాల మరణానికి గురయ్యాడు.

షెర్‌బట్‌స్కీ శిష్యులైన వీరందరూ ప్రధానంగా తర్కం, తత్వశాస్త్రాలపై కేంద్రీకరించారు. చరిత్ర, అర్థ శాస్త్రాల తగినంత పరిశోధన చేయకపోవటం వీరందరి బలహీనత. 1930 లో ఈ నూతన అధ్యాయం ప్రారంభమైంది.

## చరిత్ర పరిశోధన

చరిత్ర పరిశోధనకు తొలి చర్యగా భేతాళ పంచశతి, బృహత్కథ లాంటి చారిత్రక గ్రంథ సముచ్చయం అనువదించబడ్డాయి. ఆ కథా సముదాయం నుండి సామాజిక పరిస్థితుల అవగాహనకు చరిత్రకారులు ప్రయత్నించారు.

పాశ్చాత్య, ప్రాచ్య ఖండాలు రెండూ స్థూలంగా ఒకే సామాజిక పరిణామ క్రమాన్ని, వెనుక ముందుగా అదిగమించాయని ఓల్డెన్‌బర్గ్ మొదలుకొని యావన్మంది భారతీయ అధ్యయనవేత్తల ఏకాభిప్రాయం. వర్గ పోరాటం పాశ్చాత్య,

ప్రాచ్య దేశాలు రెంటిలోను చోదకశక్తి. అది వ్యక్తీకృతమైన రూపాలు మాత్రం బహుధా ఉండేవి.

1930 నాటికే సోవియట్ పరిశోధకులు స్థూలంగా ఒక నిర్ణయానికి వచ్చారు. ఆసియాటిక్ ఉత్పత్తి విధానం అనే ప్రత్యేక రూపం ఒకటి ఉన్నదనుకోవటం స్వంత ఆస్తి వ్యవస్థ లేకుండా, విపరీతమైన నిరంకుశత్వంతో, దీర్ఘకాల స్తబ్ధతతో ఇది కొనసాగిందనీ భావించడం పొరపాటు. ప్రాచ్య దేశాల ప్రత్యేక పురోగమన పంథా అంటూ ఏదీ లేదు.

1941-45 లో సోవియట్ విశ్వవిద్యాలయాల్లో భారతీయ చరిత్రపై కొన్ని పాఠ్యగ్రంథాలుండేవి. వాటన్నిటిలోనూ పై భావమే వ్యక్తమైంది. భూస్వామ్య వ్యవస్థకు పూర్వం భారతదేశంలోనూ బానిస వ్యవస్థ ఉండేదనే స్థూల చిత్రీకరణ ఈ గ్రంథాలలో సామాన్య లక్షణం.

స్థూలంగా పై అవగాహన సరైనదే. కాని భారతీయ బానిస వ్యవస్థ స్వరూపం ఎలాంటిది, దేశమంతటా అలా ఉండేదా లేక కొన్ని ప్రాంతాలలోనా, యూరపియన్ బానిస వ్యవస్థకు దీనికి తేడాలు లేవా, ఉంటే ఏమిటి-మొదలైన గాఢ పరిశీలన ఆ గ్రంథాలలో లేదు.

1940 తర్వాత ఈ అంశంపై ప్రత్యేక కృషి జరిగింది. 1948 లో అసిపోవ్ 'పదో శతాబ్ది వరకు 'భారతదేశ చరిత్ర' అనే గ్రంథం ప్రచురించారు. ఒక క్రమపద్ధతిలో భారతదేశ చరిత్రను చెప్పటానికి ఇది తొలి యత్నం. అదే సంవత్సరంలో డి. సులేకిన్ అనే గొప్ప పరిశోధకుడు 'ప్రాచీన చరిత్రలో దశల వారీ పరిణామం' అనే ప్రామాణిక రచన చేశారు. ఆదిమ కమ్యూనిస్టు, బానిస, అర్ధ బానిస (ఫ్యూడల్) దశలు స్థూలంగా ఈ కాలాలలో ఉండి ఉంటాయనే అంచనాను వీరు ఇచ్చారు. సుప్రసిద్ధ భారతీయ చరిత్రకారులు, ఆర్. యస్. శర్మ, "ప్రాచీన భారతంలో శూద్రులు" అనే తన పరిశోధక గ్రంథంలో ఈ రచనను పేర్కొన్నారు.

1950 ప్రారంభానికి సోవియట్ చరిత్రకారులలో స్థూలమైన ఏకాభిప్రాయం ఏర్పడ్డది. ప్రాచీన ధర్మశాస్త్రాలు, అర్థశాస్త్రం, బౌద్ధ జాతక కథలు-చూస్తే ఆనాడు లేక అంతకు పూర్వం బానిస వ్యవస్థ ఉన్న విషయం రుజువవుతుంది. పక్కపక్కనే వర్ణ వ్యవస్థ ఉన్నది. వర్ణ వ్యవస్థ, ఆర్యుల దండయాత్ర, అనార్యుల ఓటమి ఫలితంగా ఏర్పడ్డది కాదు. వలసవాద చరిత్రకారులు ఆర్య అనార్య ఘర్షణను అతిగా ఊహించారు. పని విభజన, వర్ణ వ్యవస్థకు ఒక కారణం. తెగలు పరస్పరం విలీనీకరణ చెందే సందర్భంలో, వారిలో అంతకు ముందే ఉన్న తరతమ విభేదాలు

విమ్నోన్నతాలు, వర్ణ వ్యవస్థలో ప్రతిబింబించాయి. అగ్రవర్ణస్తులు ఆర్యులు, తదితరులు అనార్యులు అని భావించటం అశాస్త్రీయం. తెగల కలయిక, మానసిక ప్రవృత్తిలో వ్యత్యాసాలు పని విభజన ఈ మూడూ కలిసి రూపొందిన పద్ధతి వర్ణ వ్యవస్థ. తాము ఆర్యులమని అగ్రవర్ణాలవారు చెప్పుకునే అతిశయోక్తులు యథార్థాలు కావు.

ఆర్థికాభివృద్ధి, వ్యవసాయం, పశుపోషణ, వ్యాపారం పెరుగుదల వర్ణ వ్యవస్థ రూపొందటానికి కారణాలు.

స్థూలంగా ఈ అవగాహనకు వచ్చినా, బానిస వ్యవస్థ, ఉమ్మడి గ్రామీణ జీవిత విధానం పక్కపక్కనే సాగినందున, దేని నిష్పత్తి ఎంత, అటునుండి ఇటు, ఇటునుండి అటు చర్య ప్రతి చర్యలు ఎలా జరిగాయి అనే అంశంపై భిన్నాభిప్రాయాలు వ్యక్తమౌతూనే ఉన్నాయి. కాలక్రమేణా బానిస వ్యవస్థ అంతమైంది గదా. వారందరూ ఏ వర్ణాలలో లీనమైనారు అనేది నేటికీ చర్చనీయాంశంగానే ఉన్నది

సామాజిక విభజనకు, రాజ్యాంగ వ్యవస్థ రూపకల్పనకూ ప్రత్యేక వృత్తి విద్యల, కళారూపాల అభివృద్ధికి బానిస వ్యవస్థ తోడ్పడ్డది. అయినా, విస్తారమైన భారతదేశంలో ఉమ్మడి గ్రామీణ అభివృద్ధి రూపాలే బహుళంగా ఉండేవని అసిపోవ్ భావన.

అసిపోవ్ దృష్టిలో శూద్రులు, నాలుగో వర్ణం వారు, ఆఖరు మెట్టులోనివారు, కాని బానిసలు కారు. ఓడిపోయిన తెగలవారిని శూద్రులుగా పరిగణించటం కూడా ఉండేది.

సులేకిన్ కాలక్రమ పట్టిక యీ విధంగా ఉంది క్రీ. పూ. 15 వ శతాబ్దికి పూర్వం ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ—అనగా మహాభారత యుద్ధానికి పూర్వం క్రీ పూ. రెండవ శతాబ్ది వరకు బానిస వ్యవస్థ విజృంభణ (మౌర్య అశోకుని పాలన వరకు), క్రీ. శ. 3 వ శతాబ్ది నుండి బానిస వ్యవస్థ పతనం, ఫ్యూడల్-అర్ధ బానిస వ్యవస్థ ఆవిర్భావం (గుప్త రాజుల పాలనతో యిది మొదలు).

బానిస వ్యవస్థ, ఉమ్మడి గ్రామీణ వ్యవస్థ పక్క పక్కనే దీర్ఘకాలం సాగాయని ఉభయులూ అంగీకరించారు.

ఇలిన్ అనే చరిత్రకారుడు మరో అంశం నొక్కి చెప్పాడు. గ్రామీణ ఉమ్మడి వ్యవస్థ అంటూ ఉన్నమాట నిజమే కాని అందులోనూ వర్గ విభజన, వర్ణ విభజన ఉన్నాయి. ఆర్థిక, సాంఘిక వ్యత్యాసాలున్నాయి. స్వంత ఆస్తి ఉన్న

వారు, లేనివారు ఉన్నారు. ఏవో కొన్ని ఉమ్మడి గ్రామీణ హక్కులు ప్రతి ఒక్కరికీ ఉన్నంతమాత్రాన ఆ రూపాన్ని ఆదర్శీకరించరాదు.

"ప్రాచీన స్మృతి గ్రంథాలలో శూద్రులు, బానిసలు" అనే వ్యాసంలో ఇలిన్ ఇలా అంటాడు. శూద్రులు వేరు, బానిసలు వేరు. జన్మ ద్వారా నిర్ణయింపబడేది వర్ణం. శూద్రులు ఒక వర్ణం బానిసలు కొంత కాలమైన తర్వాత స్వేచ్ఛా పౌరులై ఏదోఒకవర్ణంలో చేరిపోతూ వుండేవారు. "ప్రాచీన భారతదేశంలో శూద్రులు" అనే ప్రసిద్ధ గ్రంథాన్ని రచించిన భారతీయ చరిత్రకారుడు ఆర్. యస్. శర్మ, ఇలిన్ ఆలోచనా క్రమాన్ని హర్షించారు.

గ్రీస్‌లోని బానిసలకు, భారతదేశంలోని బానిసలకు ఒక తేడా వుంది. భారతదేశంలో బానిసలు ప్రధానంగా రాచమందిరాలలో దాసదాసీలుగా ఉండేవారు. ఎప్పుడో ఒకప్పుడు వీరు విముక్తి పొందేవారు. అయితే మౌర్య యుగానికి ముందు అనగా మహాభారతం, బౌద్ధాలకు మధ్య (క్రీ.పూ. 1500-500) బానిస వ్యవస్థ ఒక ఉత్పత్తి రూపంగా కూడా ఉండేది. అనగా వ్యవసాయంలో బానిసలుండేవారు. ఇట్టి బానిసలలో నుండి పుట్టిన తిరుగుబాటు తాత్విక ధోరణే చార్వాకం.

షెర్‌బట్‌స్కీ అనుచరుడైన బరానికోవ్, మొదట్లో బౌద్ధంపై ప్రత్యేక కృషిచేసి, పిమ్మట రామాయణ, మహాభారతాలపై దృష్టి మళ్ళించాడు. తులసీదాసు రామాయణాన్ని రష్యన్‌లోకి అనువదించి 1948 లో ప్రచురించాడు. ఆయన ఆధ్వర్యంలో 1950 లో మహాభారత ప్రచురణ కూడా జరిగింది.

బిరానికొవ్ శిష్యుడైన డెన్యటొవస్కీ (1927-1956) మరోగొప్ప సంస్కృత పండితుడు. భారతీయ భాషా శాస్త్రంలో నిపుణుడు. శూద్రకుని మృచ్ఛకటిక నాటకాన్ని రష్యన్‌లోకి అనువదించాడు. దురదృష్టవశాత్తు ఈ పండితుడు 40 ఏండ్లు నిండకముందే మరణించాడు.

ఈ పండితులందరూ మౌర్య, గుప్త యుగాలపై ఎక్కువ శ్రద్ధవహించారు. సహజమే ఏమంటే భౌతిక, ఆధ్యాత్మిక, బౌద్ధిక, వైజ్ఞానిక, కళా సాంస్కృతిక రంగాలన్నిటిలోనూ భారతదేశం అత్యున్నతస్థాయి నందుకున్న కాలమది. చార్వాకం వెనకడుగు పట్టింది. బౌద్ధం రూపాంతరం చెందసాగింది. హిందూమతం గుణాత్మకమైన మార్పుకు లోనైంది సంపన్నవర్గాలు, పేదవర్గాలు అనే విభజన సుస్థిరమైంది. ఇందుకు కారణాలను, సమాధానాలను ఎవరికితోచినట్లు వారు చరిత్రకారులు ఇవ్వసాగారు.

తొలిరోజులలో బానిసలలో వ్యక్తమైన చార్వాక భౌతికవాదం అంతరించి, సంపన్న, పాలకవర్గాల అండదండలతో, సాంఖ్య, న్యాయ, వైశేషికా లుద్భ

వించాయి. ఇవన్నీ వేర్వేరు మోతాదులలో భౌతికధోరణికి, వాస్తవిక దృష్టికి, ఐహిక ప్రాధాన్యతకు పెద్దపీట వేశాయి. వీటన్నిటినీ కలిపి, అన్వీక్షకి అనే పేరుతో కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో పేర్కొన్నాడు. రాజకుమారులు, పాలకవర్గాలు ఈ విద్యను తప్పక అభ్యసించాలని. పేదప్రజలను మతమౌఢ్యంలోవుంచి, తాము మాత్రం మతవిశ్వాసాలకు అతీతంగా లౌకికవిద్యలు నేర్చుకోవాలనేవి కౌటిల్యుని బోధలోని సారాంశం.

వర్గవిభజిత సమాజంలో తాత్త్వికధోరణులు వేర్వేరు అన్వయాలకు గురి కావటం సహజం. తాత్త్వికస్థాయి, తార్కిక నైశిత్యం ఒకటేఐనా, సామాజిక దృక్కోణాలు పరస్పర విరుద్ధాలుగా వుండితీరుతాయి.

తాత్త్వికంగా భౌతికవాదానికి సన్నిహితమైన సాంఖ్య, న్యాయాలు, వేదాలకు, వర్ణవ్యవస్థకు నమస్కారబాణంవేసి ముందుకు సాగాయి. సామాజిక అన్వయంలో పేదలకు వారిపట్ల ఆకర్షణ పోయింది. ధనికులకు భౌతికవాదం పేదలకు నైరాశ్య జనితమైన భక్తియోగం అబ్బటం ఈ యుగలక్షణం. భగవద్గీతలోనే ఈ ద్వైధీ భావంవుంది. ఈ రెంటికీ అతీతంగా సమదృష్టి ప్రధానమైన స్థిరప్రజ్ఞత్వ లక్షణం గీతలో లేకపోలేదు. సోవియట్ అధ్యయనపరుల దృష్టి వీటన్నిటిపైన ప్రస రించింది.

బొంగార్డ్ లెవిన్, మౌర్యయుగంపై ప్రత్యేక కృషిచేసి ప్రామాణిక రచనలు చేశాడు. బౌద్ధయుగ ప్రారంభంలో ఉత్తరప్రదేశ్, బీహార్‌లలోని గణతంత్ర రాజ్యాలను గురించి అల్టేకర్, జయస్వాల్ తదితరుల రచనలు సోవియట్‌లో విశేషవ్యాప్తి చెందాయి. గ్రీక్‌నగర పాలక రాజ్యాలలోని ప్రజా స్వామ్యం ఈ గణరాజ్యాలలోనూ ఉండేది. ఈ రంగంలో రాహుల్ సాంకృత్యా యన్ కృషి ప్రత్యేకంగా ప్రశంసనీయం. రాహుల్‌జీ ఒక దశాబ్దంపాటు లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ఆచార్యత్వం వహించిన విషయం జ్ఞప్తితెచ్చుకోవాలి. ఈ దశలో సోవియట్, భారత పరిశోధకుల మధ్య ఆదానప్రదానాలు హెచ్చుగా జరిగాయనేది ప్రస్తుతాంశం. మౌర్యయుగంలో వర్ణక్రమంలో బ్రాహ్మణులకంటె, క్షత్రియులు (లేక పాలకులు) అగ్రస్థానంలో వున్నారనే సూక్ష్మాంశాన్ని కూడా సోవియట్ పరిశోధకులు గుర్తించారు.

అశోకచక్రవర్తి మతసామరస్య విధానం భారతదేశ సమైక్యతా స్థాపనకు తోడ్పడ్డదని, చివరి రోజులలో బౌద్ధంపై అశోకుడు ప్రత్యేక అభిమానం చూపటం రాజకీయంగా మౌర్యపతనానికి త్రోవతీసిందని కూడా వీరు భావించారు.

భారతీయ పరిశోధకుడు దేవరాజ్‌ఛన్నా వ్రాసిన "ప్రాచీన భారతంలో బానిస విధానం" అనే గ్రంథం సోవియట్‌లో విస్తారగౌరవం పొందింది. సమాజంలో

సంఖ్యాత్మకంగా బానిసలు ఎంతమంది వున్నారని కాదు, వ్యవసాయంలో వున్నారా, లేరా అనికాదు. రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, కళా, తాత్విక రంగా లన్నిటా ఈ వర్గవ్యత్యాస దృక్పథం ఎందుకు ఏ మోతాదులో ప్రతిబింబించింది అనేది ముఖ్యాంశం అని ఇలిన్ స్పష్టీకరించాడు.

అల్టెకర్, జయస్వాల్ గారల రిపబ్లిక్‌ల భావన సరైనదే. కానీ ప్రాచీన గ్రామీణ వ్యవస్థను ఆదర్శీకరించే ధోరణిమాత్రం సరికాదు.

అస్పృశ్యతా సమస్యను కూడా వీరు చర్చించారు. తెగలలోని ప్రజలు గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అంతర్భాగమయ్యే క్రమంలో సగం బానిస, సగం అర్ధబానిసలైన అస్పృశ్యులు ఏర్పడ్డారు. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక కారణాలు అనేకం ఈ పరిణామానికి తోడ్పడ్డాయి.

## తత్వశాస్త్రంపై చరిత్ర ప్రభావం

ఈ చారిత్రక విశ్లేషణ తాత్వికపరిశోధనలపై గొప్ప ప్రభావాన్ని కలిగించింది. సమానత్వాన్ని బోధించిన బౌద్ధం నాలుగు శతాబ్దాలు ముగియకముందే ఒక మతంగా మారి మూఢాచారాలను స్వీకరించి తాత్వికంగా పతనంకావటానికి ఈ సామాజిక వ్యవస్థే కారణం. తిరుగుబాటు చార్వాకం, అతిత్వరలో అంతరించటానికి ఇదే కారణం. సాంఖ్య, న్యాయ, వైశేషికాలు కేవలం బౌద్ధిక ధోరణులుగా మిగిలి పోవటానికి ఇదే కారణం.

భారతీయ అధ్యయనపరులవలెనే, భారతీయ మార్క్సిస్టు పరిశోధకుల ఆలోచనాక్రమం కూడా క్రమానుగత పరిణామం చెందుతున్నది.

భారతీయ మార్క్సిస్టు పరిశోధకులలో అగ్రగణ్యుడైన దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ రచనలలో ఇదే కనిపిస్తుంది.

వెనక్కి తిరిగి చూసినప్పుడు ప్రాచీన కాలంలో మనకు సన్నిహితంగా వుండే భౌతికవాద ధోరణలున్నాయా, వుంటే ఏవి అనే ప్రశ్న మార్క్సిస్టులకు మొదట వస్తుంది. వెంటనే లోకాయతులు కనిపిస్తారు దేవీప్రసాద్ మొదటి గ్రంథం లోకాయత. షెర్‌బట్‌స్కీ గ్రంథం "భారతదేశంలో భౌతికవాదం" అలాంటిదే. నిప్పులాగా ప్రజ్వరిల్లించి ఒక్కసారి చల్లారిపోయిన చార్వాకంలోని తాత్విక బలహీనతలను గుర్తించిన మీదట. క్రమంగా పై పండితు లిరువురూ బౌద్ధంపై దృష్టి సారించారు షెర్‌బట్‌స్కీ బౌద్ధంపై అపారపరిశోధనలు చేయగా, దేవీప్రసాద్ బౌద్ధంను డి న్యాయంపై (తర్కశాస్త్ర) దృష్టిసారించాడు. దేవీప్రసాద్ ఆంగ్ల గ్రంథాలన్నీ రష్యన్ భాషలోకి అనువదించబడ్డాయి. సోవియట్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, దేవీప్రసాద్‌కు గౌరవ డాక్టరేట్ బిరుదును ప్రసాదించింది.

కాగా బౌద్ధంతోనే ఎందుకు ఆగాలి. బౌద్ధం, సాంఖ్యంలోనుండి ఎన్నో భావాలు స్వీకరించిందని షెర్‌బట్‌స్కీ నిరూపించాడు. ఉపనిషత్తులు ఇంకా ముందువి గదా. ప్రధానంగా అవిద్యావాద శ్రేణికి చెందినవేఐనా, సాంఖ్యబౌద్ధాలకు బీజాలు కొన్నిఐనా ఉపనిషత్తులలో లేవా? ఉపనిషత్తులలోని భావవాదం, నాటి వైదిక కర్మకాండపై ఖండనగా, ఆలోచనాక్రమాన్ని సాధారణీకరణ స్థితికి తీసుకువెళ్ళి తాత్త్వికభావ పరిణామంలో గణనీయమైనపాత్ర వహించలేదా అనే ప్రశ్నలలోకి సోవియట్ మేధావులు అధ్యయనపరులు వెళ్ళుతున్నారు. భారతీయ తత్వశాస్త్రంలో భౌతికవాదధోరణులు అనే చిన్న పుస్తకం వ్రాసిన అనికేవ్ ఇట్టి తత్వవేత్తలలో ఒకరు.

బౌద్ధం బీజాలు సాంఖ్యంలో ఉన్నట్లే, సాంఖ్యం బీజాలు ఉపనిషత్తులలో ఉన్నాయి. బీజప్రాయంగావున్న శకలాలను సమగ్రతాత్త్విక ధోరణికి వృద్ధిచేసిన ఘనత సాంఖ్యానికి ఇవ్వవలసిందే. కాగా నిరంతరాయ తాత్త్విక ప్రవంతిలోని వివిధ దశలను ఆయా చారిత్రక, సామాజిక ఘటనల పూర్వరంగాన్ని, ఆయా ధోరణులు తత్కాలంలో కలిగించిన అనుకూల, వ్యతిరేక ప్రభావాలను పరిశీలించటం మార్క్సిస్టు పద్ధతి.

ఖగోళశాస్త్రజ్ఞుడైన ఆర్యభట్టు తాత్త్వికభావాలు లోకాయతానికి సన్నిహితంగా వుండేవి లోకాయతులు, జైనులతో శంకరుడు చేసిన వాగ్వాదం ఉభయత్రా కూడా గాఢమైన తాత్త్విక, తార్కిక జిజ్ఞాసకు దోహదకరంగా వుంటుంది.

ఋగ్వేదం, అధర్వవేదం, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, మనుస్మృతి, నారదస్మృతి, పరాశరస్మృతి—ఇత్యాది సాహిత్యమంతా రష్యన్‌లోకి అనువాదం ఐంది. కాళిదాసు, భాసుడు భవభూతి, విశాఖదత్తాది నాటక కర్తల రచనలు, భర్తృహరి శతక సంపుటి, సోమదేవుని కథా సరిత్సాగరం, భారతీయ అధ్యయన పరుల దృష్టిలోకి వచ్చాయి.

వైదిక ఛందస్సు, కావ్యఛందస్సుకు గల వ్యత్యాసంపై టి ఎలిజెరెంకోవా అను పరిశోధకురాలు గొప్ప కృషిచేశారు. వైదికమంత్రా లన్నిటినీ భాషాక్రమ పట్టికలోనూ, గాథాక్రమ పట్టికలోనూ, భావపరిణామ క్రమంలోనూ, వేర్వేరు దృక్కోణాలనుండి అధ్యయనం చేస్తున్నారు. సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్ పరిణామం, పునశ్చరణ ధోరణి ఏర్పడటానికి మూలభూతమైన మౌఖిక అధ్యయనం, ఈ క్రమంలో గ్రంథవిస్తరణ, మంత్రతంత్రాలు, భూతపిశాచాలు, తాత్త్వికచర్చ, ధర్మబోధన— మహాభారత ఇతిహాసంలో పక్కపక్కనే వుండ టానికి గల కారణాలు, తీవ్రపరిశోధనకు గురిఅవుతున్నాయి. ఉపరితల భావసము దాయంలో, ప్రాచీన, వర్తమాన ప్రాగ్రూపాలు, ప్రతీకలు, దీర్ఘకాలం సహజీవనం

చేయటం భారతీయ సమాజ, తాత్విక పరిణామంలో సహజలక్షణమని తాత్వికులు భావిస్తున్నారు.

సంస్కృత నాటక పరిణామం, అలంకార శాస్త్ర చర్చలను కూడా తాత్విక. చారిత్రిక పరిశోధనకు జోడించటం అవసరం. భాసుడు బహుశా తొలి నాటకకర్త. ఏకాంకికలు రాయటానికి కారణం, అప్పటికి, నాటకాలకు ప్రజాదరణేతప్ప, రాజాదరణలేదు. చిన్న స్థాయి నాటకాలు మాత్రమే ప్రదర్శనయోగ్యాలు కావటం భారత. రామాయణ పాత్రలను సాంప్రదాయ విరుద్ధరీతిలో చిత్రించటంలో కూడా, నాటి సామాజికుల భిన్న ధోరణులు వ్యక్తమౌతాయి. ఈ కారణంవలననే భాస నాటకాలు, రాచరికపు యుగంలో అనాదరణ గురై, ఎక్కడో కేరళ రాష్ట్రంలో తల దాచుకున్నాయి. ఈ అంశాలను సోవియట్ పరిశోధకులు అధ్యయనం చేస్తున్నారు.

భామహుని 'కావ్యాలంకార' గ్రంథంపై వైశేషిక ప్రభావం (500 క్రీ.శ) ఉన్నదని టోపోంకిన్ నిరూపించాడు. భారతీయ సాహిత్య పరిణామం అనే బృహద్గ్రంథంలో సెరెబ్రికోవ్, వేదకాలం నుండి 11 వ శతాబ్ది వరకు సాహిత్య, తాత్విక పరిమాణామాన్ని తులనాత్మకంగా అంచనా వేశాడు.

పాశ్చాత్య, ప్రాచ్య తాత్విక ధోరణుల పరస్పర ప్రభావం, ప్రతి చర్యల దృష్ట్యా కూడా అన్వేషణ జరుగుతున్నది. బౌద్ధ సాంప్రదాయాలు గ్రీకు గాధలలో కనిపిస్తాయి. గ్రీకు నాటకశాల ప్రభావం, భారతీయ నాటక రంగంలో కనిపిస్తుంది. ఐనప్పటికీ, ఏ దేశ సంస్కృతికైనా మూలాధారాలు ఆ దేశంలోనే ఉంటాయని ఆదాన ప్రదానాలు, అప్రధాన పాత్ర మాత్రమే వహిస్తాయని సోవియట్ పరిశోధకుల నిశ్చితాభిప్రాయం.

ప్రాచీన గ్రంథాల భాష, రచనాకాలం, విశ్వసనీయత, సామాజికతలపై ప్రస్తుతం తీవ్ర పరిశోధన జరుగుతున్నది. ఒక గ్రంథం మూలధారాలను నిర్ధారించేడానికి దశాబ్దం కూడా పట్టవచ్చు. ఐనా ఈ కృషి అత్యవసరం. పట్టు కథలను, పునశ్చరణను వేరుచేసి మౌలిక భావ పరిణామాన్ని గ్రహించటానికి ఈ శ్రమ తప్పదు.

వీటన్నిటి ఫలితంగా ఆదికాలం నుండి, ఆధునిక యుగం వరకు క్రమబద్ధమైన భారతీయ చరిత్రను రచించటం, ఇప్పుడిప్పుడే సాధ్యమౌతున్నది.

ప్రాచీన భారతదేశం, చారిత్రక సమీక్ష - అనే గ్రంథాన్ని బొంగార్డ్ లెవిన్, ఇలిన్‌గారులు రచించారు. ఆ పిమ్మట 1980 లో అంటోనోవా, బొంగార్డ్ లెవిన్, కొటొవిస్కీలు రచించిన భారతదేశ చరిత్ర. (రెండు సంపుటాలు) ఇప్పటికి ఈ రంగంలో వెలువడిన ప్రామాణిక గ్రంథంగా పేర్కొనవచ్చు. సోవియట్‌లో

ఇంతవరకు, విప్లవానికి పూర్వం, తర్వాత జరిగిన పరిశోధనల సారాంశం అంతా ఈ గ్రంథంలో వ్యక్తమౌతున్నది.

సోవియట్ పరిశోధకుల అందరిలోనూ స్థూలమైన ఏకాభిప్రాయం. భారత చరిత్ర పరిణామంపై ఉన్నది. కాగా కొన్ని నిర్దిష్ట అంశాలపై ఇప్పటికీ తీవ్ర వివాదాలు. చర్చలు సాగుతూనే ఉన్నాయి. పైన పేర్కొన్న రెండు గ్రంథాలే ఇందుకు నిదర్శనాలు. పరిశోధనలు జరుగుతున్న కొద్దీ కొత్త కోణాలు. బహిర్గతం కావటమే ఇందుకు కారణం.

ప్రస్తుత చర్చనీయాంశం వైదిక పూర్వయుగం. అనగా హరప్ప నాగరికతా శిథిలాల ద్వారా వ్యక్తమయ్యే చరిత్ర.

ఆర్య అనార్య ఘర్షణ హరప్ప నాగరికతా ధ్వంసానికి ప్రధాన కారణమని హరప్ప నాగరికత, మెసోపోటేమియా సంస్కృతికి వారసత్వమని, ఈ తత్వాలు సాగించిన ప్రముఖ పరిశోధకుడు మార్టిమర్ వీలర్ అభిప్రాయం. ఈ వాదన అతిశయోక్తులతో కూడుకున్నదని, ఆర్య - అనార్య ఘర్షణ అంటే తప్పనిసరిగా ఇతర ఖండాల నుండి వచ్చినవారి దాడి కానక్కరలేదని, అంతరంగిక ఘర్షణలు కూడా కావచ్చునని, సోవియట్ పరిశోధకులలో పెక్కుమంది భావన. భారతీయ పరిశోధకులు కూడా కొందరు ఈ వాదన వైపు మొగ్గుతున్నారు. ఈ విశేషాలు వచ్చే వ్యాసంలో తెలుసుకొందాము.

12—8—85

గ్రంథ సమీక్ష

# అష్టదంష్ట్రల విష జంతువుతో పోరాటం

రోషే, ఆడమ్స్ వివాదం —

రచన — స్టాన్లీ ఆడమ్స్

ప్రచురణ - జొనథన్ కేప్, లండన్ 1984, 236 పేజీలు

మందులను తయారుచేసే బహుళజాతి సంస్థ రోషే. తన వ్యాపార రహస్యాలను, ప్రజా క్షేమం దృష్ట్యా బైటపెటిన ఆడమ్స్ అనే ఉద్యోగిని వెంటాడి దివాళా తీయించి, జైలుశిక్ష విధించి, అతని భార్య మృతికి కారణమై యూరప్ నుండి పారిపోయి బ్రిటన్‌లో తలదాచుకోవలసిన దుస్థితి ఎలా కలిగించిందో తెలియజేసే గ్రంథం. 'రోషే ఆడమ్స్ వివాదం' ఈ గ్రంథ సారాంశాన్ని సమీక్షకుడు హృదయం ద్రవించేరీతిలో వివరించాడు. ఇక చదవండి — సం)

"నీ అంతరాత్మ నీకు మార్గదర్శకం - అని ఒక సామెత ఉంది. నా అంతరాత్మను అనుసరించి నడుచుకుంటే ఏమి జరిగిందో, ఎక్కడకు చేరుకున్నానో ఈ కథ తెలియజేస్తుంది. ఈ కథ నిండా కుట్రలు, నిర్దాక్షిణ్యం, విద్రోహం, జైలుశిక్షలుతప్ప వేరేమి లేదు" —పై గ్రంథంలోని మొదటి పేరా ఇది.

ఇదొక నవల కాదు. కాని అంతటి ఆసక్తి కలిగించే వాస్తవ గాథ. ఇందులో ప్రధాన పాత్రధారి హాఫ్‌మన్ - లా—రోషె. ఇదొక బ్రహ్మాండమైన బహుళజాతి సంస్థ - దీనికి పెక్కు బిలియన్ డాలర్ల పెట్టుబడులున్నాయి (నూరు మిలియన్లు ఒక బిలియన్). ఆ సంస్థలోని 44 వేల మంది ఉద్యోగులలో ఈ గ్రంథ రచయిత స్టాన్లీ ఆడమ్స్ ఒకరు. 1900 లో ప్రచారం పొందిన ఒకమాట ప్రకారం అతి పెద్ద పెట్టుబడిదారీ కబంధులను, ఉక్కు, పందిమాంసం, రైళ్ళ-చక్రవర్తులు అని పిలుస్తున్నారు. అదే పద్ధతిలో రోషేని, మందుల విటమిన్ల - చక్రవర్తి అని పిలవవచ్చు. యూరపులో పది, దక్షిణ అమెరికా ఏడు, ఆసియాలో మూడు, ఆఫ్రికా,

ఆస్ట్రేలియాలలో, మరికొన్ని రసాయన కంపెనీలపై ఈ సంస్థకు పెత్తనం ఉన్నది. అమెరికాకు, కెనడాలలోని శాఖలను రోషే ఉప సంస్థ ఒకటి నిర్వహిస్తున్నది.

రోషే సంస్థ కేంద్రం బాస్లే (స్విట్జర్లాండ్)లో ఉంది. 1964 కాలంలో ఈ సంస్థలో ఉద్యోగానికై 25 ఏండ్ల వయస్సుగల స్టాన్లీ ఆడమ్స్ బాస్లే వెళ్ళాడు. ఇతడు అప్పటికే మార్కెటింగులో నిపుణుడు. లండన్, ఆక్స్ఫర్డ్ విశ్వ విద్యాలయాల్లో పట్టభద్రుడు. ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లో పెక్కు, బ్రిటిష్, అమెరికన్ సంస్థల తరపున ఉద్యోగిగా పని చేసినవాడు. "రోషే సంస్థ వారి నిర్మాణ దక్షత అతి విస్తృతమైనది. నా గురించిన సర్వ సమాచారం నా కంటె ముందే పత్రాల రూపంలో వారి ఫైళ్ళలో ఉంచి. నన్ను గురించి, నాకే అంత సమాచారం తెలియదు" (4 వ పేజీ) ఆ ఉద్యోగంలో ఆడమ్స్ చేరి, విటమిన్లు, మందుల తయారీ విభాగంలో సాధారణ ఉద్యోగంలో చేరి 1972 కల్లా, ప్రపంచ వ్యాపితంగా ఆ వస్తువుల సరఫరా నిర్వహించే మేనేజరు పదవి పొందాడు

రోషే ఉన్నతోద్యోగుల బృందంలో ఆడమ్స్ ఒకడైనాడు. దాంతో యజమానులు చేసే అనేక మోసాలు, కుట్రల రహస్యాలన్నీ తెలుసుకోగలిగాడు. సాధారణ ఉద్యోగుల కివి తెలియవు. ఈ రహస్యాల ద్వారానే ఈ సంస్థ యావత్ పెట్టుబడిదారీ మార్కెట్ పైన ఆధిపత్యం వహిస్తున్నది." నా వ్యాపార హోదాలో నేను ప్రపంచ మంతటా, ముఖ్యంగా బడుగు దేశాలలో పర్యటించాను. మందుల తయారీ విధానాల ఫలితాలు చూశాను. అతి దరిద్రులైన ఆ దేశాల ప్రజలు, అతి ఖరీదైన ఈ మందులను కొనలేక పోవటం ప్రత్యక్షంగా చూశాను. ఉదాహరణకు భారతదేశంలో ఇన్ఫ్లుయంజా వ్యాధి వ్యాపించింది అని తెలియగానే, విటమిన్ 'సి'ని మరింత విస్తారంగా, చౌకగా మార్కెట్లోకి విడుదలచేయటానికి బదులు, సరఫరాను తగ్గించి, ధరలను పెంచటం ఈ సంస్థ పద్ధతి....రోషే కంపెనీ యాజమాన్యం, ఎంత అహంకారంతో, నిర్లక్ష్యంతో, తనకు ఇష్టమైన ఏ పని ఐనా చేయగలననే ధీమాతో వ్యవహరిస్తున్నది.దీంతో నాకు బోధపడసాగింది." (17 — 18 పేజీలు)

పెట్టుబడిదారీ ప్రపంచంలో నేడున్న 400 బహుళజాతి కంపెనీలలో ప్రతి ఒక్కటీ ఈ మోసాలన్నిటినీ చేస్తున్నది. వారికిగల ఆర్థిక శక్తి, పెట్టుబడిదారీ ప్రభుత్వాల అండ, ఫలితంగా ఎన్ని మోసాలు చేసినా వారికి రక్షణ లభిస్తున్నది.

1970 తొలి రోజుల్లో రాక్షసబల్లుల్లాంటి ఈ గుత్త సంస్థలు అన్ని విదేశీ పెట్టుబడులలో 90 శాతంపై ఆధిపత్యం కలిగివున్నాయి. నగదు రూపంలో వారి ఆస్తులు, ప్రధానమైన పాశ్చాత్యదేశాల బ్యాంకులు, అంతర్జాతీయ పెట్టుబడి సంస్థల ఆస్తులకు రెండు రెట్లు కంటె హెచ్చుగా ఉన్నాయి. ఒక దశాబ్దం తర్వాత బహుళ

జాతి సంస్థల ఉత్పత్తి, మొత్తం ప్రపంచ పెట్టుబడిదారీ దేశాల ఉత్పత్తిలో 40 శాతంగాను, విదేశీ వ్యాపారంలో 60 శాతంగాను, పరిశోధన, అభివృద్ధి రంగాలలో 80 శాతంగానూ పెరిగింది.

పెట్టుబడిదారీ వ్యవస్థను కుదిపివేసే సంక్షోభాల నుండి కూడా ఏమాత్రం దెబ్బతినకుండా శక్తివంతమైన ఈ బహుళజాతి సంస్థలు బైటపడగలవు. "పెట్టుబడిదారీ వర్గం మొత్తంగా నష్టపోవటం న్యాయం. వ్యక్తిగతంగా ఏ పెట్టుబడిదారు ఈ నష్టం భరిస్తాడు, అనగా అందులో అతని వాటా ఎంత అన్నది అతగాడి బలం, కౌటిల్యంపై ఆధారపడి ఉంటాయి. శత్రుత్వం కలిగిన సోదరుల మధ్య పోటీకి బదులు పోరాటం జరుగుతోంది. ఇందుకుగాను వీరు అవలంబించే ఎత్తుగడలన్నీ ఈ గ్రంథంలో వివరంగా వర్ణితమయ్యాయి. ఉదాహరణకు 'విశ్వాసపూరిత ఒప్పందాల' విషయం చూద్దాం. వినిమయదారులను తమ గుప్పిటలో పెట్టుకోటానికి రోషే సంస్థ అవలంబించే ఎత్తుగడలలో ఇది చాలా ముఖ్యమైనది. తన అవసరాలకు కావలసిన సరుకులన్నిటినీ తమవద్దనే కొనేటట్లుగా ఒక కంపెనీని రోషే సంస్థ ఒప్పిస్తుంది. సంవత్సరాంతానికి ఆ కంపెనీకి 5 లేక 10 శాతం విశ్వాసపు రాయితీ చెల్లిస్తుంది. "ఏదైనా ఒక చిన్న కంపెనీ, గుత్త ఉత్పత్తిదారుని సవాలు చేసే సాహసానికి పూనుకుంటే, ఆ కంపెనీ దివాలా తీయించేంతగా ఈ సంస్థ తన సరుకుల ధరలను తగ్గించగలదు. ఆ తర్వాత తన ధరలను పెంచగలదు. ఇవి చట్టవిరుద్ధమైన పద్ధతులు. కాని తన పోటీదారులను గొంతునులిమే విషయంలో రోషే కంపెనీకి ఎట్టి సంకోచాలులేవు. ధన సేకరణకై ఈ సంస్థ ఎన్ని అఘాయిత్యాలైనా చేస్తుంది" (15వ పేజీ)

మానసిక రోగులకు ప్రశాంతంగా నిద్రమత్తును కల్పించే రెండు మందులు, లిబ్రియా, వాలియా లను గ్రేట్ బ్రిటన్ 1970 లో దిగుమతి చేసుకుంటూ ఉండేది. అకస్మాత్తుగా వీటి ధరలను ఆ సంస్థ పెంచేసింది. ఇటలీలో ఈ సరుకుల కిలో ధర 9 పౌండ్లు—20 పౌండ్లు కాగా, బ్రిటన్‌లో కిలో 370,—922 పౌండ్లకు పెంచేసింది. 1966-72 సంవత్సరాల మధ్య ఒక్క బ్రిటన్‌లోనే ఈ సంస్థ 22 మిలియన్ పౌండ్ల లాభం సంపాదించింది. ఇదే విధమైన మోసాన్ని డెన్మార్క్, పశ్చిమ జర్మనీ, అమెరికా, కెనడాలలో కూడా చేసింది. ఆ తర్వాత ఇంతకంటె దారుణ చర్య వెల్లడైంది. ఈ నిద్రమత్తు మాత్రలను భారతదేశంలో తయారుచేయటానికి అంగీకరిస్తూ అంతవరకూ కిలో 380-400 రూ॥లుగా ఉన్న ధరలను అకస్మాత్తుగా 19,246-27,890 రూ॥లకు పెంచటానికి ప్రయత్నించింది.

గ్రేట్ బ్రిటన్‌లో పైన వివరించిన కుట్ర బైటపడి పెద్ద రభస జరుగుతుండగానే మరో కుట్ర బైటపడ్డది. స్టాన్లీ ఆడమ్స్ వ్యవహారం అంటే ఇదే. 1973

తొలి రోజుల్లో రోషే అవలంబిస్తున్న చట్టవిరుద్ధ పద్ధతులను గురించి బ్రస్సెల్స్ లోని యి.యి సి కేంద్ర కార్యాలయానికి (యూరోపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ) సమాచారం పంపాలని నిర్ణయించుకున్నాడు. ఆడమ్స్ తన గ్రంథంలో ఇలా రాసుకున్నాడు : "ఈ బహుళజాతి కార్పొరేషన్నూ, యూరపియన్ పెత్తందార్ల చేతిలోని (యి.యి.సి) అజమాయిషీ చేయగలదని నా తెలివితక్కువకొద్దీ ఆనాడు భావించాను" (20 వ పేజీ) ఆరు నెలల తర్వాత ఆడమ్స్ తన ఉద్యోగం నుండి విరమించుకుని ఇటలీలో స్థిరపడి వ్యవసాయం చేసుకోసాగాడు

దాంతో ఆడమ్స్ కష్టాలు మొదలయ్యాయి. కీలక స్థానంలో ఉంటూ తమ రహస్యాలన్నీ తెలుసుకుని బహిర్గతం చేసినందుకు ఆడమ్స్‌పై రోషే సంస్థ కక్ష కట్టింది.

ఆడమ్స్ యిచ్చిన సమాచారం ఆధారంగా యి. యి సి. అధికారులు రోషే కంపెనీపై దావా వేశారు. తమ సమాచార కేంద్రాన్ని రహస్యంగా ఉంచుతామని యి.యి.సి. అధికారులు మాట యిచ్చారు తనకు, తన కుటుంబానికి ఘోర విపత్తు రానున్నదని ఆడమ్స్ ఊహించనైనాలేదు.

ఆడమ్స్, అతని భార్య, ముగ్గురు పిల్లలు 1974 క్రిసమస్ సెలవులు గడపడానికి స్విడ్జర్లాండ్‌లో బంధువుల యింటికి వెళ్ళారు. సరిహద్దు దాటగానే ఆడమ్స్‌ను నిర్బంధించి పోలీసులు జైల్లో పెట్టారు. వ్యాపార రహస్యాలను, సంపుటీకృత ఆర్థిక సమాచారాన్ని విదేశీ రాజ్యాలకు అందచేశాడని అతనిపై నేరారోపణ చేశారు. స్విస్ చట్టం ప్రకారం ఇది దేశద్రోహంతో సమానమైన నేరం. ఆడమ్స్‌కు 20 సంవత్సరాల జైలుశిక్ష తప్పదని అతని భార్యకు తెలియచేయబడ్డది. నిరంతరం పోలీసులు, సమాచార సేకరణ పేరుతో వేధించటంతో ఆడమ్స్ భార్య ఆత్మహత్య చేసుకుంది 1975, జనవరి 11 న ఈ విషయం ఆడమ్స్‌కు తెలిసింది. ఆమె అంత్యక్రియలకు కూడా ఆడమ్స్ హాజరు కాలేకపోయాడు. రోషే కంపెనీ సూచన మేరకు ఆ రోజు ఆడమ్స్‌ను బాస్లే కారాగారానికి మార్చారు తాను జైలులో ఉన్న విషయాన్ని తోటి ఖైదీల ద్వారా మూడు నెలలకు ఆడమ్స్ తన స్నేహితులకు తెలియచేయగలిగాడు. స్నేహితులు, బంధువులు అంతా కలిసి, పెద్ద మొత్తంలో డబ్బు సేకరించి ఆడమ్స్‌ను జామీనుపై విడుదల చేయించారు.

సాధ్యమైనంత త్వరలో స్విట్జర్లాండ్ నుండి వెళ్ళిపోవలసిందిగా యి.యి.సి ఉద్యోగులు ఆడమ్స్‌కు సలహా యిచ్చారు. ఇటలీలోని పాడుబడ్డ తన వ్యవసాయ క్షేత్రానికి ఆడమ్స్ చేరుకున్నాడు. కాని రోషే కబంధ హస్తాలు అక్కడిదాకా విస్తరించి ఆడమ్స్‌ను నొక్కివేయసాగాయి. అతనికి రుణ సహాయం అందించటానికి అంతకుముందు అంగీకరించిన ఇటలీ ప్రభుత్వ సంస్థలు, బ్యాంకులు

వెనక్కు తగ్గాయి. తాకట్టులో ఉన్న అతని వ్యవసాయ క్షేత్రాన్ని ఋణదాతలు స్వాధీనపరుచుకున్నారు. ఆడమ్స్ తిరిగి దివాలాతీసి జైలుపాలయ్యాడు.

ఇటలీ ప్రభుత్వం ఆడమ్స్‌పై దూకటానికి వేరే కారణం వుంది. ఇటలీలోని సెవేసో పట్నంలో సువాసన ద్రవ్యాలు, పౌడులు తయారుచేసే ఒక రసాయన కర్మాగారం 1976 జులై 10 న అకస్మాత్తుగా బద్దలైంది. తెల్లటి విష మేఘాలు నగరాన్ని ఆవరించాయి. అందులో సైనైడ్ కంటె వేయిరెట్లు ప్రమాదకరమైన డయాక్సిన్ అను విషవాయు వుంది. ఈ ఫ్యాక్టరీ రోషే కంపెనీది. ఆ విషవాయు ప్రభావంతో ఆకాశంలో ఎగిరే పక్షులు నేలకు రాలాయి. పెంపుడు జంతువులన్నీ బాధతో మూలిగి చచ్చిపోయాయి. మానవ నష్టాలు జరిగాయి. నగరాన్ని వదలి వెళ్ళిన మహిళలు, అంగవికలురైన బాల బాలికలను ప్రసవించారు.

సెవేసోలోని ఈ ఫ్యాక్టరీ వారానికి 70 టన్నుల ట్రిక్లోరో ఫెనాల్‌ను ఉత్పత్తి చేస్తుంది. దీనిని వేడిచేస్తే డయాక్సిన్ అనే విషవాయువు ఉద్భవిస్తుంది. వియత్నాంపై అమెరికా దాడి జరిపినపుడు వేలాది పౌరులు తీవ్రమైన గాయాలకు గురికావటానికి కారణం డిఫోలియంట్ 24 S. T. దానినే ఏజెంట్ ఆరెంజ్ అంటారు. అందులోని ప్రధాన ద్రవ్యం ట్రిక్లోరోఫెనాల్.

సెవేసో ఫ్యాక్టరిలో తయారైన సరుకు, అమెరికాలోని క్లిఫిటన్ నగరంలోని రోషే కంపెనీ శాఖకు వెళుతుందని ఆడమ్స్‌కు తెలుసు. అక్కడనుండి ఎక్కడికి పయనించేది మాత్రం తెలియదు. ఈ సమాచారంలో కొంత భాగాన్ని ఆడమ్స్ ఇటలీ పాత్రికేయులకు తెలియజేశాడు. సెవేసో ఫ్యాక్టరీ నిర్మాణం చట్టవిరుద్ధంగా జరిగిందని కూడా చెప్పాడు. ఒక ప్రముఖ ఇటాలియన్ రాజకీయవేత్తతో ఒప్పందం ఇందుకు కారణం అని కూడా చెప్పాడు. ఇక ఆడమ్స్ జైలుపాలు కావటంలో ఆశ్చర్యమేముంది ?

ఈ కథ పర్యవసానమేమంటే, జామీనుపై విడుదల కాగానే ఆడమ్స్ 1981 లో గ్రేట్ బ్రిటన్ పారిపోయాడు. అతని తరపున వాదించటానికి యి.యి.సి నిరాకరించింది. 20వేల స్వల్ప మొత్తాన్ని అతనికి ముట్టచెప్పి నిజాయితీ, సాహసం గల ఈ వ్యక్తిని గాలికి వదిలివేసింది. నిజానికి ఆడమ్స్ అనుభవించిన ఆర్థిక నష్టంలో, నైతిక అవమానంలో యీ పరిహారం ఏ మూలకూ చాలదు. అంతేకాదు తనతో పరిచయమున్న ప్రతి యి.యి.సి ఉద్యోగి రోషే కంపెనీకి ఆ సమాచారాన్ని అందజేసి, ఆడమ్స్‌కు ద్రోహం చేసినట్లు వెల్లడైంది.

తన గ్రంథం చివరలో ఆడమ్స్ ఇలా రాసుకున్నాడు. "వ్యక్తుల క్షేమం విషయంలో యి.యి.సి కి (యూరపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ) ఎట్టి ఆసక్తి లేదని. తమకు అడ్డం వచ్చిన ఎవరినైనాసరే బలి యివ్వడానికి సిద్ధపడుతుందని

నేను ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నాను. రోం ఒప్పందం ప్రకారం ఈ యి. యి. సి ఏర్పడ్డది. యూరపియన్ దేశాలలోని లక్షలాది ఓటర్ల ప్రయోజనాలకంటె బడా పెట్టుబడిదారుల రక్షణే రోం ఒప్పందం పరమార్థమని నాకు బోధపడ్డది' (180 వ పేజీ)

ఈ గ్రంథ రచయిత పడిన బాధ, అనుభవించిన క్షోభ, వ్యక్తులపట్ల, జాతుల పట్ల గుత్త పెట్టుబడిదారుల నిర్లక్ష్యానికి ఒక తార్కాణం మాత్రమే. భారతదేశం లోని భోపాల్ దుర్ఘటనను జ్ఞప్తి చేసుకుంటే చాలు. అమెరికా రసాయనిక సంస్థ, యూనియన్ కార్బైడ్ నిర్లక్ష్యం ఫలితంగా 1984 డిసెంబరు 3వ తేదీన భోపాల్‌లో విషవాయువు బ్రద్దలై 2,500 మంది ప్రాణాలు బలిగొన్నది. 2 లక్షలమంది విష వ్యాధిగ్రస్తులైనారు. కంపెనీ యజమానులు ఆర్జించిన అపార లాభాలలో కొంత భాగాన్ని తగు రక్షణ చర్యలకు కేటాయించి ఉంటే ఈ ఘోరకలి జరిగేది కాదు. ఇంత దురంతం జరిగిన తర్వాత కూడా ఈ విషవాయువు నుండి రక్షణ పొందే ప్రక్రియను యూనియన్ కార్బైడ్ కంపెనీ స్థానిక అధికారులకు చెప్పలేదు అది రహస్యంగానే ఉండిపోయింది. భారతీయ పత్రికలు రాసినదాన్నిబట్టి అత్యంత ప్రమాదకరమైన ఈ విషవాయువుకు విరుగుడుగా పనిచేసేఔషధం సంపుటీకృత సైనిక రహస్యాల క్రిందకు వస్తుంది. నిజమే, యూనియన్ కార్బైడ్ దీర్ఘకాలంగా అమె రికా సైన్యాధికార సంస్థ అయిన పెంటగన్ పెద్ద కంట్రాక్టర్లలో ఒకటి.

రోషే, ఆడమ్స్ వివాదం అనే గ్రంథ సమీక్ష ముగిస్తూ నేనొక విషయం చెప్పదలచాను ఇందులోని సమాచారం, ఈ గ్రంథ ప్రచురణ సైతం ఎంతో విశిష్టమైనది. బహుళజాతి సంస్థలు సాగిస్తున్న అమానుష కృత్యాలను ఇంత వరకూ పాశ్చాత్య దేశాలలో బహిర్గతం చేయలేదు. ఈ విధంగా మౌనం వహి స్తున్న వారందరినీ ఉద్దేశించి ఈ గ్రంథకర్త యిలా అంటున్నాడు :

"స్నేహితులారా! ఒక ప్రశ్న మీరు వేయవచ్చు. నీ కింత హాని జరుగు తుందని తెలిస్తే ఈ వ్యాసాలన్నిటినీ బహిర్గతం చేసేవాడివేనా అని. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. నా భార్య ఆత్మహత్యను మినహాయిస్తే నే నిలా సమాధానం చెబుతాను. ఔను. నిస్సందేహంగా యిలాగే చేసి ఉండేవాడిని. ఏమంటే నేను కాదన్నా, యితరులు కాదంటే . నా పిల్లలకు, వారి పిల్లలకు ఇక రక్షణ ఎక్కడిది?



# కొమింటర్న్ 7 వ మహాసభ 50 వ వార్షికోత్సవం

## అంతర్జాతీయ గోష్ఠి

*కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 50 వ వార్షికోత్సవ సందర్భంగా ప్రాగ్‌లో అంతర్జాతీయ సమావేశం జరిగింది. "శాంతి కొరకు పోరాటం, యుద్ధ ప్రమాద వ్యతిరేకత, సామ్రాజ్యవాద దురాక్రమణ" అనే అంశంపై సాగిన ఈ గోష్ఠిలో 45 దేశాల మార్క్సిస్టు శాస్త్రవేత్తలు, కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధులు పాల్గొన్నారు.*

ఈ గోష్ఠిని వరల్డు మార్క్సిస్టు రివ్యూ ప్రధాన సంపాదకులు యూరిస్కాల్యా రోల్ ప్రారంభిస్తూ యిలా అన్నారు : కొమింటర్న్ ఏడవ మహాసభపై మూడవ సారి సమావేశం అవుతున్నాం. 1965 లో ఒకసారి, 1975 లో మరోసారి గతంలో ఇట్టి సమావేశాలు జరిగాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై ఆసక్తి కలిగించే విధంగా చర్చలు జరిగినాయి. ఇది సహజం. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క సిద్ధాంత రాజకీయ వారసత్వం శాశ్వత ప్రాధాన్యతను కలిగి ఉన్నది. ఏడవ మహాసభ నిర్ణయాలు ఒక నూతన దశను సూచించాయి. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని అవి సంపద్వంతం చేశాయి. సోదర పార్టీల వ్యూహము, ఎత్తుగడలు అవి రూపొందించాయి. ఫాసిజానికి ప్రతిఘటనతో ప్రపంచ యుద్ధంతో నాటి సమస్యలు ముడివడినాయి.

ఏడవ మహాసభ విస్తృతమైన సమస్యలను చర్చించింది. యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాటం, ఐక్య సంఘటనల ఏర్పాటు తదితర సమస్యలను చర్చించింది. యుద్ధ ప్రమాదానికి కారకులెవరో తెలిసింది. యుద్ధ వ్యతిరేక శక్తులను సమీకరించటం ద్వారా యుద్ధాన్ని నివారించగలమని ఆ మహాసభ ప్రకటించింది.

నేటి ప్రపంచ పరిస్థితి 1930 వ దశకం నాటికన్నా భిన్నమైంది. సోషలిస్టు దేశాలు, శాంతి శక్తుల బలం గణనీయంగా పెరిగింది. ఫాసిజం ఓడి పోయింది. సోషలిస్టు, జాతీయ ప్రజాస్వామిక విప్లవాలు విజయం సాధించాయి.

కాని గతంలో వలెనే నేడు కూడా మానవజాతి ప్రమాదకర పరిస్థితులలో ఉన్నది. అమెరికా సామ్రాజ్యవాద నాయకత్వంలో కరుడుగట్టిన అభివృద్ధి నిరోధకులు సోషలిజంపై యుద్ధాన్ని ప్రకటించారు. రెండవ ప్రపంచ యుద్ధ పరిపాలన తిరగదోడాలనే ప్రతీకారవాదం. పశ్చిమ జర్మనీలో తలెత్తింది. అది ప్రమాదకర విధానం.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు పోరాడే ప్రజలను అణచే హక్కు ఎవ రికీ లేదు. కాని సామ్రాజ్యవాదులకు హక్కు వున్నట్లుగా బూర్జువా సిద్ధాంత వేత్తలు, రాజకీయవేత్తలు భావిస్తున్నారు. ప్రతీఘాత విప్లవం ఎగుమతికి కమ్యూ నిస్టులు పూర్తిగా వ్యతిరేకం. శాంతి కొరకు జరిగే పోరాటంలో వారు అగ్రభాగాన నిలబడ్డారు. యుద్ధ వ్యతిరేక ఉద్యమానికి పూర్తిగా సహాయాన్ని అందిస్తున్నారు.



# చారిత్రక పిలుపు

**ఖలేద్ బాగ్దాష్**
*(సిరియా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి)*

నా 55 సంవత్సరాల పార్టీ జీవితంలో కొమింటర్న్ ఏడవ మహాసభ నా మనస్సుపై చెరగని ముద్ర వేసింది. దానికి నేను హాజరయ్యాను. రాంజీ పేరుతో ఆనాడు నేను వ్యవహరించాను. మహాసభ అధ్యక్షవర్గానికి ఎన్నుకోబడాను. జార్జి డిమిత్రోవ్, డిమిత్రి మేన్యులిస్కి, విల్ హెర్క్ పిక్, జోసఫ్ స్టాలిన్, పామిరో టోగ్లి యేటి, మారిస్ దోరో లాంటి అంతర్జాతియ కమ్యూనిస్టు ఉద్యమ నాయకుల సదస్సున కూర్చునే గౌరవం నాకు దక్కింది. నాకు నేనే ప్రశ్నించుకున్నాను. "అటువంటి మహా నాయకుల మధ్య నే నెవర్ని?" ఆనాడు నా వయస్సు కేవలం 23 సం॥ లు మాత్రమే. నాలో కొంత గందరగోళం ఏర్పడింది. కాని, చర్చల సరళి చూచిన తర్వాత నేను స్థిమితపడాను. యువకులపట్ల కొమింటర్న్ నాయకులు ఎంతో వాత్సల్యాన్ని ప్రదర్శించారు. వారు భవిష్యత్ మార్గానికి బాటలు వేశారు.

డిమిత్రి మాన్యులిస్కి ప్రసంగం నాకు ఇప్పటికీ గుర్తు ఉన్నది. సోవియట్ యూనియన్‌లో సోషలిజం తిరుగులేనిది అని స్పష్టీకరించాడు. పామిరో టోగ్లి యాటి మాట్లాడుతూ సోవియట్ దేశ, విదేశాంగ విధానాలను కమ్యూనిస్టులు బలపరచవలసిందిగా కోరారు. జార్జి డిమిత్రోవ్ ప్రతిభావంతమైన ప్రసంగం చేశారు. కమ్యూనిస్టు ఉద్యమ లక్షణాలను వివరించారు. ఫాసిజం బర్బరత్వాన్ని బహిర్గతం చేశారు. యుద్ధానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా ఐక్యతకు పిలుపు ఇచ్చారు.

మహాసభ అనంతరం మా పార్టీ తన ఎత్తుగడ పంథాను సవరించుకుంది.

జాతీయ బూర్జువా వర్గం పట్ల పట్టువిడుపులు గల పంథాను అనుసరించి జాతీయ ఉద్యమ ప్రవాహంలో సిరియా కమ్యూనిస్టులు చేరారు. దేశభక్తియుత సంస్థలతో సహకారాన్ని ఏర్పరచుకున్నారు.

7 వ మహాసభ సాధారణ భావాలు నేటికీ అనుసరణీయాలే. శాంతి శక్తులను ఐక్యపరచే కర్తవ్యం నేడు ఏర్పడింది సోషలిస్టు దేశాల సైనిక, రాజకీయ, ఆర్థిక బలంతో యుద్ధోన్మాదుల పథకాలను నేడు ప్రతిఘటించటం జరుగుతుంది.

మా ప్రజలు, సిరియా జాతీయ సంఘటన ప్రభుత్వము, సైన్యము సోవియట్ శాంతి చొరవను పూర్తిగా సమర్థిస్తున్నాయి. అణుయుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా సిరియన్లు చేయగలిగినదంతా చేస్తున్నారు. 

# మహాసభ స్ఫూర్తి

బ్రూనోఫ్రుచ్
(ఆస్ట్రియా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి)

నా తరం కమ్యూనిస్టులలో కామింటర్న్ 7 వ మహాసభ స్మృతులు సజీవంగా మెదులుతున్నాయి. 1935 లో నేను, వియన్నా కమ్యూనిస్టు లీగ్ ముఖ్య కార్యకర్తగా అజ్ఞాత జీవితం గడుపుతున్నాను. మాలాంటి యువ కమ్యూనిస్టులకు నాటి పరిణామాలు సమగ్రంగా తెలియవు జర్మనీలో, ఆస్ట్రియాలో కార్మికవర్గం ప్రజాస్వామ్యం ఎందుకు ఓడిపోయినాయో మాకు స్పష్టంగా తెలియదు. మేము ఏమి చేయాలి ? అనే స్పష్టమయిన అవగాహన కూడా లేదు. అనేక సమస్యల మీద మా అవగాహన అస్పష్టంగా వుంది. సోషల్ డెమొక్రాట్‌ల యెడ మన వైఖరిని గురించి యితర దేశభక్తియుత ప్రజాతంత్ర క్రిస్టియన్ సెక్షన్ల గురించి మాకు సమగ్ర ఆలోచన లేదు. మాలో చాలామందికి పిడివాదాలోచన ఉండేది. కొంత అనిశ్చిత కనిపిస్తున్నది. మా కార్యక్రమం ప్రధానంగా రాజకీయ ఆందోళనకు పరిమితమై ఉన్నది. అది ఆశించిన ఫలితాలను యివ్వలేదు మన పార్టీ నాయకులు, కార్యకర్తలు చాలామంది అరెస్టు అయినారు లక్ష్యదృష్టి మాకు కొరవడింది అని మేము భావించాం. సకల సమీకరణకు మార్గమేమిటో తెలియలేదు అయితే ట్రేడ్ యూనియన్ రంగంలో మన ఆలోచన, పని విధానం అప్పటికే మారుతున్నది. ఈ పరిణామాన్ని జార్జి డిమిట్రోవ్ తన రిపోర్టులో ప్రస్తావించారు

వియన్నా నడిబొడ్డున ఒక పుస్తకాల షాపు ఉంది. అందులో విదేశీ వార్తా పత్రికలు దొరుకుతాయి. మహాసభ జరుగుతున్న కాలంలో ఫ్రెంచి కమ్యూనిస్టు వార్తాపత్రిక "లాహ్యూమనైట్" ను కొన్నాను. దానిలో డిమిట్రోవ్ నివేదిక సంగ్రహ పాఠం ఉంది. లీప్జిగ్ విచారణ నాటినుండి ఆయన అంటే మాకు ఎనలేని గౌరవం. ఆ రాత్రికి రాత్రే ఇంటివద్ద ఆయన ప్రసంగ పాఠాన్ని జర్మనీ భాషలోకి అనువదించాను. జిల్లా కమిటీ కామ్రేడ్స్‌తో విషయాన్ని చెప్పి చర్చించాను.

ఆ మరుసటి ఆదివారంనాడు వియన్నా అడవుల్లో జిల్లా కమిటీ సభ్యుల సమావేశాన్ని ఏర్పాటు చేసేందుకు నిర్ణయించాం. ఆ సమావేశంలో డిమిట్రోవ్ నివేదికను పేరా తరువాత పేరా చదివి చర్చించాం. ఆ తరువాత మా కార్యకలాపాలకు సంబంధించి దాని వెలుగులో కొన్ని నిర్ధారణలకు రాగలిగాం. ఆ నివేదిక మమ్ములను ఎంత ఉత్సాహపరిచిందో ఇప్పటికీ బాగా గుర్తుంది. పార్టీ నాయకత్వ సూచనల ప్రాతిపదికగా మా పని విధానాన్ని రూపొందించుకున్నాం. ఫాసిస్టు వ్యతిరేక ఐక్య సంఘటన నిర్మాణానికి కృషి చేశాం.

ప్రభుత్వ పత్రికలు మాపై నిందలవర్షం కురిపించాయి. క్యాథలిక్కు సెక్షన్లలో ఇతర యువజన సంస్థలతో చొచ్చుకు పోయేందుకు ట్రోజన్ హార్స్ ఎత్తుగడల పద్ధతులను అవలంబిస్తున్నామని వారు ఆరోపించారు. కొంతమంది అతివాదులు దీనిని వర్గ సామరస్యంగా ఆరోపించారు. ఇలాంటి వక్రీకరణలకు మాకు చేతనైన సమాధానం ఇచ్చాం. ఎన్నుకున్న లక్ష్యంనుండి మేము ప్రక్కకు మరలలేదు. కొత్త విధానం ఆచరణలో అనేక సత్ఫలితాలను ఇచ్చింది. ఫాసిస్టు వ్యతిరేక ప్రతిఘటన చరిత్రనుండి వీటిని ఎవరూ రూపుమాపలేరు. ఆస్ట్రియా స్వాతంత్ర్య పునరుద్ధరణకు ఈ పోరాటం ఎంతగానో తోడ్పడింది.

7వ మహాసభ నిర్ణయాలు ఎంతో ప్రభావాన్ని కలిగించాయి. గత 40 సం॥ కాలంలో సామాజిక జీవితం అనేక మార్పులు చెందింది. మహాసభ అభిప్రాయాల శాశ్వత ప్రాధాన్యతను జరుగుతున్న చరిత్ర ధృవీకరించింది. నేటి కాలంలో మా పార్టీ సోషలిస్టులతో, క్రిష్టియన్లతో సహకరిస్తూ శాంతి ఉద్యమానికి పాటుపడుతున్నది. కార్మికవర్గ ఐక్యతకు కృషిచేస్తున్నది. తటస్థ ఆస్ట్రియాదేశం ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని నివారించటంలో తన వంతు పాత్రను నిర్వర్తించేందుకు మా పార్టీ శక్తికొలదీ ప్రయత్నిస్తున్నది. కమ్యూనిస్టు ఐక్యతకొరకు మా పార్టీ నిలబడింది. 

# పరిష్కార అన్వేషణలో

ప్రొఫెసర్ ఖటూలిస్ జకోవే

(హంగరీ)

1920 వ దశకంలో సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు సాగించిన దురాక్రమణ ఫలితంగా అంతర్జాతీయ ఉద్రిక్తత ఏర్పడింది. ప్రపంచ సంఘర్షణగా మారే ప్రమాదం ఏర్పడింది. ఆ దశలో యుద్ధ ప్రమాదం నిరంతరం పొడచూపుతూ వచ్చింది. ఈ సమస్యలను నాటి కమ్యూనిస్టు ఉద్యమం చర్చించింది. 1922 ఫిబ్రవరి, మార్చి మాసములలో కొమింటర్న్ కార్యవర్గ కమిటీ సమావేశం యుద్ధ ప్రమాదాన్ని నివారించేందుకు అనుసరించవలసిన చర్యలను నిర్ణయించింది. విప్లవ పోరాటాలను తీవ్రతరం చేసేందుకు, సైద్ధాంతికంగా నిర్మాణ రీత్యా ప్రజలను సంసిద్ధం చేయాలని అది కోరింది.

ఆ తరువాత దశలో ఈ వైఖరిలో కొంత మార్పు చేయవలసి వచ్చింది. 1928 లో కొమింటర్న్ 6 వ మహాసభ జరిగింది. సోవియట్ యూనియన్ శాంతికి పెట్టనికోటగా ఉంది అని ఆ మహాసభ తీర్మానం ఇచ్చింది. యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాటం జరపాలని నిర్ణయించింది. యూరప్‌లోని పెట్టుబడిదారీ దేశాలన్నీ సామ్రాజ్యవాద యుద్ధ సన్నాహాల్లో ఉన్నాయని పేర్కొంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం మారిన పరిస్థితులను 1930 వ దశకం ప్రారంభంలో తిరిగి సమీక్షించింది. జర్మనీలో ఫాసిజం అధికారంలోకి వచ్చింది. కార్మిక ఉద్యమం బలంగాఉన్న దేశంలో ఇది జరిగింది. 1933 లో కొమింటర్న్ కార్యవర్గ కమిటీ సమావేశం జరిగింది. పెట్టుబడిదారీ దేశాలమధ్య రాజుకుంటున్న సంఘర్షణల గురించి, యుద్ధ ప్రమాదాన్ని గురించి చర్చించింది. కాని ప్రజాస్వామ్యమూ, ఫాసిజమూ– వాటి మధ్య సంఘర్షణ నాటి ప్రధాన సంఘర్షణగా ఇంకా కొమింటర్న్ భావించలేదు.

కొమింటర్న్ 7 వ మహాసభ ప్రారంభం కానున్న తరుణంలో యుద్ధ స్వభావంపై ఆసక్తికరమైన చర్చ జరిగింది. ఫాసిజం వ్యతిరేక పోరాటాన్ని కార్మికవర్గం

యొక్క మిత్రుల పరిధిని విస్తృత పరచటంపై కమ్యూనిస్టులలో నూతన అవగాహన ఏర్పడింది. యుద్ధమే ప్రారంభమయ్యే పక్షంలో కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో సోవియట్ యూనియన్ మిత్రులుగా వ్యవహరించే అవకాశాలు ఏర్పడినాయి. మరికొన్ని దేశాలు తటస్థ వైఖరిని అవలంబించవచ్చు. చర్చలలో కొన్ని తీవ్ర సమస్యలు ముందుకు వచ్చినాయి సోవియట్ యూనియన్‌తో సహకరించే పెట్టుబడిదారీ దేశాలలో కమ్యూనిస్టుల ఎత్తుగడలు ఎలా ఉండాలి? యుద్ధాన్ని నివారించటంలో విభిన్న సామాజిక, రాజకీయ శక్తులపట్ల మన వైఖరి ఎలా ఉండాలి? ఇలాంటి ప్రశ్నలు 1930 దశకంలో కమ్యూనిస్టులను ఎదుర్కొన్నాయి. ఆ సమస్యలు నేడు కూడా మరొక రూపంలో వ్యక్తమవుతున్నాయి.

అనేక దేశాలలో ఫాసిజం విజయం పొందటం కారణంగా పెట్టుబడిదారీ ప్రపంచంలో రాజకీయ శక్తుల విభజన ఏర్పడింది అనే భావాన్ని కమ్యూనిస్టులతో ఒప్పించటం కష్టంగా ఉండేది. మిత్రవర్గాల పరిధి విస్తృతమయ్యే అవకాశాలు స్పష్టంగా వ్యక్తమయ్యాయి. కమ్యూనిస్టుల చర్చలు ఎన్నో సానుకూల ఫలితాలను ఇచ్చింది.

జార్జి డిమిట్రోవ్, పామిరో టోగ్లియాటీల నివేదికలు కమ్యూనిస్టుల అవగాహనా శక్తిని పెంచాయి. శాంతికొరకు జరిగే పోరాటంలో కార్మికవర్గంతోపాటు సోషల్ డెమోక్రాట్ల వెనుకఉన్న ప్రజలు, క్యాథలిక్కులు, స్త్రీలు, యువకులు, పెట్టీ బూర్జువా సెక్షనులు, మేధావులు పాల్గొనే అవకాశం ఉందని వారు స్పష్టం చేశారు. దేశ రక్షణ యుద్ధాలలో బూర్జువాయిజీతో సహకరించే అవకాశం ఉండాలని కూడా వారు చెప్పారు. యుద్ధాన్ని నివారించే అవకాశాలు ఉన్నాయని మహాసభ విశ్వాసాన్ని ప్రకటించింది.

మహాసభ నిర్ణయాలు గొప్ప సిద్ధాంత పురోగతిని సాధించాయి. కమ్యూనిస్టుల శక్తి సామర్థ్యాలపట్ల ప్రజలలో గౌరవభావం ఏర్పడింది.

నేడు అంతర్జాతీయ సంబంధాలతో ప్రమాదకర ధోరణులు తలెత్తాయి. సోషలిస్టు దేశాలు శాంతి విధానాన్ని అవలంబించటం ద్వారా పరిస్థితులు చేయిజారిపోకుండా నిర్ణాయకపాత్ర వహిస్తున్నారు, కాని అది ఒక్కటే చాలదు. పెట్టుబడిదారీ దేశాలలోని శాంతి శక్తులు ఇంకా పెద్ద ఉద్యమాలను నిర్వహించవలసి ఉన్నది. బూర్జువా రాజకీయ వేత్తలలో కొంతమంది వాస్తవిక ధోరణిని ప్రదర్శిస్తున్నారు. శాంతిని పరిరక్షించటంలో వీరి పాత్ర సానుకూలంగా ఉంది. యుద్ధ వ్యతిరేక ఉద్యమాలు కొన్ని దేశాలలో దేశవ్యాప్త ఉద్యమాలుగా మారినాయి. రాజకీయ సిద్ధాంత భేదాభిప్రాయం కలిగి ఉన్నప్పటికీ ఇట్టి ప్రజా కార్యాచరణ విస్తృతరూపం తీసుకోవటం మంచి పరిణామం.



# కీలకమైన సమస్య

ప్రొఫెసర్ స్కమాచర్
(జర్మన్ సోషలిస్టు యూనిటీ పార్టీ)

చరిత్రలో మొదటిసారిగా జర్మనీ గడ్డమీద ఏర్పడిన ఒక ప్రభుత్వం శాంతి విధానానికి అధికార సిద్ధాంతంగా ప్రకటించటం ఇదే మొదటిసారి. జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లికన్ అవతరణ నాటినుండి సుస్థిరశాంతి కొరకు దాని ప్రభుత్వం కృషిచేస్తూ వచ్చింది. ఫాసిజం ఓటమి చెందటం, సోవియట్ యూనియన్ దాని మిత్రదేశాలు గెలవటం, సమకాలీన రాజకీయ ఘట్టాలలో ఒక ప్రధాన ఘటంగా నిలుస్తుంది. అవి జరిగి నేటికి 40 సం॥లు గడిచాయి. ఫాసిస్టు దానిసత్వం మనవి. జర్మనీలో ఒక భాగం విముక్తి చెందింది.

జర్మనీ కార్మిక ఉద్యమచరిత్ర శాంతి పరిరక్షణ విధానానికి అంకితమై ఉంది. జర్మన్ కమ్యూనిస్టు పార్టీ సంస్థాపకులు కారల్ లీబ్‌నెజ్ జర్మనీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడారు. 1914 లో ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా నిలిచారు. విప్లవ విజయంకోసం తన జీవితాన్ని ధారపోశాడు. కొమింటర్న్ ఏడవ మహాసభ భావాల వెలుగులో జర్మన్ కమ్యూనిస్టు పార్టీ, 1935 బ్రస్సెల్స్ మహాసభలోనూ, 1939 బెర్న్ మహాసభలోనూ అనేక ప్రధాని నిర్ణయాలను తీసుకుంది. ఫాసిస్టు ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు ప్రజాస్వామిక రిపబ్లికన్ స్థాపనకు జర్మన్ కమ్యూనిస్టు పార్టీ పిలుపునిచ్చింది. ఎర్నెస్ట్ థైల్‌మాన్ నాయకత్వంలో జర్మన్ కమ్యూనిస్టులు ఫాసిస్టు వ్యతిరేక పోరాటాన్ని సాగించారు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని నిరోధించగలమనే లక్ష్యాన్ని కొమింటర్న్ ప్రతిపాదించింది. లక్షలాదిమంది ప్రజల మనస్సులను ఆందోళనపరుస్తున్న ఈ సమస్యకు కమ్యూనిస్టులు ఒక్కరు మాత్రమే నాడు సమాధాన మివ్వగలిగారు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ భావాలకు మహాసభ నిర్దిష్ట రూపం ఇచ్చింది. సోషలిజం బలం పెరుగుతున్నకొద్దీ శాంతి పరిరక్షణ శక్తులు కూడా పెరుగుతూ ఉంటాయి. ప్రపంచ వ్యాపిత శాంతి సంఘటిత నిర్మాణానికి

మహాసభ పిలుపు ఇచ్చింది. కమ్యూనిస్టులు, సోషల్ డెమొక్రాట్‌ల మధ్య సహకారానికి గల విశిష్ట ప్రాధాన్యతను మహాసభ నొక్కి చెప్పింది. విశాలమైన అంతర్జాతీయ ఉద్యమ స్థాపనకు ఇది అవసరమని ఉద్ఘాటించింది. కమ్యూనిస్టులు, సోషల్ డెమొక్రాట్‌ల మధ్య సిద్ధాంత, రాజకీయ వైరుధ్యాలు సమసిపోనప్పటికీ వారి సహకారంకోసం మహాసభ ఎంతో ప్రాధాన్యతను ఇచ్చింది. అయితే దురదృష్టవశాత్తూ ప్రపంచ వ్యాపిత శాంతి సంఘటన ఏర్పడలేదు. సామ్రాజ్యవాద దేశాలు సోవియట్ వ్యతిరేక విధానాన్ని అవలంబించాయి. కొంతమంది మితవాద సోషల్ డెమొక్రాట్‌లు కూడా కమ్యూనిస్టు వ్యతిరేక వైఖరిని అవలంబించారు.

హిట్లర్ వ్యతిరేక ఐక్యసంఘటన, యుద్ధకాలంలో మాత్రమే ఏర్పడింది. సోవియట్ రెడ్‌ఆర్మీ విజయపరంపర పురోగతి కాలంలో మాత్రమే ఇది సాధ్యమయింది, కనుకనే కొమింటర్న్ ఏడవ మహాసభ చేసిన ఒక ముఖ్య నిర్ధారణను మనం మరువరాదు. యుద్ధం ప్రారంభం కాకముందు వాటికి వ్యతిరేకంగా పోరాడాలి.

నేడు అమెరికా సామ్రాజ్య వాదంనుండి యుద్ధ ప్రమాదం ఏర్పడింది. సోషలిస్టు దేశాలతో సంఘర్షణ విధానాన్ని అవలంబిస్తుంది. అయితే ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రపంచ వ్యాపిత సంఘటనకు కావలసిన పరిస్థితులు నేడు ఏర్పడినాయి.



# అనుభవం ప్రాతిపదికగా

— హన్స్ సిన్‌వో

(జర్మని కమ్యూనిస్టుపార్టీ)

కొమింటర్న్ 7 వ మహాసభ భావాలు. నేటికీ పశ్చిమ జర్మనీ కమ్యూనిస్టులకు అర్థవంతమయినవి; చారిత్రక ప్రాధాన్యత కలిగినవి. జర్మనీ గడ్డ నుండి యుద్ధం తిరిగి ఎన్నడూ ప్రారంభంకారాదు. గత అనుభవంనుండి తీసుకోవలసిన గుణపాఠం యిదే. యూరప్‌లో అమెరికా మిసిలీల ఏర్పాటుకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు, ఆర్థిక, సామాజిక సమస్యలపై కార్మికవర్గ పోరాటాలు, సంయుక్త కార్యాచరణకు పునాదిని విస్తృత పరుస్తున్నాయి.

1980 నుండి యుద్ధ ప్రమాదం పెరిగిన ఫలితంగానూ, ఆర్థిక సంక్షోభం తీవ్రమయినందువల్లనూ కమ్యూనిస్టులు, సోషల్ డెమోక్రాట్ల మధ్య వుమ్మడి ప్రయోజనాలు ముందుకువచ్చాయి. రాజకీయ, సిద్ధాంత భేదాభిప్రాయాలు కొనసాగుతున్నప్పటికీ ఐక్యతాంశాలు ప్రాధాన్యత వహించాయి.

పశ్చిమ జర్మనీలో సోషల్ డెమాక్రటిక్ పార్టీ ప్రతిపక్ష స్థానంలోకి వెళ్ళటంతో దాని రాజకీయ భావనలలో గణనీయమైన మార్పులు వచ్చాయి. అమెరికా మిసిలీల మోహరింపుకు "అవును" అన్న పార్టీ నేడు "కాదు" అంటున్నది. ఆర్థిక, సామాజిక విధానంలో కార్మికుల ప్రయోజనాలవైపు మొగ్గువున్నది. ట్రేడ్ యూనియన్ కోర్కెలను ఆ పార్టీ సమర్థిస్తున్నది. సోషల్ డెమాక్రటిక్ పార్టీకి, మితవాద పార్టీలకు మధ్య దూరం పెరుగుతున్నది. కమ్యూనిస్టుపార్టీతో, యితర వామపక్ష పార్టీలతో సాన్నిహిత్యం పెరుగుతున్నది.

అయితే కమ్యూనిస్టులం అందరం, అన్ని శాఖలు యిట్టి నూతన అవకాశాలను వుపయోగించుకొనలేక పోతున్నాం. సమిష్టి కార్యాచరణను పెంపొందించుకోలేకపోతున్నాం. బహుశ గత అనుభవం వెన్నంటుతూవుందేమో! గతంలో

సోషల్ డెమాక్రటిక్ ప్రభుత్వం అమెరికా మిసిలీలను ఆహ్వానించింది. ఉద్యోగాలను కత్తిరించింది.

శాంతి ఉద్యమం పెంపుదలకు కీలకమైన అంశం కార్మికవర్గ కార్యాచరణ. పశ్చిమ జర్మనీలో వివిధ ట్రేడ్‌యూనియన్‌ల మహాసభలలో శాంతి. నిరాయుధీకరణలపై స్పష్టమైన వైఖరి వ్యక్తమవుతున్నది. కార్మికవర్గం తమ సామాజిక, ప్రజాస్వామిక హక్కులకై పోరాడుతున్నది. "మిసిలీల బదులు ఉద్యోగాలు", "బాంబులు బదులు విద్య" వంటి నినాదాలు మారుమ్రోగుతున్నాయి.

నిరుద్యోగ తీవ్రతను అధిగమించేందుకు జర్మన్ ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్ ఒక కార్యక్రమాన్ని ఆమోదించింది. ఆయుధ ఖర్చులలో సంవత్సరానికి 10 శాతం కోతపెట్టాలని క్రమంగా అది 50 శాతానికి తగ్గించాలని ట్రేడ్‌యూనియన్లు కోరుతున్నాయి. ఆయుధసల్వాలకు, నిరుద్యోగానికివున్న సంబంధాన్ని ప్రజల దృష్టికి తీసుకువెళ్ళేందుకు యిది ఒక చక్కని వుదాహరణ మాత్రమే.

ఫ్యాక్టరీ స్థాయిలో "శాంతి కొరకు పోరాట" కమిటీల ఏర్పాటు జరిగింది. అటువంటివి 300 కమిటీలు పనిచేస్తున్నాయి కమ్యూనిస్టులు, సోషల్ డెమాక్రట్లు, యితరులు, శాంతి సమస్యలను కార్మికులకు వివరిస్తున్నారు. ★

# సి. పి. ఐ - సి. పి. ఐ. (ఎం) సంబంధాలు: కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు

— జగన్నాథ సర్కార్

భారత కమ్యూనిస్టుపార్టీ చీలిక తాలూకు రెండు దశాబ్దాల చేదు అనుభవం మూలంగా, ఒకనాడు చీలికను గట్టిగా బలపరచిన కామ్రేడ్ల మనసుల్లో కూడా కొన్ని పరిశోధనాత్మక ప్రశ్నలు తలెత్తుతున్నాయి. సి.పి.ఐ. [ఎం] కేంద్ర పత్రిక 'పీపుల్స్ డెమొక్రసీ' సంపాదకులు శ్రీ ఎం. బసవపున్నయ్య అభిప్రాయం ప్రకారం "1964 నాటి చీలిక సరైందా? కాదా? అనే సమస్యపైనా చీలికవల్ల భారతదేశంలోని కార్మికవర్గ లక్ష్యానికి లాభం జరిగిందా? అన్న విషయంపైనా కమ్యూనిజం లక్ష్య హితైషుల్లోనూ సానుభూతిపరుల్లోనూ చర్చ జరిగింది; ఇప్పుడూ ఆ చర్చ కొనసాగుతున్నది.

అత్యంత కాలానుగుణమైన. న్యాయబద్ధమైన యీ సమస్యపై ప్రశాంతంగా ఆలోచించడానికి బదులుగా సి. పి. ఐ. [ఎం] నాయకులు సి. పి. ఐ. కమ్యూనిస్టుపార్టీ కాదు అని ప్రకటిస్తూ, సి. పి. ఐ కి వ్యతిరేకంగా ఉద్రేకాలను రెచ్చగొట్టడం ద్వారా దృష్టిని పక్కదారి మళ్ళించడానికి ప్రయత్నిస్తున్నారు. సి.పి.ఐ. [ఎం] పొలిట్‌బ్యూరో యిలా అంది; "మార్క్సిజం-లెనినిజంకు సంబంధించిన సి. పి. ఐ. అవగాహన పొరపాటు అవగాహన. కాబట్టి అది కమ్యూనిస్టు పార్టీ కాదని సి. పి. ఐ. [ఎం] చిత్తశుద్ధిగా నమ్ముతున్నది; ఆ మేరకు తమ కేడర్లకు బోధిస్తున్నది."

సి. పి. ఐ. [ఎం]కి వ్యతిరేకంగా ఇలాటి విశేషణాలే సి. పి. ఐ. కూడా వెల్లడించవచ్చునని, సి. పి. ఐ. [ఎం] "మార్క్సిస్టు. లెనినిస్టు పార్టీ"కాదని ప్రకటించవచ్చునని ఆ పార్టీనాయకులు సి. పి. ఐ. ని ఎంతో దయతో సూచించారు.

అయితే వారిపై నిందలువేయడం ద్వారా వారి కోరికను మన్నించాలన్న సంకల్పం సి. పి. ఐ. కి లేదు. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ఏకీకరణ

సమస్య అన్నది మహా గంభీరమైనది దీనిని ప్రహసనంగా మార్చరాదు. ఈ మహత్తర ప్రాచీన దేశంలో నివసిస్తున్న 70 కోట్ల జనుల జీవితాలతోనూ, భవిత వ్యాలతోనూ ఈ సమస్య ముడిపడివుంది. వ్యాస పరంపరలో తలెత్తిన సమస్యలపై చర్చించాలని 'న్యూయేజ్' పత్రిక భావిస్తున్నది. అందుకే ఈ వ్యాసం. — సం॥

(న్యూ యేజ్)

ఇటీవల సి. పి ఐ; సి. పి. ఐ. (ఎం) మధ్య సంబంధాలు మరింత ప్రకో పించాయి. వాస్తవానికి యీ సంబంధాలెప్పుడూ సౌహార్ద్ర పూరింతంగాలేవు. ద్విపక్ష సంబంధాలు అభివృద్ధిచెందిన గత ఏడేళ్ళకాలంలో కూడా ఎగుడు దిగుళ్లు కొన్ని సందర్భాలలో కుదుపులు కూడా వున్నాయి.

సి పి. ఐ. కమ్యూనిస్టుపార్టీ కాదని మహా అయితే వామపక్ష పార్టీగానే దానిని తాను పరిగణిస్తానని సి.పి.ఐ (ఎం) పొలిట్‌బ్యూరో సభ్యులు ఎం. బసవ పున్నయ్య ప్రకటించిన అనంతరం జూన్ 22 వ తేదీన ఆ పార్టీ పొలిట్‌బ్యూరో ఒక ప్రకటన విడుదలచేసింది. అందులో బసవపున్నయ్య అభిప్రాయాన్ని లాంఛన పూర్వకంగా ఆమోదించారు. ఆ ప్రకటనలో ఇలా వుంది :

కొన్ని వర్తమాన సమస్యలపై ఉభయ పార్టీల మధ్య కొంత మేరకు అవ గాహన కుదిరినప్పటికీ, మౌలికమైన సైద్ధాంతిక-రాజకీయ సమస్యలపై ఈ పార్టీల విభేదాలు ఇప్పటికీ వున్నాయి. భారతదేశానికి అన్వయించే మార్క్సిజం— లెనినిజం సూత్రాల ప్రాతిపదికపై ఈ రెండు పార్టీలు, ఏ సమస్యలపై అయితే విభిన్నమైన మార్క్సిజం — లెనినిజం సూత్రాల భాష్యం చెబుతున్నారో అలాటి సమస్యలపై సూత్రబద్ధమైన అభిప్రాయాల మార్పిడి విషయంలో వెనుకాడరాదు.

"ఎటొచ్చీ, ఇట్టి సూత్రాలను అవగాహన చేసుకోవడంలోనూ, భారతదేశం లోని వర్తమాన పరిస్థితులకు, వర్తమాన ప్రపంచ పరిస్థితులకు వాటిని అన్వయిం చేయడంలోనూ ఐక్య పార్టీలో విభేదాలు వచ్చాయి; ఆ విభేదాలు చీలికకు కూడా దారి తీశాయి; చీలిక తర్వాత కూడా యీ సైద్ధాంతిక సమస్యలపై యీ రెండు పార్టీలు పరస్పర పోరాటం జరుపుకొన్నాయి.

మార్క్సిజం-లెనినిజంకు సంబంధించిన సి. పి ఐ. అవగాహన పొరపాటు అవగాహన అని సి.పి. ఐ. (ఎం) చిత్తశుద్ధిగా భావిస్తున్నది. ఆ విషయం తన కేడ ర్లకు బోధిస్తున్నది. అందుకే కామ్రేడ్ బసవపున్నయ్య ఆ భావం వ్యక్తీకరించారు.

"సి.పి.ఐ. (ఎం) అవగాహన కూడా పొరపాటు అవగాహన అని, అందు వల్ల అది మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ కాదని సి పి.ఐ.కి కూడా భావించడానికి స్వేచ్ఛ వుంది. ఆ మేరకు ఆ విషయం అది తన కేడర్లకు బోధించనూవచ్చు.

సంయుక్త కార్యాచరణపై మనం చేసుకున్న ఒప్పందం, మార్క్సిజం - లెనినిజం సూత్రాలకు సంబంధించి మన పార్టీల అవగాహనలకు వర్తించదు."

## మార్క్సిజం - లెనినిజం పట్ల అవగాహన

సి.పి.ఐ. (ఎం)తో సంబంధాలు నిర్మించుకొనే విషయంలో మన పంథాను రూపొందించుకొనేందుకుగాను మార్క్సిజం - లెనినిజం పట్ల సి. పి. ఐ. (ఎం) వ్యక్తీకరించిన అవగాహనను, ఆ పార్టీ సిద్ధాంతాన్ని పరిశీలించటం అవసరం. ఈ విషయంలో సి.పి.ఐ. (ఎం) నాయకత్వం రచించిన వ్యాసాలను, ప్రకటనలను వుపయోగించటం వుపయుక్తంగా వుంటుంది.

జూన్ 22 వ తేదీన సి.పి.ఐ. (ఎం) పొలిట్‌బ్యూరో ప్రకటన విడుదల చేసిన అనంతరం, ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ జూన్ 23 వ తారీఖున 'పీపుల్స్ డెమోక్రసీ' పత్రికలో ఒక సుదీర్ఘ వ్యాసం రాశారు. ఆ వ్యాసం శీర్షిక "20 యేళ్ళ పీపుల్స్ డెమోక్రసీ: పరిపూర్తి ఐన నిబద్ధతలు" గత 21 సంవత్సరాలుగా సి. పి. ఐ. (ఎం) రూపొందించుకున్న వాగ్దానాలు - రాజకీయ వైఖరిని వ్యక్తీకరించడానికి ప్రయత్నించడంతోపాటు సి.పి.ఐ. (ఎం) కేడర్లకు అధ్యయనం గరపడానికి కూడా యీ వ్యాసం వుద్దేశించబడింది.

చీలికకు ముందు పదేళ్ళపాటు పార్టీ అంతరంగిక పోరాటంలోనూ, చీలిక అనంతరం సి.పి.ఐ. - సి. పి. ఐ. (ఎం) మధ్య సాగిన పోరాటంలోనూ సి.పి.ఐ. (ఎం) పొందిన అనుభవంపై చేయబడిన సమీక్ష వాస్తవానికి పూర్తిగా పొరపాటు వైఖరితో కూడుకున్నది; అందులో పరస్పరవిరుద్ధ వైఖరులున్నాయి; మార్క్సిజం లెనినిజంగా చూపడానికి ప్రయత్నించే తమ పచ్చి అవకాశవాదాన్ని కప్పిపుచ్చుకోడానికి కప్పిన సన్నని ముసుగు అది.

31 సంవత్సరాల అనుభవాల సమీక్ష అనబడే ఆ సమీక్షను ఆవరించి యున్న మార్క్సిస్టేతర అవగాహనను స్పష్టంగా వెల్లడించడానికిగాను సదరు సమీక్షపై విమర్శను రూపొందించడం అవసరం. దేశాన్ని వామపక్ష - ప్రజాతంత్ర దిశలో నడిపించడానికిగాను సంయుక్త కార్యాచరణలను పోరాటాలను నిర్మించడంలో మనం ఎదుర్కొంటున్న ఇబ్బందులను, కుదుపులను అవగాహన చేసుకోడానికి ఆ విమర్శ సహాయపడుతుంది. ఇలాటి సమగ్ర విమర్శ తర్వాత రూపొందించుకోవచ్చు. కానీ కొన్ని సమస్యలను మాత్రం ఇప్పుడే పరిశీలించడం అవసరం.

ప్రస్తుత సైద్ధాంతిక విభేదాల పరిస్థితిని అవగాహన చేసుకోడానికీ, వర్తమాన సమస్యలపై ఉమ్మడి వైఖరులను రూపొందించే క్రమాన్ని ఆ విభేదాలు ఎలా ప్రభావితం చేస్తాయి అన్న విషయాన్ని అర్థంచేసుకోడానికి మన విభేదాలను, చీలికనూ ఉభయ పార్టీల మధ్య యిటీవల అభివృద్ధిచెందిన సమస్యలను సంక్షిప్తంగా పరిశీలించడం ప్రయోజనకరంగా వుంటుంది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రవేశించిన నూతన శకాన్ని పొరపాటు అవగాహన చేసుకొనటంవల్లనే ప్రధానంగా చీలికకు ముందు సి.పి.ఐ.లో విభేదాలు తలెత్తాయి. సి. పి. ఎస్. యు. 20 వ మహాసభ డాక్యుమెంట్లు 1960 లో 81 కమ్యూనిస్టు పార్టీల ప్రకటన-ఇవి సి.పి.ఐ.లో స్థూలమైన సైద్ధాంతిక ఐక్యతను రూపొందించడానికి తోడ్పడ్డాయి. అయితే మునుపటి పొరపాటు అవగాహనా అవశేషాలు అలాగే వుంటూ అవి చీలికకు ముందు పార్టీలోని రాజకీయ విభేదాల రూపంలో వ్యక్తమయ్యాయి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చైనా కమ్యూనిస్టు పార్టీలోని మావోయిస్టు నాయకత్వం సృష్టించిన చీలిక, సి.పి.ఐ. లోని విభేదాలను మరింత ప్రకోపింపచేసింది (అలా చీలికను సృష్టించింది చైనా కమ్యూనిస్టు పార్టీయే కానీ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కాదు. అయితే సోవియట్ కమ్యూనిస్టు పార్టీయే చీలికకు కారణమని సి.పి.ఐ. (ఎం) నాయకులు ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కానీ సూచించేవారు). ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం సాధారణ పంథాపట్ల సందేహాలుండే కామ్రేడ్లు, లేక ఆ పంథాతో విభేదించే కామ్రేడ్లు మావోయిజం సైద్ధాంతిక వైఖరి దిశగా ఆకర్షితులయ్యారు. చివరకు వారు చీలిపోయి సి పి ఐ. (ఎం)ను యేర్పాటుచేశారు. ఈ విధంగా చైనా కమ్యూనిస్టు పార్టీకి దగ్గరగా జరుగుతాం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో తన సంబంధాలను తెంచు కోవటం ద్వారానే సి.పి ఐ (ఎం) పుట్టింది. "పరిపూర్తికాబడిన వాగ్దానాలు" అన్న తన వ్యాసంలో శ్రీ నంబూద్రిపాద్ యీ వాస్తవాన్ని ఒక రకంగా ధృవీక రించారు.

ఆయన ఇలా అన్నారు :

"ఇరవై ఏళ్ళలో ఎక్కువభాగం దాదాపు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యావత్తు మా పార్టీని బహిష్కరించింది. మొదట కొన్నేళ్ళపాటు సోదర సంబంధాలు కొనసాగించిన చైనా కమ్యూనిస్టు పార్టీ ఆ తర్వాత మాతో తెగతెంపులు చేసుకుంది."

ఈ విధంగా సి.పి.ఐ. (ఎం), సి.పి.ఐ. నుంచి చీలిపోతూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో పూర్తిగా విడిపోయింది; సి.పి.ఐ ని రివిజనిస్టుపార్టీ అని

నిందించింది. చైనా కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన పచ్చి మార్క్సిస్టేతర మావో యిస్టు వైఖరిని సి. పి. ఐ. (ఎం) బలపరచింది. కాబట్టే ఈ పార్టీతో ఆ పార్టీ కొన్నేళ్ళపాటు సంబంధాలు కొనసాగించింది.

అయితే స్వానుభవం ప్రాతిపదికపై సి.పి.ఐ. (ఎం) మెల్లిగా మావోయిజం తాలూకు మార్క్సిస్టు వ్యతిరేక సిద్ధాంతం నుంచి తలెత్తిన ప్రమాదకరమైన కొన్ని విధానాలనుంచి దూరంగా జరగడం ప్రారంభించింది. అది ఆ పార్టీ గణ్యతకు చిహ్నంగానే భావించాలి. ఏమైనా అది మావోయిజంను తిరస్కరించడానికి మాత్రం నిరాకరించింది. ఈ నాటికీ అది మావోయిజంను తిరస్కరించడం లేదు.

మావోయిజంతో సి.పి.ఐ. (ఎం) నాయకత్వం తొలిసారిగా 1967 లో తెగతెంపులు చేసుకుంది 1967 లో వారు కేరళ, పశ్చిమబెంగాల్ రాష్ట్రాల్లోని మిశ్రమ ప్రభుత్వాలలో చేరడానికి నిర్ణయించారు. చైనా కమ్యూనిస్టు పార్టీ సి.పి.ఐ. (ఎం)ను నయారివిజనిస్టులని నిందించింది; నగ్జలైట్లు అనబడే సి.పి.ఐ. (ఎం.ఎల్)కు చైనా కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా తన మద్దతు ప్రకటించింది. ఏమైనా మావోయిస్టులు, రివిజనిజంకు వ్యతిరేకంగా పోరాడే యోధులని సి. పి. ఐ. (ఎం) ప్రశంసించడం కొనసాగించింది. కాకపోతే భారతదేశంలోని అంతరంగిక పరిస్థితిపట్ల చైనా కమ్యూనిస్టు పార్టీ అంచనా పొరపాటు అంచనాఅని మాత్రమే సి.పి.ఐ. (ఎం) పేర్కొంది.

సోషలిస్టు వియత్నాంపై చైనా ప్రజారిపబ్లిక్ దాడిచేసిన సందర్భంగా సి.పి.ఐ (ఎం) రెండవసారి మావోయిజం నుంచి విడివడ్డది మావోయిస్టు నాయకుల చేతుల్లో బెత్తంపాతాలు పొందడానికి వియత్నాం కమ్యూనిస్టు పార్టీ నాయకులు అరుణలనడానికి కానీ వారు రివిజనిస్టు లనడానికి కానీ సి.పి.ఐ.(ఎం)కు కష్టసాధ్యమైపోయింది.

అయితే అదేసమయంలో సి.పి.ఐ (ఎం) నాయకులు చైనా ప్రజా రిపబ్లిక్‌ను ఖండించలేకపోయారు. అలా ఖండిస్తే "అది అంతర్జాతీయ అనైక్యతా లక్ష్యానికే ఉపయోగపడుతుందనీ, సామ్రాజ్యవాదుల అగ్నికి గాలిలా ఉపయోగ పడుతుందని" వారు తమ పార్టీ 11 వ మహాసభ రాజకీయ తీర్మానంలో స్పష్టంగా చెప్పు కున్నారు.

ఒక సోషలిస్టు రాజ్యంపై దాడిచేసినందుకు మావోయిస్టు పెత్తందార్లను ఖండించడానికి బదులుగా సి.పి.ఐ. (ఎం) కేవలం చైనా వైఖరిని విమర్శించింది; కంపూచియా ప్రజలకు వ్యతిరేకంగా పోల్‌పాట్‌ను చైనా బలపరచిందని ఆ పంథాను అవలంబిస్తూ చైనా ప్రజారిపబ్లిక్ వియత్నాంతో యుద్ధంలో యిరుక్కుపోయిందని" వారు అభివర్ణించారు.

చైనా ప్రజా రిపబ్లిక్ వియత్నాంపై దురాక్రమణ చేయలేదట! కేవలం వియత్నాంతో యుద్ధంలో ఇరుక్కుపోయిందట! పోనిండి చైనా ప్రజారిపబ్లిక్‌ను సి.పి.ఐ. (ఎం) విమర్శించింది. అదైనా మేలే. అయితే సి.పి.ఐ. (ఎం) వైఖరిని శ్రామికవర్గ అంతర్జాతీయతగా పరిగణించగిలమా?

ఏప్రిల్ విప్లవ రక్షణకై సోవియట్ సైన్యాలు ఆఫ్ఘనిస్తాన్‌లోకి వెళ్ళినప్పుడు చైనా ప్రజా రిపబ్లిక్ బాహాటంగా తన వ్యతిరేకత వ్యక్తంచేసిన సందర్భంగా మావోయిజం నుంచి మరోసారి సి.పి.ఐ. (ఎం) విడిపోయింది.

## సి.పి.ఐ.తో సంబంధాల మెరుగుదల

మావోయిజంకు చెందిన అనేక ప్రమాదకర విధానాల నుంచి దూరంగా జరగడం ప్రారంభిస్తూ సి.పి.ఐ (ఎం) ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం వైఖరులకు సన్నిహితంగా రావడం మొదలైనప్పుడే సి పి ఐ తో ఆ పార్టీ సంబంధాలు మెరుగు కావడం ప్రారంభమైంది.

అనేక సమస్యలపై మావోయిజంనుంచి సి.పి.ఐ. (ఎం) దూరంగా జరిగి పోయినప్పటికి, మార్క్సిజం - లెనినిజానికి పూర్తిగా వ్యతిరేకమైనటువంటి అనేక మావోయిస్టు వైఖరులను సి.పి.ఐ. (ఎం) గట్టిగానే అంటిపట్టుకుంది. మావోయిస్టు సిద్ధాంతానికి వ్యతిరేకంగా పోరాడ్డానికి బదులుగా, ఆ సిద్ధాంతంతో రాజీపడడానికీ దానికి మేలి ముసుగు కప్పడానికి ఆ పార్టీ ప్రయత్నిస్తున్నది.

సి.పి.ఐ. (ఎం) ఈనాటికీ అంటిపెట్టుకుంటున్న పొరపాటు వైఖరుల్లో కొన్నిటిని యీ క్రింద వివరిస్తున్నాం: (అలాంటి పొరపాటు వైఖరులు, పొరపాటు రాజకీయ విధానాలకు దానిని ఆయత్తం చేస్తాయి.)

తమ పార్టీ పదకొండవ మహాసభకు సమర్పించిన నివేదికలో సోవియట్ యూనియన్ నాయకత్వంలోని సోషలిస్టు దేశాలను ప్రస్తావిస్తూ వాటి విదేశాంగ విధానంలో బలహీనతలున్నాయని సి. పి. ఐ (ఎం) ఆరోపించింది. వర్ధమాన దేశాల్లోని విప్లవ శక్తుల ప్రయోజనాలను వాటి విదేశాంగ విధానం విస్మరిస్తున్నదని, ఆ దేశాల్లోని మిత్ర ప్రభుత్వాలను విశ్వసిస్తున్నదని" ఆ నివేదికలో ఆరోపించారు.

"దేశం లోపల ప్రగతి నిరోధక విధానాలు అవలంబిస్తూ తమ ప్రజలను అణచివేస్తున్న కొన్ని వర్ధమానదేశాల పాలకులను సోషలిస్టు దేశాల పత్రికలు విపరీతంగా ప్రశంసిస్తున్నాయి: ఆ దేశాల్లోని కార్మికవర్గంపైనా, ప్రజానీకంపైనా సాగే పీడన గురించిన వార్తలు కనిపించటంలేదు. తమ సొంత ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఆ దేశాల్లోని ప్రజలు సాగించే పోరాటాల గురించి సోషలిస్టు దేశాల్లోని

కార్మిక వర్గానికి తెలియచేయడంలేదు. ప్రజాస్వామ్యంకోసం, న్యాయబద్ధమైన ఆర్థిక, రాజకీయ డిమాండ్ల కోసమూ తమ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఆ ప్రజలు కొనసాగిస్తున్న పోరాటాల పట్ల శ్రామికవర్గ అంతర్జాతీయతా చైతన్యంతో కూడు కున్న సంఘీభావం వ్యక్తం కావటంలేదు."

వర్ధమాన దేశాల్లోని విప్లవ శక్తుల ప్రయోజనాలను సోషలిస్టు రాజ్యాలు విస్మరిస్తున్నాయన్న విమర్శ మావోయిస్టు నిందారోపణ తప్ప మరొకటి కాదు.

ఇక్కడొక విషయం గమనించాలి. అణువిపత్తు దిశగా పరుగులుతీస్తున్న అమెరికా సామ్రాజ్యవాదుల ఉన్మాదాన్ని వ్యతిరేకించే సోషలిస్టు రాజ్యాలను బల పరుస్తున్నట్టి పెట్టుబడిదారీ దేశాలతో సోషలిస్టు దేశాలకు స్నేహ సంబంధాలు వున్నాయి. ఇది సి.పి.ఐ. (ఎం)కు రుచించడంలేదు.

## పొరపాటు సైద్ధాంతిక వైఖరి

అటువంటి పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికవర్గం తమ ప్రభుత్వాలకు వ్యతి రేకంగా పోరాడవలసివుంది కాబట్టి, అలాంటి పెట్టుబడిదారీ దేశాలపట్ల సోషలిస్టు రాజ్యాలు మైత్రికి బదులుగా శత్రు వైఖరి అవలంబించాలని సి.పి.ఐ. (ఎం) కోరు కుంటున్నది. ఈ క్రమంలో సామ్రాజ్యవాదానికి, యుద్ధానికి వ్యతిరేకంగా సంఘ టన గనక విచ్ఛిన్నమైతే, అట్టి పర్యవసానాలను సి.పి.ఐ. (ఎం) పట్టించుకోదు. నిజానికి ఇది శ్రామికవర్గ అంతర్జాతీయతకు సంబంధించిన విడ్డూరమైన భావన.

ఈ లెక్కన, హిట్లర్‌కు వ్యతిరేకంగా సాగిన యుద్ధంలో బ్రిటన్, అమెరికా సామ్రాజ్యవాద దేశాలతో సోవియట్ యూనియన్ చేసుకున్న మైత్రిని సి.పి ఐ.(ఎం) ఎలా అంచనా వేస్తుందో ఆశ్చర్యమే. బాలారిష్టపు అతివాదమూ, సంకుచిత జాతీయ వాద దృక్పథమూ కలిసిన మొరటు మిశ్రమానికి ఇది ఉదాహరణ. ఇందులో అంత ర్జాతీయ లక్షణాలు మచ్చుకు కూడా లేవు.

సి.పి ఐ (ఎం)కు ఇటువంటి పొరపాటు సైద్ధాంతిక వైఖరులున్న ఫలితం గానే, అనేక పొరపాటు విధానాలు తలెత్తుతాయి. సామ్రాజ్యవాదానికీ, యుద్ధానికి వ్యతిరేకంగా ఇతరులందరిలో కలసి విస్తృత ప్రజా ఉద్యమాల్లో చేరడానికికానీ, సోషలిస్టు దేశాలతో మైత్రిని అభివృద్ధి చేసుకోడానికి కానీ సి.పి.ఐ. (ఎం) విపరీ తంగా వెనుకాడుతున్నది అవసరమూ, సాధ్యమూ అయినట్టి యిలాటి ఉద్యమాలను విస్తృత స్థాయిలో సర్కుచేందుకు తోడ్పడడానికి బదులుగా, అట్టి ఉద్యమాలు తన సిద్ధాంతానికి వినియోగపడాలని ఆ పార్టీ కోరుకుంటున్నది.

ఒక విషయం గమనించాలి. విస్తృతమైన సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్య మంలో చేరడానికే సి.పి ఐ. (ఎం) వెనకాడుతున్నది కాగా, సామ్రాజ్యవాదానికి

యుద్ధానికి వ్యతిరేకంగా దృఢమైన వైఖరిని కానీ దృఢంకాని వ్యతిరేక వైఖరిని కానీ తీసుకోడానికి నిరాకరించే పార్టీలతో స్నేహం చేయడానికమాత్రం సి పి.ఐ. (ఎం) వెనకాడడం లేదు.

1983 ఏప్రిల్ 11 నుంచి 16 తారీకువరకు కార్ల్ మార్క్స్ శత వర్థంతి సందర్భంగా బెర్లిన్‌లో జరిగిన అంతర్జాతీయ సమావేశంలో శ్రీ నంబూద్రిపాద్ చేసిన ప్రసంగాన్ని ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. విదేశాంగ విధానంలోని అనేక అంశాలపట్ల భారత ప్రభుత్వం అవలంబించే తటపటాయింపు వైఖరిని ప్రస్తావించిన అనంతరం ఆయన యిలా అన్నారు :

"విదేశాంగ విధానం సమస్యపై తటపటాయింపులు వ్యక్తం చేయడమేకాక పాలకపార్టీ, వామపక్ష, ప్రజాతంత్రపార్టీల పట్ల శత్రు వైఖరి అవలంబిస్తున్నది.... ఈ శత్రు వైఖరి పాలకవర్గంలోని ప్రధాన విభాగాలను నియంతృత్వపాలన దిశగా నడిపిస్తున్నది. నియంతృత్వ అధికారానికి వ్యతిరేకంగా విస్తృతమైన ప్రతిఘటనా వేదికను నిర్మించాల్సిందిగా 1978 లో జరిగిన మా పార్టీ పదవ మహాసభ పిలుపు ఇచ్చింది. అందుకే పాలక పార్టీలు నియంతృత్వ దిశగా వెళ్ళడాన్ని నిరోధించడంలో ఆసక్తిగల పాలక వర్గాలలోని విభాగాలను, ఆ విభాగాల రాజకీయ పార్టీలను- అవి వామపక్షాలకు వ్యతిరేకమైనవే అయినప్పటికీ, ఈ విస్తృత వేదిక తన పరిధిలోకి ఆకర్షిస్తుంది."

ఒక విషయం గమనించాలి. వామపక్షాలను వ్యతిరేకించే పార్టీలతో మాత్రమే కాక సామ్రాజ్యవాద అనుకూల పార్టీలతోసహా కలసి నియంతృత్వ అధికారానికి వ్యతిరేకంగా విస్తృత వేదికను నిర్మించాలన్నమాట. జయప్రకాశ్ నారాయణ్‌గారి "సంపూర్ణ విప్లవాన్ని" సి.పి.ఐ. (ఎం) బహిరంగంగా బలపరచడానికీ, ఆదినుంచి అంతందాకా జనతాపార్టీ ప్రభుత్వానికి సాధారణ తోడ్పాటు ప్రకటించడానికీ, "విస్తృత వేదిక"లోకి బి.జె.పి.ని చేర్చుకోవాలని తరుచుగా కోరడానికి యీ పంథా దారితీసింది.

నియంతృత్వ అధికారానికి వ్యతిరేకంగా "విస్తృత వేదిక"లో బి జె.పి.ని చేర్చుకోవాలనేకాదు, బి.జె పి. కూడా కలిసివున్న మిశ్రమ ప్రభుత్వానికి తోడ్పాటు అందచేస్తామని ప్రకటించేదాకా 1984 డిసెంబరులో సి.పి.ఐ. (ఎం) పొలిట్‌బ్యూరో సభ్యులొకరు వెళ్ళారు : సి.పి.ఐ. (ఎం) యొక్క యిట్టి పొరపాటు ధోరణివల్ల, వామపక్ష, ప్రజాతంత్ర శక్తుల ఐక్యతా నిర్మాణంలో అనేక ఇబ్బందులు సృష్టించబడతాయని ప్రత్యేకించి చెప్పాల్సిన పనిలేదు.

వామపక్ష పార్టీల ఐక్యత, ముఖ్యంగా సి.పి.ఐ.- సి పి.ఐ. (ఎం) ఐక్యత, ఇతర నిజమైన ప్రజాతంత్ర శక్తులను ఆకర్షించడానికి సహాయపడుతుంది కేంద్రం

నుంచి స్థానిక స్థాయిదాకా సి.పి.ఐ.- సి.పి.ఐ. (ఎం) మధ్య సన్నిహితమైన ఐక్యత వుండివుంటే, అలాంటి ఐక్యత ఈ క్రమానికి తోడ్పడివుండేది. అయితే ఒక కేంద్ర స్థాయిలో తప్ప మిగతా స్థాయిల్లో ఉభయ పార్టీల సమన్వయ కమిటీల ఏర్పాటును సి.పి.ఐ. (ఎం) గట్టిగా వ్యతిరేకిస్తున్నది.

కాగా విచ్ఛిన్నకర, సామ్రాజ్యవాద అనుకూల ధోరణులు గల బూర్జువా పార్టీలతో పెట్టాపట్టాలు వేసుకోడానికి ఆ పార్టీ ఇష్టపడుతున్నది. వామపక్ష- ప్రజాతంత్ర శక్తులను పటిష్ఠ పరచడానికి నికరమైన చర్యలు తీసుకోడానికి బదులుగా, అది అప్పుడప్పుడు జనతాపార్టీ తరహా కలగూర గంప దిశగా నడవడానికి ప్రయత్నిస్తున్నది.

వామపక్ష పార్టీల నేతృత్వంలోని ట్రేడ్ యూనియన్ల ఐక్యత ముఖ్యంగా ఎ.ఐ.టి.యు.సి. సి.ఐ.టి.యు. ల ఐక్యత కార్మికవర్గం వామపక్ష దిశగా గట్టి రాజకీయ కార్యాచరణ సాగించడానికి తోడ్పడి ఉండేది. అంతేకాదు జాతీయ ప్రచారోద్యమ కమిటీలోని కొన్ని ట్రేడ్ యూనియన్ కేంద్రాలు సృష్టించిన ఇబ్బందిని అధిగమించడానికి కూడా తోడ్పడి ఉండేది. కానీ సి.పి.ఐ(ఎం) దీనిని వ్యతిరేకించడం కొనసాగిస్తూనే వున్నది.

అనేక సమస్యలపై సి.పి.ఐ., సి. పి. ఐ. (ఎం) లు ఉమ్మడి వైఖరులను చేపట్టాయనడం నిస్సందేహం. కొన్ని సందర్భాల్లో సంయుక్త ప్రజా కార్యాచరణలు కూడా అవి నిర్వహించాయి. కానీ సి. పి. ఐ. (ఎం) అవలంబిస్తున్న పొరపాటు సైద్ధాంతిక ధోరణి ఇలాంటి ఐక్యత విస్తృతం కావడాన్ని నిరోధిస్తున్నది; అప్పుడప్పుడు ఐక్య కార్యాచరణలలో వైఫల్యాలకు కూడా దారి తీస్తున్నది.

1982 జులై 20 వ తేదీన సి. పి. ఐ. (ఎం) పొలిట్ బ్యూరో సభ్యులు శ్రీ బి.టి. రణదివే చదివిన పత్రం పరిశీలిస్తే ఈనాడు కూడా సి.పి.ఐ. (ఎం) సిద్ధాంతంలో మార్క్సిస్టేతర వైఖరులున్నట్లు స్పష్టంగా బోధపడుతుంది.

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో సోవియట్ యూనియన్ సాధించిన విజయం, ప్రపంచ శక్తుల్లో నూతన సమతూకాన్ని సృష్టించింది. తరువాత పరిణామాలను అంచనా వేయడంలో వివిధ కమ్యూనిస్టు పార్టీలు వాటిని తమ సొంత జాతీయ పరిగణనల నుంచి చూడడానికి ప్రయత్నించి అవి పరస్పరం విభేదించే స్థితికి వెళ్ళడమేకాక, వాస్తవానికి మార్క్సిజం-లెనినిజం మౌలిక పంథానుంచి పెడ మార్గం పట్టాయి కూడ. (1)

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణుల్లో రివిజనిస్టు పెడమార్గానికి నాందీ వాక్యం పలికింది. (1)

సోషలిస్టు శక్తుల బలాన్ని, పురోగామి దేశాల్లోని కార్మికవర్గ ఉద్యమ బలాన్ని అతిశయ ధోరణిలో అవగాహన చేసుకోవడంవలన శాంతియుత పంథా అనే భావన తలెత్తింది (!)....అయితే అదే సమయంలో యీ శాంతి భావాన్ని ఆ దేశాల్లోని వర్గ పోరాటాలకు కూడా విస్తరింపచేశారు (?).... స్వల్ప కాలంలోనే సర్వ సంపూర్ణమైన రివిజనిస్టు దృక్పథం అభివృద్ధి చెందింది జాతీయ పోరాటం మధ్య సామ్రాజ్యవాదుల మధ్య గల వైరుధ్యాన్ని ఇంకా ఇతరేతర వైరుధ్యాలను పరిగణించకుండా నిర్లక్ష్యం చేస్తూ ఒకే ఒక వైరుధ్యాన్ని అనగా సోషలిస్టు శిబిరం మధ్య సామ్రాజ్యవాద శిబిరం మధ్యగల ఏకైక వైరుధ్యాన్ని గుర్తించడంలో ఆ రివిజనిస్టు దృక్పథం ముగిసింది. అంతేకాక కార్మికవర్గానికీ, బూర్జువా వర్గానికీ మధ్యగల వైరుధ్యాలను పరిష్కరించడానికి శాంతియుత పరివర్తనే సరైందని మొండిగా వాదించడంలో కూడా అది ముగిసింది....ఇది యావత్ ప్రపంచ ఉద్యమాన్ని దెబ్బకొట్టే రివిజనిస్టు వేదిక తాలూకు సంపూర్ణ నమూనా (!) అయితే వ్యవహారాలు అంతటితోనే ఆగలేదు....

సోవియట్ రాజ్యం ఇప్పుడిక ఎంతమాత్రం శ్రామికవర్గ నియంతృత్వం కాదనీ, ఇది యావత్ ప్రజానీకపు రాజ్యమని వర్ణించడం ద్వారా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ దిగజారింది. ఈ భావన మార్క్సిజం-లెనినిజం మౌలిక బోధనలకు వ్యతిరేకమైంది." (!)

## నిన్నటి సోవియట్ వ్యతిరేక వైఖరి

"ఈ రివిజనిస్టు ధోరణి యొక్క ప్రత్యక్ష పర్యవసానం ఏమిటంటే సోషలిస్టు చైనాతో తాను చేసుకున్న ప్రాముఖ్యంగల ఒప్పందాలను సోవియట్ యూనియన్ చించేయడం అమెరికాతో పాక్షిక అణుపరీక్ష నిషేధ ఒప్పందం చేసుకోడానికి అది ఆ పని చేసింది (!) రివిజనిస్టు దృక్పథం జాతీయ ఉద్యమానికే చాలా హాని చేసింది....కొంతకాలంపాటు వియత్నాంకు ద్రోహం చేయడానికి కూడా ఈ ధోరణి దారితీసింది (!) ఏది ఏమైనా ఇటీవల సంవత్సరాలలో సి.పి.ఎస్.యు నాయకత్వంలోని సోవియట్ యూనియన్ అనేక దేశాల్లో సామ్రాజ్యవాదులను చురుగ్గా వ్యతిరేకిస్తున్నది. అఫ్ఘనిస్తాన్, కాంబోడియా, సాల్వడార్, అంగోలా వగైరా....(!) సోవియట్ యూనియన్ యొక్క సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ యొక్క ప్రస్తుత దృక్పథంలో యిది పెద్ద మార్పు (!!!) అయితే వర్తమాన దేశాల్లోని ఉద్యమాల పట్ల తొలి సంవత్సరాల్లోనూ, ఈనాడు కూడా సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి సోవియట్ ప్రభుత్వానికీ గల వైఖరిలో తటపటాయింపు లున్నాయి (!) వాస్తవాచరణలో, వర్ధమాన దేశాల్లోని పాలకవర్గాలతో అవి ఎంత అభివృద్ధి నిరోధకమైనాసరే, అవి గనక తమ సంకుచిత విదేశాంగ విధానం

ప్రయోజనాలకు ఉపకరించే పక్షంలో వాటితో ఈ సోషలిస్టు దేశాలు ప్రధానంగా స్నేహం చేసుకుంటున్నాయి."

"ప్రారంభంలో రివిజనిస్టు పెడధోరణికీ, ఏక పార్టీ పెత్తనానికీ వ్యతిరేకంగా చైనా కమ్యూనిస్టుపార్టీ పోరాటాన్ని ప్రారంభించింది. అలాటి పోరాటానికి నాయకత్వం వహించింది. (1) అమెరికా సామ్రాజ్యవాదం ప్రజల ప్రధాన శత్రు వన్న సరైన వైఖరిని చైనా కమ్యూనిస్టుపార్టీ చేపట్టింది. జాతీయ విముక్తి పోరాటాల ప్రాముఖ్యాన్ని గ్రహించింది. శాంతియుత పంథాను తిరస్కరించి శ్రామికవర్గ నియంతృత్వ భావనను, పార్టీయొక్క నేతృత్వ పాత్రనూ బలపరచింది, శాంతియుత సహజీవనం, శాంతికోసం పోరాటాలు లాటి భావనల శాశ్వతీకరణను విమర్శించింది. "

ఇది మావోయిజం యొక్క మార్క్సిస్టు వ్యతిరేక వైఖరికి సంపూర్ణ నమూనా. సి.పి.ఐ. (ఎం) ఈనాటికీ ఆ అభిప్రాయాలనే కలిగి వుంది.

సి.పి.ఐ. (ఎం) పదే పదే మార్క్సిజం-లెనినిజం పట్ల విధేయత ప్రకటిస్తు న్నప్పటికీ ఒక విషయం చిత్రంగా వుంది. చైనా కమ్యూనిస్టుపార్టీతో సంబంధాలను సంపూర్ణంగా పునరుద్ధరించుకుంటూనే, "స్వాతంత్ర్యం. సంపూర్ణ సమానత్వం, పరస్పర గౌరవం ఒకరి ఆంతరంగిక వ్యవహారాల్లో మరొకరు జోక్యం చేసుకోకపోవటం అనే సూత్రాల ప్రాతిపదికపై సోదర సంబంధాలు పునరుద్ధరింపబడుతున్నా యని సి. పి. ఐ. (ఎం) తెలిపింది. రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలకు మార్క్సిజం-లెనినిజం కానీ, శ్రామికవర్గ అంతర్జాతీయత కానీ మార్గదర్శకత్వం వహించవు। ఇది నిజంగా మార్క్సిజం-లెనినిజంను ఎత్తి పట్టుకునే చిత్రమయిన పద్ధతే।

1983 ఏప్రిల్ 24 న చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు ముందుచేసిన ప్రసంగంలో శ్రీ నంబూద్రిపాద్ యిలా అన్నారు. "1957, 1960 లో ప్రపంచ కమ్యూనిస్టు ప్రకటనలకు మేము దృఢంగా కట్టుబడివున్నాం. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని రివిజనిస్టు ధోరణులకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో 1963 జూన్ నాటి చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖలో ఎక్కువ భాగాన్ని మేము బల పరుస్తున్నాము. ఈనాడు కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆవహించి, ప్రధాన ప్రమాదంగా తయారయిన ఆధునిక రివిజనిజం ముప్పుకు వ్యతిరేకంగా మనం పోరాడాలి."

1957, 1960 ల ప్రపంచ కమ్యూనిస్టు ప్రకటనలపట్ల నిబద్ధత, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో రివిజనిజంకు వ్యతిరేకంగా 1963 జూన్ నాటి చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖలో ఎక్కువ భాగం పట్ల మద్దతు, ఇది నిజంగా సృజ

నాత్మక మార్క్సిజంలో గొప్ప విన్యాసమే. ఈ విన్యాసాన్ని జయించడం కష్టమే !.

తమ పొరపాటు సిద్ధాంతపు వక్రీకృత పట్టకం నుంచి దర్శిస్తున్నందువల్ల సి.పి.ఐ (ఎం) నాయకులు భారతదేశపు రాజ్యాంగ యంత్రం యొక్క నిజమైన స్వభావాన్ని గ్రహించలేకపోతున్నారు దేశం లోపలి పరిణామాల ప్రాముఖ్యాన్ని అవగాహన చేసుకోలేకపోతున్నారు. కార్మికవర్గం దృక్కోణం నుంచి తమ విధానాలను ఖచ్చితంగా రూపొందించుకోలేక పోతున్నారు. భారత రాజ్యాంగ యంత్ర స్వభావం గురించి సి.పి.ఐ.(ఎం) చేసిన విశ్లేషణ ప్రాతిపదికపై, భారతదేశపు రాజకీయ, ఆర్థిక విధానాలను సంతృప్తికరంగా వివరించజాలరు.

ఫలితంగా రాజకీయ పరిణామం గురించి వారు చెప్పిన జోస్యం పలుసార్లు పొరపాటుతో కూడుకున్నదని రుజువైంది. అందువల్ల అనేక సందర్భాల్లో తమ విధానాల్లో తొందరపాటుగా అస్తవ్యస్తమైన మార్పులు చేసుకోవలసి వచ్చింది. ఇలాటి అనుభవాల విషయమై లోతుగా ఆలోచించి తమ పొరపాటు సిద్ధాంతం మూలంగానే ఇటి అనుభవాలు ఎదురయ్యాయని భావించడానికి బదులుగా, సి.పి.ఐ. కార్యక్రమంలోని వైఖరులను బహిరంగంగా వక్రీకరించేందుకు సి.పి.ఐ. (ఎం) నాయకులు సిద్ధపడ్డారు. ఇటీవల "పీపుల్స్ డెమొక్రసీ"లో వచ్చిన వ్యాసాల్లో అలా వక్రీకరించారు.

గత 31 సంవత్సరాల పరిణామాలను తీవ్రంగా అంచనావేసి, సి పి. ఐ యొక్క సి.పి.ఐ (ఎం) యొక్క కార్యక్రమాలను తులనాత్మకంగా పరిశీలించడం ద్వారా అట్టి అనుభవాలను మదింపుచేయడానికి బదులుగా సి.పి.ఐ (ఎం) నాయకులు గంభీరమైన రాజకీయ సైద్ధాంతిక సమస్యలను గందరగోళ పరచడానికిగాను ఇటువంటి చిత్తశుద్ధిలేని పద్ధతులకు పాల్పడుతున్నారు.

సి.పి.ఐ.కి సి.పి.ఐ. (ఎం)కి గల తేడా యేమిటంటే తన కార్యక్రమంలో ఏదైనా పెడధోరణి మూలంగా ఏదైనా పొరపాటు సంభవిస్తే అట్టి పొరపాటును సి.పి.ఐ. వెంటనే దిద్దుకుంటుంది. అందుకు భిన్నంగా సి. పి ఐ (ఎం) జీవిత వాస్తవాలు తన సిద్ధాంతం తప్పని నిరూపించినప్పటికీ అట్టి పొరపాటు సిద్ధాంతానికి గట్టిగా కట్టుబడి వుంటుంది.

ప్రపంచంలోని అన్ని కమ్యూనిస్టు పార్టీలు పొరపాటు సిద్ధాంతాన్నే అవలంబించాయి. ఇప్పుడవి సి. పి. ఐ. (ఎం) వైఖరి దిశగా వస్తున్నాయని చెప్పే అపహాస్య ధోరణి కూడా ఆ పార్టీ అప్పుడప్పుడూ చేపడుతూ వుంటుంది. సి.పి.ఐ. (ఎం) అవలంబించే ఇలాటి ధోరణుల మూలంగా సి.పి.ఐ -సి.పి.ఐ.(ఎం)

సంబంధాల్లో కుదుపులు సంభవిస్తుంటాయి. విభేదాలను పరిష్కరించుకోవటం కష్టమవుతూంటుంది.

## మళ్ళీ పొరపాటు విధానాల్లోకి

సి.పి.ఐ. (ఎం)ది పొరపాటు సిద్ధాంతమే అయినప్పటికీ తన స్వానుభవంలో ఎదురైన కుదుపుల మూలంగా సి.పి.ఐ. (ఎం) తన కొన్ని పొరపాటు వైఖరులకు స్వస్తిచెప్పక తప్పలేదు. అయితే తన పొరపాటు సిద్ధాంతాన్ని గట్టిగా అంటిపెట్టుకుంటున్నది కాబట్టి అది మళ్ళీ పొరపాటు విధానాలోకి జారుకుంటున్నది. సి.పి.ఐ.–సి.పి.ఐ. (ఎం)ల మధ్య సంబంధాలలో ఎగుడు దిగుళ్ళకు ఇది అనివార్యంగా దారితీస్తుంది.

అనుభవం ప్రాతిపదికపై ఆలస్యంగా అయినాసరే తన వైఖరులను మార్చుకునే గుణం సి.పి.ఐ. (ఎం)కి వున్నది కాబట్టి తన పొరపాటు సిద్ధాంతం నుంచి తప్పనిసరిగా వచ్చే పొరపాటు వైఖరులను మార్చుకునే గుణం, వాటికి స్వస్తిచెప్పే గుణమూ కూడా వున్నది కాబట్టి సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)ల ఉమ్మడి వైఖరులు అభివృద్ధి చెందడం కొనసాగుతుందని, సైద్ధాంతికంగా పొరపాటైన తన మార్గాన్ని అధిరోహించడంలో అది కృతకృత్యమవుతుందనీ సి.పి.ఐ. ఆశిస్తున్నది.

సైద్ధాంతిక వైఖరుల్లో విభేదాలు వున్నన్నాళ్ళూ సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)ల మధ్య సంబంధాల్లో కుదుపులు వుంటాయి అయితే సాధ్యమైనన్ని ఎక్కువ సమస్యలపై సంయుక్త కార్యాచరణలు నిర్వహించడం ద్వారానూ అనుభవాలను విజ్ఞతగా పరిపుష్టంచేయడం ద్వారానూ రెండు పార్టీలను అధికాధికంగా సన్నిహితపరచడం సాధ్యమవుతుంది.

ఇలా చేస్తున్నప్పుడు, సైద్ధాంతిక విభేదాలపై మన చర్చలకు స్వస్తి చెప్పరాదు. అయితే విభేదాలపై బహిరంగ వివాదాల రూపంలోనా? లేక ఉభయ పక్షాల చర్చల రూపంలోనా? ఉభయ పార్టీల్లోని శ్రేణులకు పరిమితమయ్యే విధంగా పార్టీ ఆంతరంగిక చర్చల రూపంలోనా? ఏ రూపంలో చర్చలు కొనసాగించడంవల్ల ప్రయోజనకరంగా వుంటుంది అన్న విషయాన్ని తీవ్రంగా పరిశీలించాలి.

[1985 జులై 28 'న్యూయేజ్' నుంచి]



లేఖ

# "మార్క్సిజానికి ఉపనిషత్తులే మూలాలమా?

యస్. వి. సత్యనారాయణ

"మయూరి" జూన్ 14 సంచికలో ఎం. కె. సుగమ్‌బాబు చేసిన ఇంటర్వ్యూలో సమాధానాలిస్తూ శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు ఒకానొక సమాధానంలో 'మార్క్సిజానికి మూలం ఉపనిషత్తులే' అన్నారు. ఇదెంత చారిత్రిక అవగాహనా లోపంతో ఇచ్చిన సమాధానమో రెండు ముఖ్య అంశాలను పరిశీలించుదాం.

ముందు ఉపనిషత్తుల ఆవిర్భావాన్నీ, తర్వాత మార్క్సిజం పుట్టుకనీ చర్చించి, ఈ రెండింటి మధ్య ఉన్న ప్రధానమైన వ్యత్యాసాలను గమనిద్దాం.

కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం మానవుడు గడిపిన వర్గ పూర్వ సమాజ జ్ఞాపకాలు మనకు ఆదిమ సాహిత్యమైన వైదిక సారస్వతంలోనూ, గ్రీకు పురాణ సాహిత్యంలోనూ కనబడతాయ్. వైదిక సారస్వతాన్ని ప్రధానంగా నాలుగు భాగాలుగా విభజింపవచ్చు. (i) సంహిత, (ii) బ్రాహ్మణం, (iii) అరణ్యకం, (iv) ఉపనిషత్తులు. నాలుగు వేదాల్లోనూ ఈ నాలుగు అంతర్భాగాలూ, అనేక ఉపశాఖలున్నాయ్. ఇందులో సంహిత, బ్రాహ్మణం, ఆరణ్యకాలు వర్గ పూర్వ సమాజ నిర్మితాలైతే, ఉపనిషతుల్లో కొన్ని మాత్రం వర్గ పూర్వ సమాజంలోనూ, మిగిలిన అత్యధిక సంఖ్యాకం తొలివర్గ సమాజమైన బానిస సమాజంలోనూ సృష్టింపబడ్డాయ్. ఈ ఉపనిషత్తుల్లో కొన్ని ఆదిమ భౌతికవాదాన్ని ప్రబోధిస్తే .... మిగిలినవన్నీ తొలివర్గ, సమాజాన్ని సంరక్షించడానికే ఉపయోగపడిన భావవాదాన్ని ప్రబోధించాయ్. ఇప్పుడు పరిశోధకులకు మొత్తం 108 ఉపనిషత్తులు లభ్యమైనాయ్. అందులో 'ఈశ కేన కఠ ప్రశ్న, ముండమాండూక క్తిత్తిరి ఐతరేయంచ ఛాందోగ్యం బ్రహదారణ్యకం దశ' అంటే ఈశోపనిషత్తు మొదలైన ప్రధాన

మైన పది ఉపనిషత్తులే ఎక్కువ ప్రచారంలో ఉన్నాయ్. శంకరాచార్యుడు 'శంకర భాష్యం' పేరుతో ఉపనిషత్తులకు భాష్యం చెప్పిన గ్రంథం కూడా ఇప్పుడు లభ్యమౌతోంది. ఈ 'శంకర భాష్యాన్ని' పరిశీలించి చూస్తే అత్యధికమైన ఉపనిషత్తులన్నీ భావవాదాన్ని సమర్థించేవే అనేది సుస్పష్టమౌతుంది. ఉదాహరణకి ఈశోపనిషత్తు – 'ఈశావాస్యమిదం సర్వం' అంటోంది. 'అన్నింటికీ ఈశ్వరుడే మూలం' అని దీనర్థం. అవిమ భౌతికవాదాన్ని సమర్థించేవి కొన్ని ఉన్నా వాటి గొంతు చాలా చిన్నది.

వర్గ పూర్వ సమాజం చివరి దశయైన 'బర్బర సమాజ' కాలంలో ఒక తండాకి మరో తండాకి మధ్య భయంకరమైన యుద్ధాలు, రక్తపాతం జరుగుతున్నప్పుడు....తిండి కోసం – స్థిరనివాసం కోసం – పసుగడ కోసం – ఏ సమూహానికా సమూహం తనను తాను పటిష్ఠం చేసుకునే ప్రయత్నాలు చేస్తున్నప్పుడు.... శత్రు సమూహాలను నాశనం చేసైనా తన సొంత సమూహాన్ని సంరక్షించుకోవాలన్న సంకల్పాన్ని, పటుదలని ఆనాటి చారిత్రక పరిస్థితులు కల్పించాయ్. అందుకే....'యో అస్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః' అని ప్రభోదించింది మూల సంహిత. 'మనల్ని ఎవరు ద్వేషిస్తారో వాళ్ళని మనమూ ద్వేషిద్దాం' అని అర్థం.

ఇహ బర్బర సమాజం నుంచి బానిస సమాజంలోకి పరిణమించిం తర్వాత.... బానిస సమాజం కొంత స్థిరపడి బానిసలపై బానిస యజమానుల ఆధిపత్యం పెదిలపడిం తర్వాత ఆ తొలి వర్గ సమాజాన్ని కాపాడుకుంటూ .... బానిసలు తిరగబడకుండా, యజమానులపై ద్వేషాన్ని పెంచుకోకుండా ఉండాలనే భావాన్ని .... 'తేజస్వినావధీ తమస్తు – మా విద్విషావహైః' అని నూరిపోసింది తైత్తిరీయోపనిషత్తు. అంటే 'తేజస్సు కోసం మా అధ్యయనం, ఎవరిమీదా విద్వేషం కోసం కాదు' అని దీని భావం.

ఇలా కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం నాటి భావజాలమే మార్క్సిజానికి మూలం అనడం 'అన్నీ వేదాల్లోనే ఉన్నాయ్ పోవోయ్' అని చేతులు దులుపుకునే అవివేకంగా మనకు విదితమౌతుంది.

ఇహ మార్క్సిజం విషయానికొస్తే .... ఇది వర్గ సమాజం అవసాన దశయైన పెట్టుబడిదారీ సమాజంలో బాగా అభివృద్ధిచెందిన యాంత్రిక నాగరికత అవతరించిన పరిస్థితిలో ఆవిర్భవించిన శాస్త్రం మార్క్సిజం. తర తరాలుగా మానవజాతి ఆర్జించిన విజ్ఞాన సంచయమంతా మార్క్సిజానికి పునాది. ఇందులో తత్త్వశాస్త్రం, రాజకీయ అర్థ శాస్త్రం, శాస్త్రీయ కమ్యూనిజం అనే అంతర్భాగాలున్నాయ్. అన్ని సామాజిక శాస్త్రాల, పరిశోధనల ఫలితాల సంచయం మార్క్సిజం.

సమాజ పరిణామ క్రమాన్ని శాస్త్రీయంగా పరిశీలించి అది సోషలిజం గమ్యానికి ఎలా చేరుతుందో వివరించిన సామాజిక శాస్త్రం. పెట్టుబడిదారీ దోపిడీ సమాజాన్ని కూలగొట్టేందుకు కావలసిన సిద్ధాంత ఆయుధాన్ని కార్మికవర్గానికి మార్క్స్ ఏంగెల్స్, లెనిన్‌లు అందించారు. కనుకనే అది కార్మికవర్గ సిద్ధాంతం. విప్లవానికి నాయకత్వం వహించే అగ్రగామి దళాన్ని వీరు సృజించారు. అది కమ్యూనిస్టు పార్టీ. మార్క్సిజం, మౌలిక సూత్రాలు ఏ ఉపనిషత్తులో, ఎక్కడ వున్నాయి?

ఒక సిద్ధాంతాన్ని కానీ....ఒక ఆలోచనా విధానాన్ని కానీ ...ఒక సారస్వత గ్రంథాన్ని కానీ విశ్లేషించే పరిశోధకుడు వాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రిక స్థితిగతుల్ని దృష్టిలో పెట్టుకొని విశ్లేషించాలి. ఈ పరిశోధకుడి మనోభావాలను, వీరి కాలాన్ని అది ప్రతిబింబించవు. అవి వెలువడిన చారిత్రిక స్థితుల నాటి కాలాన్ని అవి ప్రతిబింబిస్తాయ్. అందుకే....'మహాభారతంలో మార్క్సిజం లేదే' అని విలపించేవారినీ, 'మార్క్సిజానికి ఉపనిషత్తులే మూలని' అని చంకలు కొట్టుకునే వారి నిద్దరినీ చారిత్రిక అవగాహనా శూన్యులుగానే పరిగణించాలి. ★

# సి. పి. ఐ. కార్యక్రమంపై సి. పి. ఐ. (ఎం) వక్రభాష్యాలు

—చండ్ర రాజేశ్వరరావు

*(ప్రధాన కార్యదర్శి, భారత కమ్యూనిస్టుపార్టీ)*

మన పార్టీ సైద్ధాంతిక, రాజకీయ వైఖరులపై దాడిచేస్తూ ఇటీవల 'పీపుల్స్ డెమోక్రసి'లో అనేక వ్యాసాలు వచ్చాయి. మన పార్టీ కార్యక్రమంపై జరిపిన దాడి గురించి నేనీ వ్యాసంలో వివరించాలను కుంటున్నా.

మన పార్టీ కార్యక్రమంపై ఇలాటి నిందా పూర్వక విమర్శలు చేయడం ఇది ప్రథమ మేమీ కాదు. 1981 జూన్‌లో కూడా ఇలాటి దాడిచేశారు. దానికి మనం సమాధానం ఇచ్చాం ఇలాటి దాడులు మళ్ళీచేశారు కాబట్టి మనం తిరిగి సమాధానం ఇవ్వక తప్పదు

జాతీయ బూర్జువా వర్గానికి రాజ్యాంగ యంత్రంపై అధికారం వున్నట్లు బడా బూర్జువా వర్గానికి, భూస్వాములకు రాజ్యాంగ యంత్రంపై అధికారం లేనట్లు మనపార్టీ కార్యక్రమం పేర్కొంటున్నదని యీ విధంగా ప్రధాన రాజీపాత్రదారుని రాజ్యాంగ యంత్రాధికారం నుంచి మనపార్టీ కార్యక్రమం తొలగిస్తున్నదని సి.పి.ఐ. (ఎం) పొలిట్ బ్యూరో సభ్యుడు శ్రీ బి.టి. రణదివె అన్నారు. 1985 జూన్ 30 వ తేది 'పీపుల్స్ డెమోక్రసీ'లో రాసిన వ్యాసంలో ఆయన అలా అన్నారు.

"భారత రాజ్యాంగ యంత్రం, సామ్రాజ్యవాదంతో ఘర్షిస్తున్నది. బడా బూర్జువా వర్గంతోనూ, భూస్వాములతోనూ ఘర్షిస్తున్నది అన్న అవగాహనను ఇది సృష్టించింది ఇది ప్రగతిశీలమైన రాజ్యాంగ యంత్రం కాబట్టి జాతీయ ప్రగతి కోసం, సామాజిక ప్రగతి కోసం ఈ రాజ్యాంగ యంత్రపు విధానాలను ప్రజలు కాపాడాలి అన్న అవగాహనను యిది సృష్టించింది"

జాతీయ ప్రజాతంత్ర సంఘటనలో జాతీయ బూర్జువావర్గానికీ, కార్మికవర్గానికీ సంయుక్త నాయకత్వం వుంటుందని మనం అన్నట్లు శ్రీ బి.టి. రణదివె అన్నారు. మనం శాంతియుత పార్లమెంటరీ పంథాను ప్రతిపాదించిగా సి.పి ఐ.(ఎం) మాత్రం విప్లవకర పంథాను ప్రతిపాదించిందని కూడా ఆయన చెప్పుకున్నారు.

ఇవన్నీ నిందారోపణలనీ, వాస్తవాలకు విరుద్ధమైనవనీ నేను చెప్పక తప్పదు.

శ్రీ రణదివెగారు ఆరోపిస్తున్నట్లుగా, ప్రస్తుత భారతదేశపు రాజ్యాంగ యంత్రం గుత్తేతర జాతీయ బూర్జువా వర్గపు సాధనం అనీ, బడా బూర్జువా వర్గానికీ, భూస్వాములకు ఇందులో స్థానం లేదని మన పార్టీ కార్యక్రమంలో మనం ఎక్కడా చెప్పలేదు. మన కార్యక్రమం ఇలా చెపుతున్నది

"భారతదేశంలోని రాజ్యాంగ యంత్రం మొత్తం జాతీయ బూర్జువావర్గ పరిపాలనకు సాధనం. ఇందులో బడా బూర్జువావర్గం శక్తివంతమైన ప్రభావాన్ని కలిగివుంది. భూస్వాములతో, ఈ బడా బూర్జువా వర్గానికి బలీయమైన సంబంధాలున్నాయి. ఈ కారణాలవలన, రాజ్యాంగ యంత్రంపై అభివృద్ధి నిరోధక వత్తిడ్లు యేర్పడుతున్నాయి.

బడా బూర్జువా వర్గంతో సహా మొత్తం జాతీయ బూర్జువావర్గం యొక్క వర్గ ప్రయోజనాలకు భారతదేశపు రాజ్యాంగ యంత్రం ప్రాతినిధ్యం వహిస్తుంటనీ, ఆ బడా బూర్జువా వర్గానికి శక్తివంతమైన పలుకుబడి వున్నదని మా పార్టీ కార్యక్రమం స్పష్టీకరిస్తున్న విషయం దయచేసి గమనించండి. ఈ బడా బూర్జువా వర్గానికి భూస్వాములతో బలమైన సంబంధాలున్నాయని కూడా అది స్పష్టం చేస్తున్నది. ప్రస్తుత రాజ్యాంగ యంత్ర చట్రంనుంచి బడా బూర్జువా వర్గమూ, భూస్వాములూ తొలిగింపబడినట్లు ఎక్కడున్నది ? మన పార్టీ కార్యక్రమ వైఖరులపై నిందలు వేయడానికి శ్రీ బి. టి. రణదివె చేసిన సంపూర్ణ వక్రీకరణ కాదా యిది ?.

"బడా బూర్జువా నాయకత్వంలోని బూర్జువా భూస్వాముల వర్గ పాలనకు ప్రస్తుత భారత రాజ్యాంగ యంత్రం సాధనం అని సి.పి.ఐ (ఎం) కార్యక్రమం వర్గీకరిస్తుంది ఉభయ పార్టీల వర్గీకరణల మధ్య సూక్ష్మమైన తేడా ఉంది. అయితే రెండు కార్యక్రమాల్లోని రాజ్యాంగ యంత్రపువర్గ చట్రంలో అవే వర్గాలున్నాయి.

రాజ్యాంగ యంత్రం మొత్తం బూర్జువా వర్గానికి చెందిందని, ఇందులో బడా బూర్జువా వర్గానికి బలీయమైన పలుకుబడి వున్నదని యీ వర్గానికి భూస్వాములతో బలమైన సంబంధాలున్నాయని మన పార్టీ కార్యక్రమం

చెబుతుండగా, బడా బూర్జువా నాయకత్వంలోని బూర్జువా భూస్వాముల రాజ్యాంగ యంత్రం ఇది అని సి. పి. ఐ (ఎం) కార్యక్రమం చెబుతున్నది.

సారభూతంగా చూస్తే ప్రతి రాజ్యాంగ యంత్రమూ ఏదో ఒక వర్గం యొక్క రాజ్యాంగ యంత్రమే అన్నది మన అభిప్రాయం. అయితే ఆ వర్గానికి మిత్రులు వుంటారు ఇక మన రాజ్యాంగ యంత్రానికి సంబంధించి ఇది మొత్తం బూర్జువా వర్గపు రాజ్యాంగ యంత్రం. ఆ వర్గమే నిర్ణాయకాంశం. ఈ వర్గానికి భూస్వాములు మిత్రులుగా వున్నారు అదే విధంగా సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్ని శ్రామికవర్గ నియంతృత్వం అంటాం. ఇక్కడ శ్రామిక వర్గానికి, శ్రామిక రైతాంగమూ, ఇతర అర్ధ కార్మిక వర్గాలూ మిత్రులుగా వుంటారు

రాజ్యాంగ యంత్ర చట్రంలో బడా బూర్జువా వర్గానికి బలీయమైన ప్రాబల్యం వుంటుందని మన పార్టీ కార్యక్రమం చెప్పుతున్నది. అయితే సి. పి. ఐ (ఎం) కార్యక్రమం చెబుతున్నట్లుగా బడా బూర్జువా వర్గమే రాజ్యాంగ యంత్రాన్ని నడిపిస్తుందని మన కార్యక్రమం చెప్పడంలేదు. ఎందుచేతనంటె ప్రగతి నిరోధక మైన బడా బూర్జువా వర్గానికి గనుక రాజ్యాంగ యంత్రంపై సంపూర్ణ అధికారం వున్నట్లయితే భారత రాజ్యం సామ్రాజ్య వ్యతిరేక. అలీన విధానం. సోవియట్ యూనియన్‌తోనూ ఇతర సోషలిస్టు దేశాలతోనూ మైత్రి. స్వావలంబన ఆర్థిక వ్యవస్థతో కూడిన అభివృద్ధి అనే స్థూలంగా ప్రగతిశీల విధానాలను అవలంభించ జాలదు.

ఈ విషయంలో సి. పి ఐ (ఎం) కార్యక్రమంలో పొరపాటు వున్నదని చెప్పకతప్పదు ఎందుచేతనంటే, ప్రగతి నిరోధక మైనటువంటి, విదేశీ పెట్టుబడితో అధికాధికంతో సాంకర్యం నెరపేటటువంటి బడా బూర్జువా వర్గంయొక్క నాయకత్వంలోని రాజ్యాంగ యంత్రం, సామ్రాజ్యవాద వ్యతిరేకత, సోవియట్, యూనియన్‌తోనూ యితర సోషలిస్టు దేశాలతోనూ, మైత్రితో కూడిన ప్రగతిశీల విధానాన్ని ఎలా అవలంబించగలదో ఆ కార్యక్రమం విశదీకరించడం లేదు.

## జాతీయ ప్రజాతంత్ర సంఘటన

కాగా రాజ్యాంగ యంత్రంలో బడా బూర్జువా వర్గానికి బలీయమైన ప్రాబల్యం వున్నదే కానీ దాని సంపూర్ణ నాయకత్వం కిందనే రాజ్యాంగ యంత్రం లేదని మన కార్యక్రమం చెబుతున్నది కాబట్టి ఇట్టి రాజ్యాంగ యంత్రం ప్రగతిశీల విదేశాంగ విధానాన్ని అవలంబిస్తున్నదని అర్థం చేసుకోవచ్చు .

ఇక బి. టి రణదివెగారు ఆరోపించిన "సంయుక్త నాయకత్వం" గురించి మన కార్యక్రమంలో ఎక్కడా "సంయుక్త నాయకత్వం" అనే యీ పదం

కనిపించదు. పాఠకుడు తన సొంత నిర్ధారణకు వచ్చేందుకు వీలుగా మన కార్యక్రమంలోని సుదీర్ఘమైన ఉల్లేఖనను ఇస్తున్నాను. కార్యక్రమంలో ఇలా ఉంది. :

"ప్రధానంగా కార్మిక వర్గం, రైతుల, విప్లవకర మధ్య తరగతుల తోడ్పాటుతో నడిపే పోరాటాలనుంచి జాతీయ ప్రజాతంత్ర సంఘటన ఉద్భవిస్తుంది కనుక, వారితోబాటు జాతీయ బూర్జువా వర్గంలోని దేశభక్తియుత విభాగాలు కూడా సానుకూల పాత్ర నిర్వర్తిస్తూ జాతీయ ప్రజాతంత్ర సంఘటనలో భాగంగా తయారవుతాయి.

"ఈ సంఘటన అధికారంలోకి రాగానే పైన చెప్పిన కార్యక్రమాన్ని అమలుజరుపుతుంది ఐక్య. విప్లవకర ప్రజా ఉద్యమాలపై ఆధారపడుతూ అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను భగ్నపరుస్తుంది.

"అప్పుడు రాజ్యాంగ యంత్రం పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరిచే బూర్జువా వర్గ పరిపాలనా సాధనంగా ఏంత మాత్రం వుండదు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో జాతీయ ప్రయోజనాలకు, సామాన్య ప్రజల ప్రయోజనాలకు ముప్పు కలిగించే సహజసిద్ధమైన వైరుధ్యాలుంటాయి. బూర్జువావర్గం చేతుల్లో కేంద్రీకరింపబడివున్న గుత్తాధికారం అప్పుడు రద్దు చేయబడుతుంది.

"జాతీయ ప్రజాతంత్ర సంఘటన చేతుల్లో జాతీయ ప్రజాతంత్ర ప్రభుత్వం వుండే దశ ఒక తాత్కాలిక పరివర్తన దశ సామ్రాజ్యవాద ప్రయోజనాలను నిర్మూలించడంలోనూ, అర్థఫ్యూడల్ శక్తుల్ని తుడిచి పెట్టడంలోనూ, గుత్తపెట్టుబడిదార్ల అధికారాన్ని బద్దలు కొట్టడంలోనూ ఆసక్తి గల వర్గాలన్నీ ఈ దశలో ఉమ్మడిగా అధికారం చెలాయిస్తాయి. ఈ వర్గ సమ్మేళనంలో కార్మికవర్గ ఏకైక నాయకత్వం ఇంకా నెలకొనదు; అయితే బూర్జువా వర్గ నాయకత్వం కూడా ఉండదు. ఖచ్చితమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక, గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక శక్తులతో ఈ సంఘటన యొక్క నాయకత్వం కూడి వుంటుంది.

జాతీయ ప్రజాతంత్ర సంఘటన ప్రభుత్వం. దానికి ప్రాతినిధ్యం వహించే వర్గ సమ్మేళనం కార్మిక, కర్షక మైత్రిమీద ఆధారపడి వుంటుంది. కాబట్టి యిది దానికి కీలకం కనుక కార్మికవర్గం యీ సమ్మేళనంలో అధికాధికంగా నాయకత్వ పాత్ర వహిస్తుంది. ఎందుచేతనంటే, జాతీయ ప్రజాతంత్ర సంఘటనను చైతన్యయుతంగా ప్రారంభించేదీ, నిర్మించేదీ కార్మికవర్గమే" (కార్యక్రమం పుటలు47-48).

శ్రీ బి. టి. రణదివె ఆరోపిస్తున్నట్లు మన కార్యక్రమంలో ఎక్కడా "సంయుక్త నాయకత్వం" ప్రస్తావనే లేదు. కార్మికవర్గం నాయకత్వాన సాగే

పోరాటాలనుంచి జాతీయ ప్రజాతంత్ర సంఘటన ఆవిర్భవిస్తుంది సంఘటనలో భాగస్వామి అయిన గుత్తేతర జాతీయ బూర్జువా వర్గాన్ని నాయకత్వం నుంచి క్రమేణా తొలగించాలని మన కార్యక్రమం నొక్కిచెబుతున్నది.

మన ప్రజానీకం త్వరితగతిని చైతన్యవంతులవుతున్నారు; సోషలిస్టు కుటుంబమూ సోషలిస్టు శక్తులూ జయప్రదంగా పురోగమిస్తున్నారు. మరోవైపు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ పరిష్కారంలేని లోతైన సంక్షోభంలో కూరుకుపోతున్నది. ఇట్టి పరిస్థితులలో కార్మికవర్గం జాతీయ ప్రజాతంత్ర సంఘటనకు సంపూర్ణ నాయకత్వం వహించకముందే, మనదేశంలో జాతీయ ప్రజాతంత్ర సంఘటన, ఆ సంఘటన తాలూకు రాజ్యాంగ యంత్రమూ అవతరిస్తాయని మనం భావిస్తున్నాము.

ఈ జాతీయ ప్రజాతంత్ర సంఘటనలోనూ, రాజ్యాంగ యంత్రంలోనూ కార్మికవర్గం సంపూర్ణ నాయకత్వం నెరపకపోయినా ముఖ్యమైన పాత్రమాత్రం నిర్వహిస్తుంది.

ఈ అంశంపై సి.పి.ఐ. (ఎం) కార్యక్రమం యేమంటుంది? ఆ కార్యక్రమం ఇలా అంటుంది :

"కార్మికవర్గ నాయకత్వం కిందనూ, దాని రాజకీయ పార్టీ నాయకత్వం కిందనూ తప్ప జనతంత్ర ప్రజాస్వామ్య సంఘటన విజయవంతంగా నిర్మింపబడదు. విప్లవం విజయం సాధించజాలదు"

కాబట్టి చెప్పొచ్చేదేమంటే, భారత కార్మికవర్గపు ఏకైక పార్టీగా చెప్పుకునే సి. పి. ఐ (ఎం) మన దేశంలాటి పెద్ద దేశానికి నాయకుడుగా తయారయ్యేదాకా విప్లవకర ప్రజాతంత్ర సంఘటన కాని రాజ్యాంగ యంత్రంకానీ నిర్మించబడజాలదు; ఆ శుభ ఘడియకోసం ప్రజలు ఎదురు చూడాల్సిందే!

తమ భావనకు సంబంధించి జనతంత్ర ప్రజాస్వామ్య ప్రభుత్వం ఉనికిలోకి రావడానికి ముందు "పరివర్తన స్వభావం"గల ప్రగతిశీల ప్రభుత్వాలు అస్తిత్వంలోకి వస్తాయని సి పి ఐ. (ఎం) కూడా భావించింది ఆ పార్టీ యిలా అంది :

"ప్రజలకు తక్షణ ఉపశమనం కలిగించే సాధారణ కార్యక్రమాన్ని అమలు పరచడానికి ప్రతినబూనిన ప్రభుత్వాలను ఉనికిలోకి తెచ్చే అన్ని అవకాశాలనూ పార్టీ వినియోగించుకుంటుంది ఇలాటి ప్రభుత్వాల ఏర్పాటు శ్రామిక ప్రజల విప్లవోద్యమాలకు గొప్ప ఊపు నిస్తుంది; ఆ విధంగా ఆ ఏర్పాటు ప్రజాతంత్ర సంఘటన నిర్మాణక్రమానికి సహాయపడుతుంది."

దీనినిబట్టి శ్రామిక వర్గం సంపూర్ణ నాయకత్వంలోకి రావడానికి ముందు, పరివర్తనాత్మక ప్రభుత్వాల ఉనికిని మనం ఒప్పించడం తప్పుకాదని తెలుస్తున్నది

ఈ సందర్భంగా, మనపార్టీ కార్యక్రమంలోనిదంటూ శ్రీ బి టి రణదివెగారు ఒక ఉల్లేఖన యిచ్చారు. జాతీయ ప్రజాతంత్ర సంఘటనలో జాతీయ బూర్జువా వర్గం కార్మికవర్గం మధ్య సంయుక్త నాయకత్వం వుంటుందని మన కార్యక్రమంలో వుందని తానుచేసే వాదనకు సోదాహరణగా ఆయన ఆ ఉల్లేఖన యిచ్చాడు. ఆ ఉల్లేఖన యిది "1951 కార్యక్రమంలో మన కేంద్ర నినాదంగా ప్రకటించిన జనతంత్ర ప్రజాస్వామ్య రాజ్యాంగ యంత్రానికి, జాతియ ప్రజాస్వామ్యానికి తేడా వుంది. 1951 డాక్యుమెంటులో జనతంత్ర ప్రజాస్వామ్యం కోసం వివరించబడిన వర్గ స్వరూపమూ, కార్యక్రమమూ రెండు కూడా జాతీయ ప్రజాస్వామ్యంలో వివ లాచబడిన వర్గ స్వరూపంలాగే కార్యక్రమంలాగే వున్నాయి. ఇవి దాదాపు ఒకే గురించాయి. వున్న తేడా యేమిటంటే జనతంత్ర ప్రజాస్వామ్యంలో దేశభక్తి యుత వర్గాల సమ్మేళనం, కార్మిక వర్గం యొక్క ఏకైక నాయకత్వం క్రింద వుంటుంది. కానీ జాతీయ ప్రజాస్వామ్యంలో దేశ భక్తియుత వర్గాల సమ్మేళనంపై జాతీయ బూర్జువావర్గ నాయకత్వమూ, కార్మికవర్గ నాయకత్వము ఉభయుల నాయకత్వమూ వుంటుంది.

అయితే ఈ ఉల్లేఖన మన పార్టీ కార్యక్రమంలో ఎక్కడా లేదు.

## విప్లవ పంథా

ఇక విప్లవ పంథా ప్రస్తావనకు వద్దాం. మన కార్యక్రమం శాంతియుత పార్ల మెంటరీ పంథా ప్రతిపాదిస్తున్నదనడం, సి. పి. ఐ. (ఎం) కార్యక్రమం శాంతేతర పంథా ప్రతిపాదిస్తున్నదనడం సరికాదు.

దేశంలో ప్రజాస్వామ్యం వుండగా, వయోజనులందరకూ ఓటింగ్ హక్కు వుండగా, సోషలిస్టు విప్లవం తీసుకురావడానికి సి. పి. ఐ. కి విప్లవంతో అవసరం యేమిటని జవహర్‌లాల్ నెహ్రూ ప్రశ్నించిన సందర్భంగా 1958 అమృత్‌సర్ మహాసభలో ఈ సమస్యపై చర్చ జరిగింది.

మన పార్టీ మహాసభ ఆ సమస్యపై నిర్ణయం తీసుకుని, పార్టీ నిబంధనావళి ఉపక్రమణి లో ఆ నిర్ణయాన్ని చేర్చింది. పార్టీ చీలిక అనంతరం సి. పి. ఐ, సి. పి. ఐ (ఎం) లు ఉపక్రమణికలోని ఆ భాగాన్ని ఎత్తివేసి తమ తమ కార్య క్రమాల్లో పెట్టుకున్నాయి.

విప్లవ పంథాకు సంబంధించి రెండు కార్యక్రమాల్లో వున్నదీ ఒకటే. కొన్ని వాక్యాలకు వాక్యాలేయథాతథంగా వున్నాయి. సి. పి. ఐ. కార్యక్రమంలో ఇలా వుంది.

"భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పేటందుకు' శాంతియుత పద్ధతుల్లో సోషలిజాన్ని స్థాపించాలన్న లక్ష్యం వైపు పురోగమించ డానికి అవసరమైన పరిస్థితులను సృష్టించేందుకు కృషి చేస్తుంది....

"కార్మికులను సకల శ్రామిక ప్రజల విప్లవ శక్తుల్ని సమీకరించి సమైక్యం చేయడమూ, ప్రజా విప్లవ కార్యాచరణను విస్తరించడమూ సిసలైన పార్లమెంటరీ మెజారిటీ సంపాదించడానికీ, విప్లవంలో విజయాన్ని సాధించడానికి ఇది నిర్ణయాత్మకమైన ప్రధానాంశం

"ఈ పరివర్తనా రూపం అంతర్జాతీయ పరిస్థితి మీద ప్రధానంగా ఆంతరంగిక పరిస్థితిమీద ఆధారపడి వుంటుంది ..."

పాలక వర్గాలు తమ అధికారాన్ని ఇచ్ఛితంగా వదలుకోవనే విషయం ఎల్లప్పుడూ జ్ఞాపక ముంచుకోవాలి. ప్రజావాంఛను వారు ధిక్కరిస్తారు చట్ట వ్యతిరేక, హింసాత్మక పద్ధతుల్లో దానిని అణచ ప్రయత్నిస్తారు. ఈ విషయాన్ని మన అనుభవమే నిరూపిస్తున్నది. అందుచేత విప్లవశక్తులు ఏ అవాంతర పరిస్థితుల నైనాసరే ఎదుర్కొనగలిగేటట్లు, దేశ రాజకీయ జీవితంలో ఏ విధమైన ఆకస్మిక మార్పులు సంభవించినా సంసిద్ధులై వుండేట్లు తమను తమ కార్యకలాపాలనూ మలుచుకోవలసివుండింది (కార్యక్రమం పుటలు 61-62)

మన కార్యక్రమంలో ఇంకా ఇలావుంది :

"ప్రజాతంత్ర శక్తుల మధ్య వున్న విభజనను అధిగమించడానికి' ఆ శక్తులను ఐక్యం చేయడానికి జరిపే కృషిలో జాతీయ ప్రజాతంత్ర సంఘటన ఆవిర్భవించి రూపు దాలుస్తుంది. దేశవ్యాపిత ఐక్య ప్రజా పోరాటాల ఫలితంగా యీ సంఘటన దృఢ పడుతుంది. అభివృద్ధి నిరోధక, ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగాసాగే పార్లమెంటరీ, పార్లమెంట రేతర పోరాటాలలో ఇది దృఢపడుతుంది. అదే సమయంలో యీ పోరాటాలను విచ్ఛిన్నం చేసేందుకు యత్నించే కుల, మత శక్తులకు, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా జరిగే పోరాటాల ఫలితంగా ఈ సంఘటన దృఢ పడుతుంది."

సి. పి. ఐ. (ఎం) కార్యక్రమంలో యిలా వుంది.

"శాంతియుత పద్ధతుల ద్వారా జనతంత్ర ప్రజాస్వామ్యం నెలకొల్పడానికీ, సోషలిస్టు పరివర్తన సాధించడానికి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కృషి చేస్తుంది. బలీయమైన ప్రజా విప్లవకర ఉద్యమాన్ని పెంపొందించడం ద్వారానూ పార్లమెంటరీ, పార్లమెంటరేతర పోరాట రూపాలను సమ్మేళనం చేయడం ద్వారానూ అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను అధిగమించడానికీ, అట్టి పరివర్తనలను శాంతియుత పద్ధతుల ద్వారా తీసుకురావడానికీ కార్మికవర్గమూ, దానిమిత్రులు శక్త్యాను సారం కృషిచేస్తారు....

అయితే పాలకవర్గాలు ఎన్నటికీ తమ అధికారాన్ని ఐచ్ఛికంగా వదులుకోవు అన్న విషయం మనం ఎల్లప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి ప్రజా వాంఛను ధిక్కరించడానికీ, చట వ్యతిరేక పద్ధతులద్వారానూ, హింసాకాండద్వారానూ ప్రజా వాంఛను అణచివేయడానికి పాలక వర్గాలు ప్రయత్నిస్తాయి. కాబట్టి విప్లవశక్తులు అప్రమత్తంగా ఉండాల్సిన అవసరమే కాక, ఎలాటి పరిస్థితులనైనా ఎదుర్కొన గలిగేటట్లు, దేశరాజకీయ జీవితంలో ఎలాటి ఆకస్మిక పరిణామాలనైనా ఎదుర్కొన గలిగేటట్లు తమ కృషిని మలచుకోవలసి ఉంటుంది." [సి.పి.ఐ (ఎం) కార్యక్రమం పుట 48]

పైన ఇచ్చిన రెండు కార్యక్రమాల్లోని వాక్యాలను తులనాత్మకంగా పరిశీలిస్తే వాటి మధ్యగల సారూప్యత యేమిటో బోధపడుతుంది

కొన్ని ముఖ్యమైన తేడాలున్నప్పటికీ రెండు కార్యక్రమాల్లోనూ ఉమ్మడి అంశాలు కూడా చాలా వున్నాయని చెప్పక తప్పదు. విభేదాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వకుండా విప్లవకర ప్రజోద్యమం అభివృద్ధిపై కేంద్రీకరించడం విజ్ఞత అనిపించుకుంటుంది. మన పార్టీ, సి.పి.ఐ. (ఎం) మధ్యగల విభేదాలను పరిష్కరించడానికి ప్రజోద్యమ అనుభవమూ ఘటనలూ సహాయ పడతాయి. ★

# కమ్యూనిజం - సోషల్ డెమాక్రసీ రెండు సిద్ధాంతాలు; రెండు పంథాలు

ఈడ్పుగంటి నాగేశ్వరరావు

యిటీవలభారత కమ్యూనిస్టు పార్టీ పై మార్క్సిస్టు పార్టీ నాయకత్వం సిద్ధాంత దాడికి పూనుకున్నది. భారత కమ్యూనిస్టు పార్టీ "వామ పక్ష పార్టీ" మాత్రమేనని, ఆ పార్టీ కమ్యూనిస్టు పార్టీ కాదని. "కొన్ని కమ్యూనిస్టు లక్షణాలు" కల్గిన పార్టీ యని, మార్క్సిస్టు పార్టీ నాయకులు కొందరు ఆరోపించగా మరి కొంతమంది దానిని "సోషల్ డెమాక్రటిక్ పార్టీ" అంటూ తెగేసి చెప్పారు.

కమ్యూనిస్టు పార్టీ, సోషల్ డెమాక్రటిక్ పార్టీల మధ్య మౌలిక వ్యత్యాసాలు ఏమిటి ? ఆ పార్టీల మౌలిక లక్షణాలు ఏమిటి?; చరిత్రలో ఏం జరిగింది ? నేటి వాస్తవం ఏమిటి ? భారత కమ్యూనిస్టు పార్టీ స్థానం ఏమిటి? తదితర అంశాలను చర్చించడమే యీ వ్యాసం వుద్దేశం

వివరాలలోకి వెళ్ళేముందు ఒక విషయం స్పష్టం చేస్తాం. సోషల్ డెమాక్రసీ, లేదా సోషల్ డెమాక్రటిక్ పార్టీ వివిధ దశలలో అనుసరించిన సిద్ధాంత, రాజకీయ వైఖరులనుబట్టి, శ్రామిక వర్గ విప్లవాల పట్ల దానికిగల అగాహన ననుసరించి, అది కొన్ని ప్రత్యేక అర్థాలను సంతరించుకుంది. పేరుకు సంబంధించిన వివాదం కాదు; భావానికి సంబంధించినవిగా దీనిని కమ్యూనిస్టులు చూస్తున్నారు. సోషల్ డెమాక్రసీ సంస్కరణ వాదానికి మారుపేరయింది. కమ్యూనిస్టు పార్టీ విప్లవానికి పర్యాయపదమయింది. సోషల్ డెమాక్రసీ మార్క్సిస్టు విప్లవ సిద్ధాంతాన్ని తిరస్కరిస్తోంది. కమ్యూనిస్టు పార్టీ మార్క్సిజం సిద్ధాంత పవిత్రతను కాపాడుతూ, దానిని పెంపొందిస్తున్నది.

# సోషల్ డెమాక్రసీ సిద్ధాంత పునాదులు

అంతర్జాతీయ కార్మికోద్యమంలో, ముఖ్యంగా జర్మనీ సోషల్ డెమాక్రటిక్ ఉద్యమంలో గత శతాబ్ది ముగింపు దశలో నేటి సోషల్ డెమాక్రసీకి మూలకంద మయిన భావాలు తలెత్తాయి. ఎడ్వర్డ్ బెర్న్‌స్టయిన్ నాటిపార్టీ అధికార పత్రికలో 1897-98 సంవత్సరాలలో వరుసగా కొన్ని వ్యాసాలు రాశాడు. మార్క్సిజం పేరుతో దాని సారాన్ని నిరాకరించాడు. ఆయన సిద్ధాంతాలు వైరుధ్యాల పుట్ట. శ్రామికవర్గ పోరాట ఆవశ్యకతను ఒకవైపు గుర్తించినట్టు గాను వాదిస్తాడు రెండోవైపు ప్రజాస్వామ్యం గురించిన వ్యాఖ్యానం వర్గపోరాటాన్ని నిరాకరించే రీతిలో వుంటుంది. వ్యక్తిగత ఆస్తిపై ఆధారపడిన పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రం కొనసాగే "హక్కు"ను గుర్తిస్తాడు. బెర్న్‌స్టయిన్ రివిజనిస్టు సిద్ధాంతాలను నాటి జర్మన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ నాయకత్వం, రెండవ ఇంటర్నేషనల్ నాయకత్వం తిరస్కరించింది. మహాసభ చర్చలలో వాటిని ఓడించింది. ఈ సిద్ధాంత పోరాటంలో రోజాలగ్జెంబర్గ్ ప్రముఖపాత్ర వహించింది. కాని బెర్న్‌స్టయిన్ భావాలు కొన్ని సెక్షన్లలో కొనసాగడమే కాక, ఆయా నిర్దిష్ట చారిత్రిక పరిస్థితులలో బలపడినాయి కూడ ఒకోదేశంలో ఒకోరూపంలో యివి వ్యక్తమవుతూవచ్చాయి.

బెర్న్‌స్టయిన్ సిద్ధాంత వారసత్వం నేటి సోషల్ డెమాక్రటిక్ సాహిత్యంలో "ఉదారవాద ధోరణి"గా ప్రాముఖ్యంలో వుంది. తన సోషలిజాన్ని "ఉదార వాదం పరిసమాప్తి"గా బెర్న్‌స్టయిన్ చిత్రించుకున్నాడు. ఆస్ట్రియా సోషల్ డెమాక్రటిక్ నాయకుడు బ్రూనో క్రీస్కి కొంతకాలం క్రితం దీనిని ఘనంగా కీర్తించాడు.

ఆ తరువాత దశలో జర్మన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ సిద్ధాంత వేత్త కారల్ కౌట్స్కీ మార్క్సిస్టు మౌలిక ప్రతిపాదనలను అంగీకరిస్తూన్నానంటూనే శ్రామికవర్గ నియంతృత్వ భావాన్ని నిరాకరించాడు. 1918 లో ఆయన రాసిన గ్రంథాలలో రివిజనిస్టు వేదికకు కావలసిన పూర్తి హంగులు ఏర్పడినాయి. ప్రజాస్వామ్యం పట్ల వర్గవైఖరి ఏమిటి ? శ్రామికవర్గం అధికారం సంపాదించటం ఎలా? ఈ సమస్యలను కౌట్స్కీ చర్చించుతూ అక్టోబరు మహత్తర విప్లవంలో "ప్రజాస్వామ్య ప్రమాణాలు" పాటించలేదని బోల్షివిక్కులను విమర్శించాడు. శ్రామికవర్గ నియంతృత్వంలో అప్రజాస్వామిక స్వభావం వుందని ఖండించాడు.

క్రమంగా యీ ధోరణి కమ్యూనిస్టు వ్యతిరేకతా రూపం తీసుకుంది. ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయాలనే మార్క్స్ సూత్రీకరణను అంగీకరించిన కౌట్స్కీ, ఆయన అనుయాయులు, లిబరల్ సోషల్ డెమోక్రాట్లతో చేతులు కలిపారు.

## సోవియట్ వ్యతిరేకత

1920-30సంవత్సరాల కాలంలో సోషల్ డెమోక్రటిక్ నాయకులు,సోషలిజం సిద్ధాంత పునాదులను చర్చించుతూ తాత్విక రంగంలో కాంట్ ప్రతిపాదనలను, ఆర్థిక రంగంలో పెట్టుబడిదారీ మార్కెట్ సూత్రాలను అంగీకరించారు. సోవియట్ యూనియన్‌లో సోషలిజం నిర్మాణం మానవ హక్కులను ఉల్లంఘించుతోందని, ప్రజాస్వామ్యాన్ని హరించవేస్తున్నదనే విమర్శకు పూనుకున్నారు.

నాటి సోషల్ డెమోక్రటిక్ ఉద్యమంలో రెండు ప్రధాన ధోరణులు వున్నాయి. ఒకదానికి మితవాదులు (లిబరల్స్) నాయకత్వం వహించగా రెండో ధోరణికి లెఫ్ట్ సోషలిస్టులు నాయకత్వం వహించారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం సోషల్‌డెమోక్రట్ల సిద్ధాంత పరిణామంలో నూతన దశ ఏర్పడింది. శాస్త్రీయ సోషలిజంతో అంతిమంగా వారు తెగతెంపులు చేసుకోవటంతో పాటు కమ్యూనిజం వ్యతిరేక దాడికి పూనుకున్నారు. అస్తిత్వంలో సోషలిజాన్ని వ్యతిరేకించారు. 1950 దశకం, 1960 దశకంలో సోషలిస్టు ఇంటర్నేషనల్ సోషలిజం చారిత్రక అనివార్యతా భావాన్ని కూడ విసర్జించింది. 1951 లో సోషలిస్టు ఇంటర్నేషనల్ ఆమోదించిన ఫ్రాంక్ ఫర్ ప్రకటనలో యీ భావాలన్నింటిని పొందుపరిచారు. కమ్యూనిస్టు వ్యతిరేక విధాన ప్రకటనగా అది వెలువడింది. అప్పటివరకు సోషల్ డెమొక్రటిక్ పార్టీ నాయకులు కొందరూ, కొన్ని దేశాలలో మార్క్సిజం పట్ల విధేయత ప్రకటించుతూ వచ్చారు. కాని ఫ్రాంక్ ఫర్ట్ ప్రకటనలో మార్క్సిజంను, యితర అనేక సిద్ధాంత, రాజకీయ ధోరణులలో ఒకటిగా పేర్కొంటూ, వీటన్నింటిని సోషల్ డెమొక్రట్లు నూతన సమాజ నిర్మాణం కొరకు వినియోగించు కోవాలని తెలిపారు

ఇది రాజీ ధోరణి. "భావాల బహుళత్వం" ప్రాతిపదికగా సోషల్ డెమొక్రసీ ఒక నూతన సిద్ధాంతానికి రూపకల్పన చేసింది. బహుళ సిద్ధాంతాలను అంగీకరించింది.

ఆస్ట్రియన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ సిద్ధాంతవేత్త కారల్ జెర్నెట్జ్ దీనికి యీ క్రింది పేర్కొన్న తీరులో సుదీర్ఘ వివరణ యిచ్చాడు. పెట్టుబడిదారీ విధానాన్ని ఫ్రాంక్‌ఫర్ట్ ప్రకటన విమర్శించింది. సామ్రాజ్యవాద వలస విధానాన్ని ఖండించింది. పెట్టుబడిదారీ దేశాలలో వర్గపోరాట తీవ్రతను గుర్తించింది కొన్ని దేశాలలో ఫాసిజంను గుత్త పెట్టుబడిదారీ వర్గం బలపరచింది. పాశవిక దమన కాండను అది అమలు పరచింది. కనుక పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించాలి. ఇంత వివరించిన కారల్ జెర్నెట్జ్, పెట్టుబడిదారీ విధానాన్ని ఒక సామాజిక వ్యవస్థగా ఎలా నిర్మూలించాలో తెలపలేదు ఫ్రాంక్‌ఫర్ట్ ప్రకటన యీ కీలక సమస్యపై మౌనం వహించింది. నూతన వ్యవస్థ రూపురేఖలు ఏమిటో తెలుపలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థ పునాదులను ముట్టకుండ కొన్ని సంస్కరణలు తీసుకురావాలనే భావాలను అది వ్యక్తం చేసింది. అదే సందర్భంలో ప్రపంచంలోని మొట్టమొదటి సోషలిస్టు దేశంపై సిద్ధాంత దాడిని ప్రారంభించింది. అక్కడ ప్రజాస్వామ్యం లుప్తమైపోయిందని, టోటలి టేరియన్ ప్రణాళికా విధానం అమలులో వుందని విమర్శించింది.

సోషల్ డెమొక్రాట్ల నూతన సిద్ధాంతాలను ఆనాడు నెలకొనివున్న ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణంలో సామ్రాజ్యవాద మేధావులు అమితోత్సాహంతో ఆహ్వానించారు

ఆతరువాత కాలంలో ముఖ్యంగా 1960–70 దశకాలలో సోషల్ డెమొక్రటిక్ నాయకులు అనేక సిద్ధాంత పల్టీలు కొట్టారు. కొంతకాలం "సిద్ధాంతం నుండి స్వేచ్ఛ" అన్నారు. మరికొంతకాలం మార్క్సిజం–లెనినిజంకు "ప్రత్యామ్నాయ" అన్వేషణలో వున్నామని ప్రకటించారు ఇప్పుడు కమ్యూనిజం, పెట్టుబడిదారీ విధానాలకు "మధ్యేమార్గం" ను రూపొందించే నిరర్థక ప్రయత్నంలో వున్నారు.

ఆ విధంగా, మార్క్సిజం సిద్ధాంత ప్రాతిపదికగా ప్రారంభమయిన సోషల్ డెమొక్రటిక్ ఉద్యమం వివిధ దేశాలలో ఆ సిద్ధాంత సూత్రాలకు తిలాంజలి యిచ్చి బాహాటంగా మార్క్సిజం–లెనినిజం వ్యతిరేక సిద్ధాంత వేదికను నిర్మించింది

సమకాలీన సోషల్ డెమొక్రటిక్ వుద్యమం దాదాపు 65 పార్టీలు, సంస్థలతో కలగూరగంప భావాలతో విరుద్ధ ధోరణులతో కూడివుంది. విచిత్ర రంగుల కలయికగా అగపడుతున్నది. ఇటీవల కాలంలో కారల్ పోపర్ తాత్త్విక భావాలను ఎక్కువ ప్రచారంలో పెట్టుతున్నారు.

తమ సిద్ధాంత వారసత్వం గురించి, తాత్విక, రాజకీయ పునాదులు గురించి జర్మను (పశ్చిమ) సోషల్ డెమాక్రటిక్ పార్టీ అధికార పత్రిక డై న్యూ గెసెల్ హస్ట్ కొద్దికాలం క్రితం యిచ్చిన వివరణ యిలా వుంది. "మానవుని గురించిన క్రీస్తియను సిద్ధాంతం, ఫ్రెంచి విప్లవం ప్రకటించిన మానవ హక్కులు, కాంట్ నీతి శాస్త్రం, హెగెల్ చారిత్రిక గతితార్కిక సిద్ధాంతం, పెట్టుబడిదారీ విధానంపై మార్క్స్ చేసిన విమర్శ, బెర్న్‌స్టయిన్ విమర్శనా మార్క్సిజం, రోజాలగ్జెంబర్గ్ విమర్శలు, స్కుమాచార్ స్వేచ్ఛపిపాస సోషలిజం, యిటీవల కాలంలో ఎర్నెస్ట్ బ్లాక్, అదోర్నో, కోలకోవస్కీ, హెబర్‌మాస్, మిలోవన్‌జిలాస్ తదితరుల నైతిక ప్రేరణలు." సోషల్ డెమాక్రసీకి ఆధార భూతాలు.

సోషల్ డెమాక్రసీ భావ సముదాయ చరిత్రను అర్థం చేసుకునేందుకు పైన పేర్కొన్న ఉల్లేఖన మనకు సహాయపడుతుంది.

## కమ్యూనిస్టుల ఎడల వైఖరి

ఆచరణలో, ముఖ్యంగా ఆయా చరిత్ర కీలక దశలలో, కమ్యూనిస్టుల ఎడల సోషల్ డెమాక్రట్లు ఎట్టి వైఖరిని తీసుకున్నారో పరిశీలిద్దాం.

కార్మికోద్యమంలోను, మధ్య తరగతుల్లోనూ వివిధ దేశాలలో సోషల్ డెమాక్రటిక్ పార్టీలకు విస్తృత పునాది వుంది. కమ్యూనిస్టులకు, సోషల్ డెమాక్రాట్లకు మధ్య సంబంధాలు ఎన్నడూ ఒకే రీతిలో లేవు

కమ్యూనిస్టు పట్ల సోషల్ డెమాక్రాట్ల వైఖరిలో కాలవాహినిలో కొన్ని మార్పులు వచ్చాయి. రెండవ ఇంటర్నేషనల్ 1914లో, యుద్ధం ప్రారంభం కావటంతో కూలిపోయింది. మెజారిటీ సోషల్ డెమాక్రటిక్ పార్టీలు తమ తమ ప్రభుత్వాలతో యుద్ధ కాలంలో చేతులు కలిపాయి. కాని రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరు పార్టీ (బోల్షివిక్ పార్టీ) నాటి రష్యాలో యుద్ధానికి వ్యతిరేకంగా విప్లవానికి సన్నాహాలు కావించింది కార్మికులను సమీకరించింది; రైతులలోనూ, సైన్యంలోనూ సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా, భూమి కోసం, శాంతి కోసం కృషిసల్పింది. ఉక్కు శ్రేణులతో నిర్మించిన బోల్షివిక్ పార్టీ, దాని నేత మహనీయుడు లెనిన్ విప్లవాన్ని నడిపారు. 1917 నవంబరులో విప్లవం విజయం పొందింది.

విప్లవంలో విస్తృత ప్రజానీకం పాల్గొంది. కార్మికవర్గంలో అత్యధికులు విప్లవానికి అండాగా నిలబడ్డారు. రైతాంగం సైన్యంలోని మెజారిటీ సెక్షన్లు విప్లవంలో పాల్గొన్నారు. సోవియట్ల నిర్మాణం జరిగింది కార్మిక, కర్షక ప్రభుత్వం ఏర్పడింది.

అదేకాలంలో యితర దేశాలలో విప్లవోద్యమాలకు సోషల్ డెమాక్రటిక్ పార్టీలు నాయకత్వం వహించలేక పోయినాయి.

1919-22 దశలో కమ్యూనిస్టుల పట్ల సోషల్ డెమాక్రట్లు వేచియుండే వైఖరి తీసుకున్నారు. అయితే సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా, 1919 లో ఏర్పాటయిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు వ్యతిరేకంగా విమర్శన బాణాలు సంధించారు. 1922 లో మూడు ఇంటర్నేషనల్స్‌ను ఐక్యపరిచే ప్రయత్నాలు విఫలమయ్యాయి.

1922-28 కాలంలో పూర్తి కమ్యూనిస్టు వ్యతిరేక పంథాను సోషల్ డెమాక్రట్లు అనుసరించారు. ఐక్య కార్యాచరణకు కమ్యూనిస్టు పార్టీలు చూపిన చొరవను వారు నిరాకరించారు.

1930 దశకం తొలిదశలో కమ్యూనిస్టుల పట్ల కొంత వాస్తవిక వైఖరి ప్రదర్శించారు. కాని

1933-36 సంవత్సరాలలో పూర్తి ప్రతి కూల వైఖరిని తీసుకున్నారు జర్మనీలో ఫాసిజం అధికారానికి రావటానికి యిది ఒక ప్రధానకారణం.

1935 నుండి 1939 వరకు ఫ్రాన్సు, స్పెయిన్ లాంటి దేశాలలో ఐక్య సంఘటన నిర్మాణంలో ఉభయులూ పాల్గొన్నారు. అనేక రూపాలలో ఉభయుల మధ్య సన్నిహిత సహకారం నెలకొంది.

1939 నుండి 41 వరకు ఉభయ పార్టీల సంబంధాలలో కొన్ని చిక్కులు ఏర్పడినా, తిరిగి 1941-1945 కాలంలో కమ్యూనిస్టులు, సోషల్‌డెమాక్రాట్లు ఫాసిస్టు ప్రతిఘటనా పోరాటంలో కలిసి పని చేశారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పడిన నూతన పరిణామాల ప్రభావంలో అనేకమంది సోషల్ డెమోక్రట్లు కమ్యూనిస్టు పార్టీలతో సహకారానికి సుముఖత వ్యక్తంచేశారు. ముఖ్యంగా 1945-47 కాలంలో ఇటలీ, ఫ్రాన్సు దేశాలలో ఉభయులతో కూడిన మిశ్రమ మంత్రి వర్గాలు ఏర్పడినాయి.

1947 వచ్చే నాటికి, నాడు ఏర్పడిన ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణంలో అనేక పశ్చిమ యూరప్ సోషల్ డెమోక్రటిక్ పార్టీలు, కమ్యూనిస్టు పార్టీలతో తెగతెంపులు చేసుకొన్నాయి 1947లో అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ జరిగింది. కమ్యూనిస్టులతో యింకా సహకరిస్తున్న సోషలిస్టు పార్టీలను ఆ మహాసభ నుండి వెలివేశారు 1951 లో ఫ్రాంక్ ఫర్డ్ మహాసభ ప్రకటన వెలువడింది. కమ్యూనిస్టు పార్టీలతో అన్ని సంబంధాలను నిషేధిస్తూ ఓస్లోలో 1962 లో జరిగిన సోషలిస్టు అంతర్జాతీయ మహాసభ తీర్మానించింది.

1962 నుండి క్రమేణా కొంత మార్పు వ్యక్తమవుతున్నది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీతో అనేక సోషల్ డెమాక్రటిక్ పార్టీలు సంబంధాలు ఏర్పరచు కున్నాయి ద్విపక్ష స్థాయిలో సంబంధాలు పెట్టుకొనే స్వేచ్ఛను కల్పిస్తూ 19..లో సోషలిస్టు ఇంటర్నేషనల్ బ్యూరో అధికార పూర్వకంగా తీర్మానించింది. ఫ్రెంచి, ఫినిష్, జపనీస్ యితర సోషలిస్టు పార్టీలు కమ్యూనిస్టు పార్టీలతో కలిసి సంయుక్త కార్యాచరణకు పూనుకున్నాయి కాని యీ పరిణామం మితవాద నాయకత్వానికి రుచించలేదు. ఇటలీ, చిలీ దేశాలలో ఉభయుల మధ్య మైత్రి ఏర్పడింది. 1976 లో, 1978 లోనూ జరిగిన సోషలిస్టు అంతర్జాతీయ మహాసభలలో కమ్యూనిస్టులతో సహకారం ఏ స్థాయివరకు పెంచుకోవాలనే సమస్యను చర్చించారు. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీతో నేడు అనేక సోషల్ డెమాక్రటిక్ పార్టీలకు సంబంధాలున్నాయి

సోషల్ డెమాక్రటిక్ పార్టీలు లేదా సోషలిస్టు పార్టీల సిద్ధాంతం – కార్యక్రమాలలో కొన్ని వైవిధ్యాలున్నప్పటికీ స్థూలంగా యీ దిగువ నిర్ధారణలకు రావచ్చు.

వారి ధ్యేయం "ప్రజాస్వామిక సోషలిజం". శాస్త్రీయ సోషలిజం మౌలిక భావాలయిన పెట్టుబడిదారీ వ్యవస్థను విప్లవాత్మకంగా మార్పు చేయటం; ఉత్పత్తి సాధనాలలో వ్యక్తి యాజమాన్యాన్ని రద్దుచేయటం; దోపిడీ వ్యవస్థ నిర్మూలనలో కార్మికవర్గ నాయకత్వ పాత్ర మొదలగు అంశాలను వారు నిరాకరించారు. సోషలిస్టు దేశాలలో సోషలిజం విజయాలను వారు వక్రీకరిస్తున్నారు. ఆ దేశాలలో ప్రజాస్వామిక సంస్థలను కమ్యూనిస్టు పార్టీలు పెంపొందించటం లేదని విమర్శిస్తున్నారు.

మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతం ప్రాతిపదికగల కమ్యూనిస్టు పార్టీలు, వివిన్న దేశాలలో శ్రామికవర్గ విప్లవాలకు నాయకత్వం వహించాయి. ఆ దేశాలలో సోషలిజం నిర్మాణం పురోగమిస్తున్నది. పెట్టుబడిదారీ దోపిడీవ్యవస్థ స్థానే నూతన సోషలిస్టు నాగరికత వికసిస్తున్నది. మార్క్సిజం నుండి దూరమై చివరకు ఆ సిద్ధాంతాన్ని విసర్జించిన సోషల్ డెమాక్రటిక్ పార్టీలు నేడెక్కడ వున్నాయి?

సోషల్ డెమాక్రట్లు ప్రభుత్వాలలో వున్న దేశాలలో ఎక్కడా పెట్టుబడిదారీ వ్యవస్థ రద్దుకాలేదు. పెట్టుబడిదారీ సామాజిక సంబంధాలు కొనసాగుతున్నాయి. దోపిడీ విధానం సాగిపోతున్నది.

## భారతదేశంలో కమ్యూనిస్టులు

భారత దేశంలోని సోషలిస్టులపై పశ్చిమ యూరప్ సోషల్ డెమాక్రసి ప్రభావం బలీయంగా వుంటుంది. గాంధీజీ భావాల ముద్ర కూడవుంది. మార్క్సి భావాలను ప్రచారం చేయటంలో తొలిదశలో ఆచార్యనరేంద్రదేవ్, జయప్రకాష్ నారాయణ్ ప్రభృతుల పాత్ర ప్రముఖమైనది. కాని యం. ఆర్. మసానీ, ఆ తరువాత కాలంలో అశోకమెహతా తదితరులలో కమ్యూనిస్టు వ్యతిరేకత జీర్ణించుకుపోయింది. కమ్యూనిస్టులు, సోషలిస్టుల మధ్య సన్నిహిత సంబంధాలు పెంపొందిన దశలు వున్నాయి. తీవ్ర విబేధాలు తలెత్తిన సందర్భాలు అనేకం.

స్వాతంత్ర్యానంతరం సోషలిస్టుల మధ్య ఐక్యత ఎన్నడూ సాధ్యపడలేదు. జయప్రకాష్, లోహియా, అశోకమెహతా లాంటి ప్రముఖుల ఆలోచనలలో, ఆచరణలో ఎవరి మార్గం వారిదే. ఆ తరువాత తరం నాయకులు యితర బూర్జువా పార్టీలలో చెల్లాచెదురుగా మిగిలిపోయారు.

భారతదేశంలో కమ్యూనిస్టులు ప్రారంభం నుండి శాస్త్రీయ సోషలిస్టు భావాలను ప్రచారం చేస్తూనే వున్నారు. శ్రామికవర్గ అంతర్జాతీయ ప్రాతిపదికగా ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలతో సోదర సంబంధాలు కల్గియున్నారు. సోషలిస్టు దేశాలలో సాధించిన విజయాలను భారత ప్రజలకు ఎరుకపరచటంలో నిర్విరామ కృషి సల్పారు. మార్క్సిజం-లెనినిజంను భారతదేశ పరిస్థితులకు అన్వయించటంలో సృజనాత్మక కృషి చేశారు. పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చనిదే సోషలిజం నిర్మాణం సాధ్యంకాదని, సోషలిస్టు విప్లవానికి ప్రజలను సంసిద్ధ పరచటానికి కమ్యూనిస్టులు శ్రమిస్తున్నారు. సర్వోదయం, గాంధీజం, ప్రజాస్వామిక సోషలిజం

పేరుతో ప్రచారంలో వున్న సిద్ధాంతాల వర్గ స్వభావాన్ని కమ్యూనిస్టులు వివరిస్తున్నారు భారతదేశంలో కమ్యూనిస్టులు బహుముఖ పోరాట రూపాలను చేపట్టారు. వివిధ వర్గాల ప్రజలను, ముఖ్యంగా కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని సమరశీల పోరాటాలవైపు నడిపించారు. రైతాంగ గెరిల్లా పోరాటాలు కార్మికవర్గ సమ్మెలు, బంద్ పోరాటాలు, మహా ప్రదర్శనలు పార్లమెంటరీ పోరాటాలు, రాష్ట్ర ప్రభుత్వాల నిర్వహణల అపార అనుభవాలు వారికి వున్నాయి.

కమ్యూనిస్టు పార్టీ 1964 లో చీలింది. చీలికకు గల అంతర్జాతీయ సిద్ధాంత విభేదాలు, జాతీయ కారణాల గురించిన వివరణ యిదే సంచికలో పార్టీ అగ్రనాయకులు రాసిన వ్యాసాలలో వుంది. అదేవిధంగా, ప్రస్తుత విప్లవదశకు సంబంధించిన భేదాభిప్రాయాలపైన కూడ వివరణ ఆ వ్యాసాలలోనే వుంది.

ఒకటి, రెండు యితర ముఖ్యాంశాలను మాత్రమే యిక్కడ పరిశీలిద్దాం.

చీలిక అనంతరం నాటినుండి నేటివరకు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో భాగంగా భారత కమ్యూనిస్టు పార్టీ కొనసాగుతూనే వుంది. సోదర కమ్యూనిస్టు పార్టీలతో సన్నిహిత సంబంధాలను కల్గియున్నది శ్రామిక వర్గ అంతర్జాతీయత పంథాను కొనసాగిస్తున్నది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికకు నాటి చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సాగిన విచ్ఛిత్తి చర్యలను భారత కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకించింది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు మన పార్టీ నిలబడింది.

ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సాధారణ పంథాను భారత కమ్యూనిస్టు పార్టీ బలపరచింది సోషలిస్టు దేశాల విజయాలను, ముఖ్యంగా సోవియట్ యూనియన్‌లో ప్రవర్ధిత సోషలిజం విశిష్టతను భారతదేశ ప్రజలలో ప్రచారం చేసింది. అనేక వక్రీకరణలకు సమాధానమిచ్చింది.

మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాలకు భారత కమ్యూనిస్టు పార్టీ కట్టుబడివుంది. శ్రామికవర్గ నియంతృత్వ భావనను అది బలపరచింది. శ్రామికవర్గ నాయకత్వాన సోషలిస్టు విప్లవం తన లక్ష్యంగా ప్రకటించింది.

భారతదేశ సమకాలీన పరిస్థితులకు మార్క్సిజం-లెనినిజంను వర్తింప చేయడంలో భేదాభిప్రాయాలు పొడచూపవచ్చు. ఐక్యపార్టీలో సైతం ప్రస్తుత విప్లవ దశపై భేదాభిప్రాయాలు తలెత్తాయి. అంగీకరించిన ప్రోగ్రాంను మార్చుకున్న

ఉదాహరణలు వున్నాయి. అనుభవంలో కొత్త సత్యాలు వెలుగులోకి రావచ్చు లేదా పరిస్థితులలో మార్పులు వచ్చినపుడు కొన్ని నిర్ధారణలు మారక తప్పదు. విప్లవ గమనంలో పొరపాటు దొర్లిన ఘటనలపై ఆయా దేశాల కమ్యూనిస్టుపార్టీలు ఆత్మ విమర్శన చేసుకున్న ఉదాహరణలు చాల వున్నాయి.

మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాలకు కట్టుబడివున్న పార్టీని కొన్ని భేదాభిప్రాయాలున్నాయనే కారణంతో అది "కమ్యూనిస్టు పార్టీ" కాదు; "సోషల్ డెమాక్రటిక్" పార్టీ మాత్రమేననే నిందకు పూనుకోవడం, అది వారికి ఆత్మతృప్తి నివ్వవచ్చు. కాని అది నిజం ఎలా కాగలదు? వాటి గీటురాయి ఏమిటి?

జాతీయ ప్రజాస్వామ్య భావనతో ఏకీభవించకపోవచ్చు. అది మధ్యంతర దశ. ఆ తరువాత సాగే సోషలిజం పరివర్తనా దశలో కార్మికవర్గ నాయకత్వం అనివార్యంగా వుంటుంది. సోషలిస్టు విప్లవాన్ని ఎవరు నిరాకరించారు? దానిలో కార్మికవర్గ నాయకత్వ పాత్రను ఎవరు నిరాకరించారు? ★

COMMUNISM (Telugu Monthly) Regd. No. H / V 3 / 78

# తప్పక చదవండి!

**మారుతున్న ప్రపంచంలో కమ్యూనిజం**

—బోరిస్ పొనమరోవ్

1848 కమ్యూనిస్టు ప్రణాళిక కాలంనుండి నేటి వరకు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రను, విప్లవోద్యమ సమస్యలను రచయిత ప్రతిభావంతంగా వివరించాడు.



Edited and Published by B. Nageswara Rao for the A.P. Council of C.P.I.
Himayat Nagar, Hyderabad.
Printed by him at Swatantra Art Printers, Vijayawada-4.

BC



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M139** |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | NAVYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |